# మన మతములు



శ్రీ శ్రీవిక్రమదేవవర్మ

పూర్వకాలమునందు భారతదేశమున నేది 'ధర్మ'నామముతో వ్యవహరింపఁబడుచుండెనో, అదియే యిప్పుడు 'మత' మను పేరుతో వాడఁబడుచున్నది. ధర్మ మనఁగా ఆచరణీయకార్యము. మత మనఁగా నభిప్రాయము.

భారతీయధర్మమునకుఁగాని, మతమునకుఁగాని శ్రుతిస్మృతులే యాధారములు. శ్రుతియొక్క యపరనామములే వేదము, నామ్నాయమును. దానినుండి ధర్మాధర్మములు శ్రుతము లగుచుండుటవలన అది శ్రుతి యనఁబడుచున్నది. మఱియు నే మంత్రముయొక్క ఋషి యోగనిష్ఠాపరుఁడై యుండినపు డతనికి నా మంత్రము వినఁబడినవలన దానికి శ్రుతినామము గలిగెను. ఋషి మంత్రద్రష్టయె; కాని తద్రచయిత గాఁడు. కనుక శ్రుతి యపౌరుషేయము. దానినుండి ధర్మాధర్మములు తెలియఁబడుచుండుటవలన నది 'వేద' మనంబడెను. అది పారంపర్యముగా నభ్యసింపఁబడుచుండుటవలన అది 'ఆమ్నాయ' మనంబడెను. మహర్షులు వేదార్థమును స్మరించి రచించిన గ్రంథములు 'స్మృతులు'. శ్రుతి స్మృతి ప్రోక్తమతములె ఋషులవి. ఋషులు ఆర్యులు. వారి మతము 'ఆర్ష మతము'. ఆగమశాస్త్రోక్తమతము ఆగమమతము. అది శాక్తాగమ, శైవాగమ,

[illegible]వరణము

[illegible]జాలు

సాధారణముగా నిప్పు డవలంబించియుండు మతములను గూర్చియె ముచ్చటింతును.

ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, అచింత్య భేదాభేదమతము అను నాలుగు మతములె ఈదేశమునఁ బ్రబలియున్నవి. ద్వైతమతము జీవేశ్వరభేదము, జడేశ్వరభేదము, జీవజీవభేదము, జడజీవభేదము, జడజడభేదము అను నైదు భేదములు గలది. అద్వైతమతమునందు బ్రహ్మముమాత్రమె సత్యము. తదన్య మసత్య మనియు, జీవుఁడు ఈశ్వరుని ప్రతిబింబ మనియుఁ జెప్పఁబడియున్నది. అది శుద్ధాద్వైత మనియు, శాక్తాద్వైత మనియు ద్వివిధము. శుద్ధాద్వైతమునందు బ్రహ్మ మొకటియె నిత్యము. శాక్తాద్వైతమునందు శక్తితోఁ గూడిన బ్రహ్మమే నిత్యము; అందు బ్రహ్మశక్తులకు భేదము లేదు. విశిష్టాద్వైతమునందుఁ బ్రకృతి జీవేశ్వరుల కభేదము చెప్పఁబడుటయె కాక, ఈశ్వరుఁడు ప్రకృతిజీవుల అంతర్గతుఁడనియుఁ జెప్పంబడెను. అది విష్ణువిశిష్టాద్వైత మనియు, శివవిశిష్టాద్వైత మనియు ద్వివిధము. అచింత్య భేదాభేదమతమునందుఁ బ్రకృతిభేదము గలదియైనది ఈశ్వరశక్తివిశేష మనియు, జీవేశ్వరులకు వస్తుతః భేదము గలద[illegible] గుణతః అభేద మనియుఁ జెప్పఁబడెను.

పైని పేర్కొనఁబడిన నాలుగు మతముల వారికి ముక్తిసాధనములు జ్ఞాన, భక్తి, కర్మ

యనుకొంటిని. వాడు బ్రదికియున్నచో నీ యనాథ రక్షకుడు మఱియొక యవతార మెత్తవలయును.

భాను—అట్లని మేనల్లుని జంపుకొనునా?

దుర్యో—మేనమామను జంపినవాడు మేనల్లుని జంపలేడా! లోకములో బౌరుషము నెగ్గకూడదు. దైవము, తదాభాసయగు తాను నెగ్గవలయును.

భాను—ఆయన సర్వనియంత కదా!

దుర్యో—కానిమ్ము; తాను స్వయముగా నిరంకుశత్వము సాగింపు మనుము. అనాగరుల ద్వారా తన సర్వాతిశాయిత్వమును జూపుట యేలయుగులకు? నిన్న చూడలేదా? ప్రొద్దుగ్రుంకకమున్న సైంధవుని తల బడ చేయగునన్న యనాకరు గాడై ప్రొద్దుగ్రుంకిన దన్న భ్రాంతికల్పనమున సుదర్శనము నుపయోగించెను. ఇట్టివాని నాశ్రయించుటవలన బంగారుయుగముల పగుపు కూడ బోవుచున్నది. ఆ పనివాడు వచ్చినవాడు గాని వీడు వచ్చిన బాగుగ నుండియుండును.

భాను—ఇతడు నరుడు. నరనారాయణు లొక్కటే తేజము.

దుర్యో—ఆ యాదిబుసికి స్త్రీత్వము, నీ పేడి తనము వ్రాసిపెట్టిన దేమి?

భాను—అది వారి లీల.

దుర్యో—అన్నియు వారి లీలలే. 'నేను' అను పదార్థమునందలి మహిమను వీరెఱుగ్గు నికృష్టజీవుల సృష్టి మితిమీఱిపోవుచున్నది.

భాను—స్వామీ! మన పురుషకార మెంత తలముకొన్నను పాదమాత్రమే కదా! తక్కిన మూడు పాదములు పురుషుడే వ్యాపించి యుండును.

దుర్యో—పురుషత్వ మెప్పుడును బూర్ణస్వరూపముతోడనే యుండును. దాని యాభాసమే పాదమాత్రమై యుండును.

సేవకుడు—(ప్రవేశించి) దుర్యోధనమహారాజులకు జయము జయము. ఘటోత్కచుడు మరణించినాడు. ఈ శుభవార్త మీకు దెల్పుమని కర్ణమహారాజులుంగా రాజ్ఞాపింపగా వచ్చితిని.

దుర్యో—ఘటోత్కచకుమారు డెట్లు మృతిజెందెనురా?

సేవ—కర్ణమహారాజులుంగారు ప్రయోగించిన యింద్రదత్తశక్తివలన.

భాను—స్వామీ! అది యిన్నాళ్లు అర్జునుపై ప్రయోగించుటకు దాచియుంచిరి కదా!

దుర్యో—పాండవసేనాశిబిరములో నేమియు లేమి?

సేవ—ఘటోత్కచుడు పడిపోవగనే శ్రీకృష్ణుడు పాంచజన్యమును బూరించి, చేతికోల నైచిపోయి యర్జునుని కౌగిలించికొని సంతసించెనట.

భాను—పరమేశ్వరుని కరుణాశీల మెంత ప్రశంసనీయము!

దుర్యో!—(సేవకునితో) సరే, నీవు పోయి మిగిలిన రాత్రిసమస్తమ్మును జెల్లా చెదరు సేయుమని నా మాటలుగా గర్ణునితో జెప్పుము.

(సేవకుడు నిష్క్రమించును)

భాను—పాపము, హిడింబ కెంత పాటు వచ్చినది!

దుర్యో—నీకంటెనా? ఉత్తరాసుభద్రలకంటెనా?

భాను—దేనికి దానికే - ఆ కుఱ్ఱవాడెప్పుడుగా కురువంశకేతనమువలె నుండెడివాడు.

దుర్యో—వాని చావునకు శ్రీకృష్ణుడు సంతసించెనట వింటివా?

భాను—ఆ సంతోషము తన భక్తుని రక్షింపగల్గితిమిగదా యని.

దుర్యో—అవును. ఇన్నాళ్లును గర్ణుడా శక్తి నర్జునునిపై ప్రయోగింప మఱచిపోవుచుండెను.

భాను—అది శ్రీకృష్ణదేవుని మాయయే.

దుర్యో—కాదని నే ననుట లేదు. మోసగాండ్ల వంటివారిని జూచి యేరుచున్నాడు. ఈ భూమిని తుదకా పుంస్త్వవిహీనుల కీయవలయు నని సంకల్పము.

భాను—ఘటోత్కచుడు పాండవపక్షీయుడు కదా!

దుర్యో—వెఱ్ఱిదానా! అభిమన్యుడు కాడా? వానికొఱకు నే నెందులకు దుఃఖించితినో వీనికొఱకు నే నందులకే దుఃఖించుచున్నాను.

భాను—అతడు రాక్షసీసంజాతుడు.

దుర్యో—అందుచేత హంతవ్యుడా? మగటిమి గల బిడ్డ కావున హంతవ్యుడా? ఆ యింద్రదత్తశక్తికి నర్జునుని బలిసేత యిష్టములేనివాడు దానిని మఱియొక మాదిరిగా బరిహరింపలేడా? ఆ కుఱ్ఱవాని ప్రాణమే కావలసివచ్చెనా?

భాను—ఎవ్వరు పోయినను నాయైదుగు రాయనకు బంచప్రాణములు, పంచేంద్రియములు, పంచభూతములు.

దుర్యో—నే నా పంచభూతములను సంహరించి యాయన నొక్కనినే మిగిల్చెదను.

## 3

[భానుమతి : దుర్యోధనుడు]

దుర్యో—అశ్రవ్యమైనదానిని వినినంతమాత్రమున బ్రాయోపవేశమున బ్రాణపరిత్యాగము చేయవలయునా?

భాను—ఆ మహనీయుని మనోమార్దవ మట్టిది.

దుర్యో—కాదు, ఆ మనస్సున కున్న సంసారకాపీన మట్టిది.

భాను—ఆ తల కోయుటకు వాని చేతు లెట్లాడెనో!

దుర్యో—శపహంతకులతో నాకు పోరు - నా యదృష్ట మెట్టిదో చూడుము.

భాను—గురుపుత్రుని నారాయణము విఫలమయ్యెనుగదా!

దుర్యో—విఫలము గాక యేమగును? మొలత్రాడు గట్టిన మగవా డెదురులేనప్పు డా యస్త్ర మేమియును జేయదు. పైగా వారెల్లరు నమస్కారము చేసిరి.

భాను—విష్ణుదేవుడు నమస్కారప్రియుడు.

దుర్యో—సర్వసర్మపరిత్యాగము చేసినవాడు స్వయంభువే యగును. అప్పు డొకనికి శరణనవలసిన యగత్యమే మున్నది?

భాను—ఉపాధిభేద ముండునుగదా?

దుర్యో—ఉపాధి కల్పితము. పరిత్యాగము చేసిన వాడు శరణన్నచో రెంటిలో నేదియో యొకటి మిథ్య కావలయును.

భాను—అందఱును నమస్కరించిరా?

దుర్యో—ఒక్క భీముడుమాత్రము చేయనని తిరుగబడినాడు. వా డొక్కడే నాకు సరిజోదు.

భాను—పాశుపతధారియు నమస్కరించెనా?

దుర్యో—వాని మొగము! అహంప్రత్యయము వానిలో జివికి జీర్ణమైపోయినది. తాత శిఖండి మొగమును జూచె ననెనుగాని వీని మొగము నసలు చూడగూడదు.

భాను—అశ్వత్థామయు గొప్ప పాశుపతవ్రతియే. ఆయనయస్త్ర మిట్లగుటకు హేతు వేమో?

దుర్యో—ఆయన పాశుపతుడుగాని వైష్ణవుడు కాడుగదా! కుబ్జమొదలు కుంతికొడుకులవఱకు గల యనాథుల రక్షించుట కెత్తిన యవతారమాయెను.

భాను—స్వామీ! ఆ దేవదేవునితో మీ కేందుకు? అహంకారుల నాయన క్షమింపడు. భక్తులను బరిత్యజింపడు.

దుర్యో—ఆయనతో నా కేందుకు? అహంప్రత్యయమే తానై దానికే మూలచ్ఛేదము చేయుచున్నాడన్న జిజ్ఞాసయే నాకు బట్టినది.

భాను—అది యావరణవిశిష్టమైనప్పు డాయన యేమిచేయగలడు?

దుర్యో—ఆవరణవిశిష్ట మగుట స్వభావజన్యము.

భాను—స్వభావము జడము. ఆయన ప్రకాశస్వరూపుడు.

దుర్యో—ప్రకాశమున కావరణలేక స్థితి లేదు.

భాను—ఇక మీ రేమి చేయుదురు?

దుర్యో—ఏమి చేయుదునా? అశ్వత్థామరూపమైన యహంకారము నుద్దీపింపజేయుదును. అది పాండవేయదారగర్భములవఱకు వ్యాపించునట్లు చేసెదను.

భాను—గురుపుత్రుడు బ్రహ్మశిరమును సుదర్శనమున కుద్దిపెట్టెనుగదా!

దుర్యో—అప్పుడు మాయచేసి యతనిని బంపివైచెను.

భాను—గురుపుత్రు డప్పుడు సుదర్శనము నెత్తనేలేకపోయెను.

దుర్యో—ఎందుచేత ?

భాను—అది సాత్త్వికశక్తి. ఇతడు తమోగుణ ప్రధానుడు.

దుర్యో—గుణభేదము కల్పితము. మిథ్యయైన దానిని విభాగించి యింకను మిథ్యచేయుట.

భాను—గురుపుత్రు డెట్లును కృతార్థుడు కాజాలడు.

దుర్యో—సత్త్వము తమస్సును బూర్తిగా నశింపజేయును. తమస్సు సత్త్వమును బూర్తిగా నశింప జేయును.

భాను—అప్పుడు మిగులునది యేమి ?

దుర్యో—నీవు, నేను.

భాను—శ్రీమన్నారాయణుడు.

దుర్యో—సుయోధనపత్నీ ! నే నెవ్వరు ?

భాను—మీరు సుయోధనమహారాజులు.

దుర్యో—కాదు. అవును, నేను సుయోధనుడనే.

భాను—స్వామీ ! నా కిది యంతయు నగమ్యముగా నున్నది.

[తెరలో]

"అశ్వత్థామ కోట్లల కాగలేక కిరీటి సమరరంగమున మఱొకరియెడ కేగినాడు."

దుర్యో—భానుమతీ ! వింటివా ? పురుషకారముముందు దైవ మెట్లు తూగాడుచున్నదో ?

భాను—స్వామీ ! ఆ తూగాడుచున్నది దైవము కాదుగదా !

దుర్యో—దైవము కా దందువేమి ? పురుషకారాభావమే దైవము. తాత వెత్తిభక్తి, ఆచార్యుని మనోమార్దవము, అశ్వత్థామ యతివిశ్వాసము దైవముగా మారినవి. అట్లుగాక పొలుపొచ్చె మింతయేని లేని పురుషకారము బ్రహ్మత్వము. అశ్వత్థామ యిప్పుడు ప్రమాదరహితమైన స్థితిలో నున్నాడు. అందుచేత నతనిముందు దైవసాధనభూతు డల్లాడుచున్నాడు.

భాను—స్వామీ ! కేవలపురుషకార మనునది సాధ్యమా ?

దుర్యో—సాధ్యమే. దానిని స్థాపించుటకే నా జీవితము నాత్మార్పణము జేయుచున్నాను.

భాను—పురుషకార మహంకారాత్మకము కదా !

దుర్యో—నేను సర్వప్రపంచము, సర్వప్రపంచము నేనను నహంకారము పరతత్త్వరూపము.

భాను—ఆ పరతత్త్వసిద్ధి భౌతికములైన యుపకరణములతో సమకూడునా ?

దుర్యో—ఉపకరణములలో నే మున్నది ? సాధకుని మెలకువలో నున్నదిగాని.

౪

[దుర్యోధనుడు—రాధేయుడు]

దుర్యో—రాధేయా ! కృష్ణుడు దైవమా ?

రాధే—ఎప్పటినుండి ?

దుర్యో—నీవు మీ తల్లిని గంగాకూలమున దర్శించినది మొదలు.

రాధే—మిత్రమా ! రాధేయదుర్యోధనుల మైత్రినిగూడ శంకించుచుంటివా ?

దుర్యో—మఱి నిన్న నీవు చేతికి జిక్కిన పాండవుల నేల వదలిపెట్టితివి ?

రాధే—దీనికిని కృష్ణుడు దైవమా యనుటకు నేమి సంబంధము ?

దుర్యో—ఏమియు సంబంధము లేదు. చేతికి జిక్కినవారి నెల్ల వదలి నీమైత్రి నెట్లు పాలించెదవు ?

రాధే—దుర్యోధనమహారాజా ! పాండవమధ్యముడైన యర్జునుని హరిహరాదు లడ్డినను వధించి తీరెదను.

దుర్యో—అప్పుడు నీ తల్లి జ్ఞాపకమురాదా ?

రాధే—మిత్రమా ! ఈ నిష్ఠురము లెందులకు ?

దుర్యో—యాథార్థ్యము నిష్ఠురముగనే యుండును. నీయొద్ద భార్గవాదిమహాస్త్రములున్నవి. అర్జునుని

మీది పగతో నాగాస్త్రము నిప్పాశ్రయించియున్నది. నీవు నీయంతరు వెఱుంగక యిట్లు మనసుమెత్తపడినచో దుర్యోధనుకార్యము నేల గలసిపోవును.

రాధే—సుయోధన మహారాజా! దైవము, కాలము వీని సంయోగ మదృష్టమని చెప్పబడును. అది చాలనప్పుడు పురుషుడు వ్యగ్రుడగును.

దుర్యో—ఇది రాధేయునివంటి పౌరుషశాలికి దగిన మాటయేనా?

రాధే—రాధేయుడైనను దుర్యోధనుడైనను దుశ్శాసనుని బ్రదికించుకొనలేకపోయిరిగదా!

దుర్యో—దుశ్శాసనుని చావు నేను సమాధిలో నుండగా జరిగినది.

రాధే—ద్రోణుడుగూడ సమాధియం దుండగనే దుస్ససేనుడు తల నఱికెను. ఆ సమాధియే యదృష్టము.

దుర్యో—ఇక మనము యుద్ధముసేయు టెందులకు? కానలకు బోయి తపస్సు చేసికొనవచ్చును.

రాధే—మనము తపస్సు చేయుచునే యున్నాము. శస్త్రధారాతీర్థనిమజ్జనము చేయుచు నిత్యము దైవాదృష్టముల పరిణామమును శస్త్రాస్త్రములచే గొలత వేసికొనుచున్నాము.

దుర్యో—ఎందులకయ్యా! నిక్కమైన కర్మవీరునివలె నభినయించెదవు. నీమనస్సులో, నీయాత్మలో శ్రీకృష్ణునిమీద భక్తి యున్నదా లేదా? నిజము చెప్పుము.

రాధే—ఉన్నది.

దుర్యో—అయినచో యుద్ధ మెందులకు?

రాధే—ఎందులకా? దుర్యోధనునికి నేను బడియున్న ఋణము తీర్చుకొనుటకు.

దుర్యో—నీవు నా కప్పుపడిలేవు. ఒకవేళ నున్నను నది యీనాటితో విముక్తియైనది. నీవు పోయి పాండవపక్షమున జేరుము.

రాధే—నాయప్పు ప్రాణములతో దీరునది కాని మాటలతో దీరునది కాదు.

దుర్యో—నీ వొకండవు, రుక్మి యొకడు—మీ రిద్దరును విచిత్రవ్యక్తులు.

రాధే—రుక్మితో నన్ను జేర్పకుము. వాడు వట్టి యహంకారి. నేను ఫలాభిలాష లేకుండ కర్మయోగసిద్ధినొందుటకై తంటాలుపడుచున్నవాడను.

దుర్యో—నీ కర్మఫలమంతయు శ్రీకృష్ణునకు దారవోసెదవు కాబోలు.

రాధే—అవును. ప్రకృత్యాదికములన్నియు హవీరూపము నొందును.

దుర్యో—ఇది కర్మమార్గమా? భక్తిమార్గమా?

రాధే—రెండింటి సమష్టి.

దుర్యో—ఎందులకయ్యా మీరెల్లరు నిట్లు భక్తి నభినయించెదరు? ఇది మీపౌరుషమునకు ఆత్మగౌర నూత్రికి—మీ యుపాధియందున్న పరంజ్యోతికి—మచ్చయగునా కాదా?

రాధే—సుయోధనమహారాజా! నీవు కేవలాద్వైతివి. నీమార్గము సర్వజనసులభమైనది కాదు—ఉపాధిబద్ధులకు భక్తిరహితమైన కర్మమార్గ మగమ్యము. ఉపాధివిహీనమైన పరంజ్యోతి యస్మాదృశుల కనుభూతివిషయమైనది కాదు.

దుర్యో—అయినచో పాండవుల నెందులకు వదలి పెట్టితివి?

రాధే—నన్ను నీ వర్జునున కుద్దిపెట్టితివి. అర్జునునిచేత నేనో, నాచేత నతడో యంతమొందవలయును.

దుర్యో—నీ వర్జునుని జంపలేవు.

రాధే—లేనని నాకు జిన్ననాడే తెలియును. వానిని జంపలేక యసమర్థులైన వాని యన్నదమ్ముల జంపుట హింసయగును. నే నది చేయ దలపెట్టలేదు.

దుర్యో—నీవు పూనిన దహింసావ్రతమా? మాతృవాక్యపరిపాలనవ్రతమా?

రాధే—వెఱ్ఱివాడా! నాకు మాతృసోదరప్రేమ యున్నచో నభిమన్యు ఘటోత్కచుల నెందులకు జంపింతును? వృషసేను నెందులకు జంపుకొందును?

దుర్యో—భక్తి, భక్తి యనుచు నుపాధులమీద నున్న మమకారమును, మీయాత్మలలో నావరణ

రూపమున నున్న ప్రకృతివైకల్యమును బోషించు కొనుచున్నారు.

రాధే—కావచ్చును. ప్రకృతి సాయము లేనిది ప్రకృతిని జయించుట కష్టము.

దుర్యో—అంగపతీ! నీవు ప్రకృతి కతీతుడవైన పౌరుషపరంజ్యోతివని నమ్మి మోసపోయితిని.

రాధే—మిత్రమా! నిన్ను నేను సూదిమొన మోపినంతయు మోసగింపలేదు. నా తనువు, నా యసువులు, నా పుత్త్రమిత్త్రాదుల యసువులు నీవి.

దుర్యో—నీ యాత్మ నాది కాదు. తక్కిన వానితో నాకు పనిలేదు.

రాధే—అద్వైతచక్రవర్తీ! నా యాత్మ నీది కాదనుటలో యాథార్థ్యము కలదా?

దుర్యో—నీ నా సాధర్మ్య ముపాధిబద్ధమైనది. అది నాకు ద్రోణాదులతో గూడ నున్నది. మా యశ్వత్థామవలె నీవును నాకు సధర్ముడ వనుకొంటిని.

అశ్వత్థామ—(ప్రవేశించి) మహారాజా! జయము జయము. నేడు కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము జరుగును. కర్ణుడు పార్థు నోడింపలేడు. నే నతనికి సాయమయ్యెదను.

రాధే—(నవ్వి) బ్రాహ్మణుల సాయము నా కక్కరలేదు.

అశ్వ—ఓయీ! బ్రహ్మవేత్తా! భీష్మాచార్యులవలె శ్రీకృష్ణుని చక్రమున కెఱ గానుంటివి కాబోలు. అంత యదృష్టము నీకు బట్టదు. నీవు పార్థుని వాడికోలల జావవలసినదే.

రాధే—గురుపుత్త్రుడా! అట్లే యగుగాక! నరనారాయణు లేకమూర్తియే!

అశ్వ—అబ్బో! ఏమి పురాణజ్ఞానము! తమ్ముని జంపలేని పిఱికిపంద యిట్లనక యేమనును?

రాధే—పిఱికిపందనై తండ్రి నొకడు తలగోయ మిన్నకుంటినా?

దుర్యో—మిత్రమా!

అశ్వ—మఱల జెప్పుచున్నాను. దుర్యోధనన ప్రీతికరముగ నీకు బ్రహ్మశిర మిచ్చెదను. దానితో బాండవేయుల పిల్లపిల్లతరమున జంపుము.

రాధే—ఓయీ బ్రాహ్మణవంశసంజాతుడా! ఆపని నీవు చేసి మూడువేలేండ్లు కుష్ఠవ్యాధిగ్రస్తుడవై భూలోకమున బడియుండును. నే నస్త్రజ్వాలాముఖమున నూర్ధ్వలోకములు చూఱగొందును.

శల్యుడు—(ప్రవేశించి) రాధేయా! రథము సజ్జితమైనది. నీ వూర్ధ్వలోకమున కేగుటకు సర్వమును సిద్ధపఱచితిని.

రాధే—ఛీ! ధర్మద్రోహుడ వగు నీ మొగము చూడరాదు.

శల్య—నా మొగము చూడకపోయినను బార్థుని మొగము నేడు చూడక తప్పదు.

రాధే—కర్మయోగినై కైవల్యము నొందగోరు నా కెట్టులైనను బాధలేదు. ఓపు విల్లు పట్టనేరని ధర్మజునిచేత బడనున్న నీ సంగతి చూచుకొమ్ము.

శల్య—భావన యెట్టిదైనను మృతిమాత్రము తప్పదు.

దుర్యో—ఓయీ! అనాత్మవేదీ-మృతి యెవ్వరికి?

శల్య—కర్ణభావనకు, దుర్యోధనమిత్ర భావనకు, కురువంశ రక్షణభావనకు, పాండవనాశభావనకు.

దుర్యో—ఈ సంగరము జడచైతన్యములకా, చైతన్యయుగ్మమునకా జరుగుచున్నది?

శల్య—అది యధికారిభేదమునుబట్టి నిర్ణయింపబడును.

దుర్యో—రాధేయా! నీవు పోయిరమ్ము. నీకు జయమగుగాక! శివోఽహం.

౫

[భానుమతి : దుర్యోధనుడు]

భాను—నాథా! నేను మొదటనే చెప్పితిని గదా!

దుర్యో—ఏమని?

భాను—ఈ యుద్ధములో మీకు జయము లేదని.

దుర్యో—వెఱ్ఱిదానా! ఈ యుద్ధములో జయించినది నేనే. శ్రీకృష్ణుడు మాయలు పన్ని పాండవులు జయించినట్లు లోకమునకు జూపించెను.

భాను—ఏమైనను వారు సేవలతో, బిడ్డపాపలతో సుఖముగ నున్నారు. మీ రొంటరియై జలస్తంభనవిద్యచేత నిందు దాగియున్నారు.

దుర్యో—నే నిందు దాగియున్నది భయముచేత గాదు. స్వామియొక్క ప్రత్యక్షరూపమును నా మహాప్రస్థానమునం దొక్కమాఱు ప్రత్యక్షానుభవములోనికి దెచ్చుకొనుటకై యిం దుంటిని.

భాను—లోక మట్లను కొనవలదా?

దుర్యో—లోకముతో నా కేమి పని?

భాను—స్వామీ! నాకుగూడ ననుజ్ఞయిండు.

దుర్యో—దేనికి?

భాను—మీతో ననుగమనమునకు.

దుర్యో—ఏ లోకమువఱకు?

భాను—పతి ననుగమించు సతి కే లోకమువఱకు సెల వున్నదో యా లోకమువఱకు.

దుర్యో—సతీ! తక్కిన యందఱును నన్ను వదలిపోయినారు. నీ వొక్కర్తుకవు నన్ను బట్టుకొని వ్రేలాడుచున్నావు.

భాను—స్వామీ! మీరు, నేనేగదా శాశ్వతము.

దుర్యో—అవును.

భాను—ఇప్పుడు పాండవులు వచ్చినచో మీ రేమి చేయుదురు?

దుర్యో—గదాయుద్ధము.

భాను—శ్రీకృష్ణదేవుడు కౌమోదకి నాహ్వానించునేమో?

దుర్యో—అంతకంటె గావలసిన దే మున్నది? నా గదారూపమైన పౌరుషమునకు గూడ వైఫల్యమాపాదింపగలడేమో చూచెదను.

భాను—ఇంకను సందియ మున్నదా స్వామీ!

దుర్యో—అప్పుడు నే నీ శమంతపంచకమునందే జీవకైవల్యము నొందెదను.

భాను—మీకు శ్రీకృష్ణదేవునిపై భక్తి పొంగి వచ్చుచున్నది.

దుర్యో—ఇది భక్తి కాదు, ఎఱుక.

భాను—భక్తియు నెఱుకయు నొకటి యనియే గదా గీతాపురుషుని యాదేశము.

దుర్యో—[illegible]! [illegible]కి [illegible]తివి. "కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధః" అని యాయన చెప్పినది. [illegible]మిందు పౌరుషజ్యోతి నాలో [illegible]ము.

## ౬

[భానుమతి : దుర్యోధనుడు]

దుర్యో—అది సరే, ఆ దొంగపోటుతన మెందుకు? ఆ కౌమోదకిని దీసి నన్ను మర్దింప రాదా! ఎంతమో సంతసించియుందునే—తాత కొఱకు చక్రమును బట్టెనుగదా! సైంధవవధ నా డవసరమునుబట్టి యేమో యని దారుకునిచేత దన రథమును దప్పించెనుగదా! నన్నుమాత్ర మా లద్దెపురుషునిచేత నధర్మముగా జంపించెను.

భాను—స్వామీ! ఏమైన నేమి? కావలసిన కార్యము జరిగినదికదా!

దుర్యో—నేను నేనని, నేను దాను నొకటి యని యిన్నాళ్లు గూర్చొనియుంటిగదా! నేను దాను వేఱని నిక్కృష్టునివలె దన్ను సేవింపలేదనియే కదా యీద్రోహము. ఇప్పుడు మాత్ర మేమైనది? నేను నేను గాకుండ నితడు చేయగలడా!

భాను—ఆయనకరుణ లేనిదే మన మేమి చేయ గలము?

[illegible]ణ—కర్మఫల ప్రదాతయైనవానికి [illegible]డును? నా కీయనకరుణతోడి పని యేమి! [illegible]నర్చిన సత్కర్మమునకు దగిన ఫల మిచ్చుటలో నింత పక్షపాత మెందుల కంటిని. వాని రథము మహాస్త్రవహ్నులపాలు గాకుండ వానిని ముందు దించి తాను దరువాత దిగెనట. ఈ పదునెన్మిది నాళ్లలో దాను లేనిచో వాడు ప్రతిక్షణమ్మృతి నొంది యుండును. అట్టి యానదకు దన ప్రాపు దేనికి?

భాను—మ గ్గాలకిశోరములకు దల్లిప్రాపు విశేషముకదా!

దుర్యో—తన్నెఱుగనివాఁ డంధుడు. సత్త్వ మును వీడి దిగివచ్చి యావరణవిశిష్టుఁడైన వాడు పంగువు. పంగుని బుజములపై నంధు డధిరోహించగా నా వ్యవహార మెంత నక్కఱగానైన నుండును. నాకేమి! ఈనికృష్టప్రపంచమునకు అహంపదార్థ విశిష్టత ప్రకటించుటకు బాటుపడితిని. నా శాఖలనే సంహరింపగల్గెనుగాని నన్ను సంహరింపలేడుగదా! 'నైనం ఛిందంతి శస్త్రాణి' యని తానే చెప్పెను. ఇదిగో, గురుపుత్రుడు వచ్చుచున్నాడు.

అశ్వత్థామ—(ప్రవేశించి) దుర్యోధన మహా రాజా! బ్రదికియుంటివా? పాండవసేనావారము నంతను సంహరించితిని. ధృష్టద్యుమ్నుని, ఉపపాండవు లను సంహరించితిని. పాండవులు లేవ్వరును, శ్రీకృష్ణు డును మాత్రము కానరాలేదు.

దుర్యో—మిత్రమా! నేను బ్రదికియేయుంటిని. ఇంక శాశ్వతముగా జీవింపగల్గుదునుగూడ. పౌరుష మూర్తివి, నీవంటివానిని మిత్రునిగా బడసి నిక్కముగ బ్రహ్మానందము నొందితిని.

అశ్వ—నీకు బరలోకమున మేలు గలుగుగాక!

దుర్యో—పిచ్చివాడా! పరలోక మెక్కడ నయ్యా! నేను పదాకృతినై సర్వలోకాతిశాయియైన బ్రహ్మత్వము నొందితిని. అహంపదార్థలక్షితమైన పర వస్తువు నేనే యైతిని. నా మిత్రకోటిలోని కెల్ల నీవే పరమార్థవేదివి.

అశ్వ—ఏమియైనను సమయమునకు నీ కక్క రకు రాకపోతినిగదా!

దుర్యో—ప్రాపంచిక మెల్ల తుచ్ఛము. అది కావలయు ననుకొన్నచో నాడే శ్రీకృష్ణుని ప్రాపు నొందియుందును.

అశ్వ—అతని ప్రాపు గన్నవారికైన లేరిగదా!

దుర్యో—ఆ యసమర్థగర్జనలతో మన కేమి పని? కాని నీవు జాగ్రత గలిగియుండవలయును. ఊపు వారు నీమీదికి దండెత్తివత్తురు.

అశ్వ—రానిమ్ము. బ్రహ్మశిరము లేదా? పాండ వేయదారగర్భపర్యంత మపాండవముగా దానిని బ్రయోగించెదను.

భాను— పాండవేయదార గర్భములలో నొకటి మాత్రము మిగులును.

దుర్యో—ఉత్తరాగర్భము కాబోలు. సరే మిగుల నిమ్ము. ఆ యస్త్రము మర్జుండు నెఱుగును. అందుచేత నపాండవము కాదు. భానుమతీ! ఇప్పటికి గోచర మైనదా? తన యతీతమాయావిలాసముచే న న్నెట్లు చేసెనో, నా యకుంఠితపౌరుషప్రభావముచే దాను నట్లయ్యెను. ఇక మిగిలినది మే మిగావురమే. నీకు సహగమనమున కనుజ్ఞనిచ్చితిని. అదిగో దేవతలు పూలసోనలు గురియించుచున్నారు. పంచభూతములో, పంచేంద్రియములో, పంచతన్మాత్రలో, యీ యైదు గురితోడనే యూరేగనిమ్ము. ఆయనయే శాశ్వతుడు. తనతో పాటాయైదింటిని శాశ్వతముగ నిలుపవలయు నని యాయన యిచ్ఛ. కాని యవి కాలవశంగతములై యూరుపేరు లేని చావు చచ్చును. నా కేమి? ప్రకృతి స్వరూపిణివి, నీ ప్రేమభారములో, పౌరుషప్రథ మావతారమూర్తి గురుపుత్రుని మైత్రీసంపదతో నేను సచ్చిదానందమయుడనై ప్రకాశించెదను. అహం బ్రహ్మాస్మి-బ్రహ్మైవాహం. (తెర)



# ఆరంభవాదము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ఆందరకును జగద్రూపమగు కార్యము కనిపించుచున్నది. దీనిని సృజించిన వా డెవడు? లేక దేనివలన నిది యగుచున్నది? అనగా, ఈ కార్యమునకు కారణ మేమి? ఆ కారణముతో ఈ కార్యమునకు గల సంబంధ మేమి?

ఈ సంబంధము ప్రాయికముగా మనకు కానరానిది. మానవుడు కార్యకారణ సంబంధమును కనుగొనక ఒక అడుగేని ముందుల కిడజాలడు. ఈ సంబంధము నాలోచించి యాలోచించి అనాదికాలమునుండియు మానవు డెన్ని తత్త్వములను మనస్సముద్రమునుండి ఎగబోసెనో దాని కెవరేని లెక్క వేయగలరా? వైద్య పదార్థ రసాయన ఖగోళగణితాదు లగు మహాశాస్త్రముల యెరుక యెటులు కలిగెను? ఈ యెరుక మానవసభ్యత కెంతగౌరవము! భూతకాలభావనయే యీ విజ్ఞానమునకు దూరవీక్షణ యంత్రము కాదా? అది యటుండగా భవిష్యత్కాలపు నూతులలోనికి దృష్టి సారింతము. అదియు ఈ కార్యకారణభావనారూపమగు జ్ఞానసాహాయ్యము చేతనే కదా కనబడును! భవిష్యద్భావన లేని మానవులకు అభ్యుదయమార్గము కానబడదు, అడుగు సాగదు.

కార్యము భవిష్యత్తు. కారణము భూతము. తిరిగి కార్యము వర్తమానము. కారణము భూతము. కావున కార్యకారణములే మనకు భూతభవిష్యద్వర్తమానములు.

ఈ కార్యకారణముల పరామర్శమే దర్శనము. ఈరీతిగా దర్శనమే మానవుని సకలవిజ్ఞానమునకు పునాది. ఉపనిషత్తు, అవెస్తా, బైబిల్, కొరాన్ మొదలగు వేదాంతము లన్నియు అచలమగు ఈ భిత్తిపైనే నిలిచియున్నవి. కార్యకారణసంబంధమును సమగ్రముగా నెరుగజెప్పుటయే దర్శనముల యుద్దేశము. దర్శనము లన్నియు ముత్తెరగుల సిద్ధాంతముల నవలంబించి యున్నవని అనవచ్చును. అవి ఆరంభవాదము[1], పరిణామ వాదము[2], మాయావాదము, లేక వివర్త వాదము.[3]

## ఆరంభవాదము

కణాదుడును, గౌతముడును ఈ *యారంభవాదమునకు ప్రవర్తకులు. ఉత్ప

---

1. సమవాయ్యసమవాయి నిమిత్తకారణములు తమకంటె వేరగు కార్యమును పుట్టించునను ఆరంభవాదము నైయాయికులు వైశేషికులు మొదలగువారిది.

2. ఉపాదానకారణమే మారి కార్యమగు ననుపరిణామవాదము సాంఖ్యులు పాతంజలులు రామానుజీయులు మొదలగు వారిది.

3. శంకరానుయాయు లగు అద్వైతులది వివర్తవాదము. అతాత్త్వికమగు కారణాన్యథాభావము వివర్తము.

*"ఆరంభవాదః కణభక్షపక్షః
సంఘాతవాదస్తు భదన్తపక్షః
సాంఖ్యాదిపక్షః పరిణామవాదో
వేదాన్తపక్షస్తు వివర్తవాదః."

త్తికి పూర్వము కార్యము లేదు. కారణ సామగ్రి యెల్లయు కలిసిన ఉత్తరక్షణముననే కార్య ముత్పన్నమగును. కారణముకంటె కార్యము పూర్తిగా వేరని వీ రందురు.

### సమవాయి కారణము

కుమ్మరి ఒక కుండ చేయబోవుచున్నా డనుకొందము. అతడు మొదట నేమి చేయును? మన్ను నీరు బూడిద సారెకోల మొదలగువానిని చేతికింద ఉంచుకొనును. కుండ కివి యన్నియు కారణములే. ఆరంభ వాదు లీ కారణములలో మట్టినిమాత్రము సమవాయికారణ మని అందురు. ఏదేని కార్యము దేని యవలంబమున పుట్టి దేని యవలంబమున మెట్టి మఱీ దేన గిట్టునో ఆ కారణము సమవాయికారణము. లేక ఉపాదానకారణము. కుండ మట్టివలననే అగును. ఉన్నంతవట్టు ఆ మట్టి చిదురలనే ఆశ్రయించుకొని యుండును. వినాశకాల మున ఈ మట్టి మట్టిలోనే కలిసిపోవును. కావున కుండకు మట్టి సమవాయికారణము. లేక ఉపాదానకారణము.

### నిమిత్తకారణము

కుండ కీ సమవాయికారణమే కాక సారెకోల మరికొన్ని కారణములు కానబడు చున్నవి. కార్యముత్పన్నమగు పూర్వక్షణము వరకు ఇవి యన్నియు నుండవలయును. ఉత్పత్తియగు పిదప కార్యమునకు వీనితో పని లేదు. ఇట్టికారణము లన్నియు నిమిత్త కారణములు. కుమ్మరి సారె కోల మొద లగునవన్నియు నిమిత్తకారణములు. కుండ యగు పూర్వక్షణమువరకు వీని యపేక్ష యుండునుగాని ఉత్పన్నమయినతరువాత నివి యేవియు లేకున్నను కుండకు ధోకా లేదు. కావున కుమ్మరి మొదలగు కారణములు నిమిత్తకారణములు.

### అసమవాయి కారణము

ఇది సమవాయికారణము నాశ్రయించు కొనియుండును. ఈ అసమవాయికారణము నశించునేని కార్యముగూడ నశించును. ఇట్టి కారణమును ఆరంభవాదులు అసమవాయి కారణ మని యందురు. కుండకు ఈవలి యావలి రెండు పెంకుల కలయికయు, కోకకు నూలుపోగుల కలయికయు అసమవాయి కారణము.

ఒక కార్యమునకు సమవాయికారణము లనేకము లుండవలయును. ఒక కుండ చేయుటకు దానికి తగినన్ని మట్టియణువు లుండవలయునుగదా! ఈ సమవాయి కార ణము లన్నియు నొండొండ కలిసికొననిచో కుండ కాదు. కాన పుట్టబోవుముందు సమ వాయికారణము లుండవలసిన చందముగనే ఆ సమవాయికారణముల కలయికయు నుండ వలయును. ఆ కలయిక లేనిచో కార్య ముత్పన్నము కాదు. కావున ఏదేని కార్య మగుటకు సమవాయికారణములతోపాటు వాని కలయికగూడ కారణమని అంగీకరింప వలయును.

ఈ కలయికను నిమిత్తకారణములలో నొకటిగా ఏల చేర్పరాదు?

నిమిత్తకారణములు నశించుచో కార్యము నశింపదు. అసమవాయికారణము అనగా

సమవాయికారణముల కలయిక. విడివడుచో దానితోపాటు కార్యముగూడ విడివడును. అనగా నశించును. కావున నిమిత్తకారణముల స్వభావము వేరు; అసమవాయికారణముల స్వభావము వేరు. ఉదాహరణమున కొక కుండను చేకొందము. కుండకు నిమిత్త కారణములగు కుమ్మరి సారె కోల మొదలగువానిలో కుమ్మరి చచ్చినను సారె పగిలినను కోల విరిగినను కుండ పగిలి చెక్కలయి పోదు. రెండుపెంకుల కలయిక అసమవాయి కారణము. కుండ కావలి యీవలి కపాలముల కలయిక విచ్చుచో కుండయు విచ్చిపోవును. కావున నిమిత్తకారణములకంటె భిన్నముగా అసమవాయికారణమును అంగీకరింపవలయును.

ఓయీ! మట్టిచిదురలు నశించుచో కుండయు నశించును. కాన సమవాయికారణనాశమే కార్యనాశమునకు కారణము. ఇటు లయియుండగా మరల నొక క్రొత్త కారణమును ఏల నెత్తికెత్తుకొనవలెను? ఇది బరువు కాదా?

అగును. ఇది తప్పని బరువు. కార్యపు సమవాయికారణము లనిత్యము లయిన యెడల కార్యనాశమునకు కారణమగుట నిక్కమే. కాని కార్యద్రవ్యము లన్నిటియు సమవాయికారణములు అనిత్యములు కావు. ఎటులనిన, రెండు పరమాణువులు కలిసి ద్వ్యణుకమను కార్యము కలిగెననుకొందము. ఆరంభవాదుల మతమున పరమాణువులు నిత్యములు. కాబట్టి ద్వ్యణుకరూపమగు ఈ కార్యము నశించుటకు కారణ మేమి యని యాలోచింపవలసియున్నది. రెండు పరమాణువులును నశించిననే ద్వ్యణుకరూపమగు కార్యము నశించునని యనరాదు. ఏలన, పరమాణువులు నిత్యములు. వానికి నాశములేదు. కాన ఈ రెండణువులయు కలయిక చీలిపోవుటవలననే యీ ద్వ్యణుకరూపమగు కార్యము నశించు నని అనవలయును. ఏలన ఈ పరమాణువుల కలయికయే అసమవాయి కారణము. ఆ కలయిక ధ్వస్తమగుటజేసియే ద్వ్యణుకరూపమగు కార్యము ధ్వస్తమాయెను. కావున అసమవాయి కారణము వేరుగా సిద్ధించుచున్నది.

### కార్యము వేరు, కారణము వేరు

ఏ మట్టియణువులు కలిసి కుండ యాయెనో ఆ మట్టియణువులే కుండ యని మనకు తోచునుగాని ఆ యణువులే కుండ కాదు. మృత్పరమాణువులు కుండకు కారణము. కుండ మృత్పరమాణువుల కార్యము. కారణముకంటె కార్యము వేరు. మట్టిచిదురల ప్రోవే కదా కుండ యని యన జెల్లదు. కారణమే కార్య మగునెడల శిల్పులు కార్యము నిర్మింప ప్రయాసపడవలసిన పని లేదు. కారణముకంటె కార్యము వేరుకానియెడల కారణముతోపాటు కార్యముగూడ పూర్వసిద్ధమయి యుండవలయును. ఈరీతిగా పూర్వమే కార్యము సిద్ధించుచో దానికి వేర ప్రయత్నమెవరు చేయుదురు?

ఇంతియకాక కారణముచే ననుకూలపడు పనులు కార్యముచే సానుకూలములు కావు. అటులే కార్యముచే కాదగిన పనులన్నియు కారణముచే కావు. మట్టితో ఇల్లు మేగుకొననగునుగాని కుండతో నెవరును మేగజాలరుకదా! కుండతో నీరు తెచ్చుకొనవచ్చునుగాని కోట్లకొలది మృత్

పరమాణువులతో నయినను నీరు తెచ్చుటకు వలను పడదుగదా. మట్టియు కుండయు నొకటియే యగునెడల మట్టిపని కుండవలనను కుండపని మట్టివలనను జరగవలయును. అటులు జరగుటలేదు. కావున 'మట్టి వేరు, కుండ వేరు'అని అనితీరవలయును. ఈరీతిగా పెక్కు ఉదాహరణములు చూపి ఆరంభవాదులు కారణముకంటె కార్యము నిక్కచ్చిగా వేరని నిరూపించిరి.

విశ్వము

ఒక పరమాణువు మరియొక పరమాణువుతో కలిసి రెం డణువులు కల ఒక ద్రవ్యమగును. అది ఇంకొకదానితో గలిసి మూడణువులు కల ఒక ద్రవ్య మగును. ఇటులు క్రమక్రమముగా అనేకపరమాణువులు కలిసి యీ విశ్వమంతయు నగుచున్నదని ఆరంభవాదు లందురు. మరణ సమయమున ఈ ప్రపంచమునకు కారణమేమి ? అని కణాదు నడుగగా 'పీలవః పీలవః పీలవః' అని చెప్పె నని ఒక ఆభాణకముగలదు. పీలువనగా పరమాణువు. సృష్టి కవ్యవహితపూర్వము రెండుమ్మాత్ పరమాణువులతో ఆరంభించి అనేకపరమాణువులతో కలిసి క్రమముగా స్థూలమును స్థూలతరమును స్థూలతమమును అయి యీ భూమి ఆయెను. ఆచందము గనే అతిసూక్ష్మములగు జలీయపరమాణువులును ఒండొండ కలిసి స్థూలమును స్థూలతరమును స్థూలతమము నగు రూపొంది సముద్రముగా నాయెను. ఇటులే అగ్ని పరమాణువులును వాయుపరమాణువులును కలిసి స్థూలాగ్నిగను స్థూలవాయువుగను ఆయెను. ఈరీతిగా ఈ విశ్వ మెల్లయు నలు తెరగులగు పరమాణువుల సమిష్టిస్వరూపము.

ఈ సృష్టికి పూర్వము ప్రత్యక్షముగా కానిపించు వస్తు వేదియు లేదు. నిత్యములగు గాలి నిప్పు నీరు మన్నుల పరమాణువులును దిక్కాలాకాశములును ఈశ్వరుడును లెక్కలేని జీవాత్మలును ఈసృష్టికి పూర్వమున్నవి.



కథ:

# పెంపకపు మమకారము

శ్రీ కాళీపట్నపు రామారావు

(గతసంచిక తరువాయి)

సుదర్శనం మళ్లా సాయంకాలం అయిదింటికి ఇంటికి వచ్చాడు. నూతివద్ద కాళ్లూ చేతులూ కడుక్కొని ఇంట్లోకి పోతుంటే సుబ్బులు ఎదురై అడిగింది.

"మధ్యాహ్నం భోజనానికి రాలేదేం అన్నయ్యా!"

ప్రక్కనే తల్లి ఉండడం చూచి సుదర్శనం ఓవిధమైన తత్తరపాటుతోనే ప్రక్కగదిలోనికి వెళ్లిపోయాడు. కాని సుబ్బు లిది గ్రహించకుండా వెంటాడింది.

"ఎందుచేతంటే మాటాడేమిటి?"

ఈసారి తల్లి కాస్త కనుచాటవడంతో సుదర్శనం చెల్లి ముఖంలోకి తీక్ష్ణంగా చూశాడు. సరిగ్గా ఆదేసమయంలో వట్టింటిలోంచి ఒక ఉచ్చస్వరంతో జవాబొచ్చింది.

"ఎందుచేతా? ఇవాళ మీయమ్మ శ్రాద్ధపుదినం. అందుచేతే తండ్రీకొడుకులిద్దరూ రోజల్లా భోజనం మానుకు కూర్చున్నారు."

సుదర్శనం ఒక్కసారి ఉగ్రుడైపోయాడు. ఆ మంటంతా చెల్లెలిమీద రాలుస్తూ హుంకరించి తల జోరుగా విసురుతూ అన్నాడు—

"హుఁ, విను. కడుపునిండిందా?" తీక్ష్ణంగానే అయినా మందస్వరంలోనే అడిగాడు.

సుబ్బులుకు తల్లి పెట్టినవాటితో కడుపు నిండినా నిండకపోయినా అన్న పెట్టినవాటితో పూర్తిగా నిండిపోయి ఉంటుంది. అందుచేతే వెక్కసంగా కదిలి బైటికి వెళ్లిపోయింది.

తర్వాత రాత్రి మళ్లా వడ్డనవేళవరకూ సుబ్బులు పెదవి కదిపితే ఒట్టు. ఒడ్డిస్తూ ఒడ్డిస్తూ తండ్రికి అన్నం వేసేటప్పుడు అంది:

"మరికొంచెం వేయించుకోండి, మధ్యాహ్నం భోజనం చెయ్యలేదు కూడా."

దానికి తండ్రి నవ్వుతూ జవాబిచ్చాడు:

"అదా సంగతి? నేను మధ్యాహ్నం భోజనం చెయ్యలేదనుకుంటున్నారా? నాకు అలాటి అలకలూ అవీ చాతకావు. అలాటివన్నీ మీ అమ్మవంతు. నేను హాయిగా అక్కయ్యగారి ఇంట భోజనం చేశాను. ఇవాళ నేను వాళ్లింట మొదటి చట్టాన్ని."

దానిమీద సుబ్బులు అంది:

"ఏమో మరి! మా కేం తెలుసు?"

"అదే! మీకు చెప్పలేదు మరి! వెళ్లేటప్పుడు చెపుదామనుకుంటూనే మరిచిపోయాను."

తర్వాత ఎవరూ మాటాడలేదు. కాని సుదర్శనం ఈ లఘుసంవాదనకు ఆదిని భయపడ్డాడు. తర్వాత ఆశ్చర్యపోయాడు. తల్లి ఈ సందర్భంలో మౌనంగా ఊరుకోవడం అతనికి ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది మరి.

## ౬

ఈ ఆకస్మిక అప్రియసంఘటన ఆ శిథిలసంసారంలోని తక్కిన వ్యక్తులను బాధించవలసినంతగా బాధించిందో లేదో తెలియదు కాని సుదర్శనాన్ని మాత్రం పెట్టవలసిన యాతనకన్నా ఎక్కువయాతనే పెట్టింది.

ఎందుచేతనంటే ఆ విద్యాధికుడైన నవయవ్వనునకు యెదురుగా కూర్చుని ఆలోచించి భవిష్యత్పరిణామాలు ఊహించి భయపడి బాధపడడానికి కావలసిన చురుకైన మెదడూ చాలా తీరికా ఎక్కువగా ఉన్నాయి.

అతడు తీరుబడిగా పుస్తకాలు ముందు వేసుకొనో, లేక పడకకుర్చీలో నిమీలితనేత్రుడుగా పండుకొనో ఈ గృహవిచ్ఛిత్తిని గురించీ, దీన్ననుసరించే హృదయపరివర్తన గురించీ ఆలోచిస్తుండేవాడు.

అత డూహించుకునే భవిష్యచ్చిత్రం ఒక్కోసారి ఆలోచించేటప్పుడు ఒక్కోరూపు మార్చుకుంటూండినా ప్రధానాంశం మాత్రం ఒక్కటే.

పెత్తల్లిని రైలెక్కించటానికి తోడ వెళ్ళినప్పుడు అతనా ఆలోచనల సారాంశాన్నే వెళ్ళబుచ్చాడు.

రైలింకా 'రైట్ క్లియర్' కాలేదు. ప్లాటుఫారంనిండా మనుష్యులూ, మనుష్యులకు రెండుమూడు రెట్లు సామానులూ చెదురుగా సవ్యాపసవ్యంగా పడి ఉన్నాయి. ఒక చివరగా కుంకుడుచెట్టుక్రింద నల్లని పెద్ద ట్రంకుపెట్టెమీద పెదతల్లీ ఒక గోనెసంచిమూట మీద సుదర్శనం మాట్లాడుకుంటూ కూర్చున్నారు. సుదర్శనం ఉండి ఉండి అన్నాడు—

"నాకు ఒక్కదానికి కష్టమనిపిస్తుంది దొడ్డమ్మా! యింతా చేసి చివరకు ఆమెకు మాట దక్కకుండా పోయింది. విడిపోవటంలో పెద్ద అసంగత మేమీ లేదు. కాని అదే మంచి పరిస్థితుల్లో విడిపోయివుంటే నాకు కష్టమనిపించకపోను. చివరకు కొట్లాడుకొని విడిపోయారని నలుగురూ అనుకోటానికి వచ్చింది. మళ్లా ముఖాలు చూసుకోకుండా చేశారు. అదే కష్టమనిపిస్తూంది."

సుదర్శనం ఆగిపోయాడు. విషాదం అతని మాటల్లో నేకాక ముఖంలో కూడ స్పష్టంగా చూస్తోంది పెత్తల్లి.

నిజమే; సుదర్శనం అన్నట్టు మనుష్యులు విడిపోవటంలో పెద్ద అసంగత మేమీ లేదనటం సత్యమే. కాని ఆ మంచిపరిస్థితుల విషయమే ఒక సందేహం. మంచిపరిస్థితులే ఏర్పడితే అసలు విడిపోవలసిన అవసరమే ముందీ? లేక మంచిపరిస్థితులు కలిగినదాకా కాచుకొని ఉండి అప్పుడు విడిపోవటం అనే గత్యంతరం తీసుకొన్నా రెండుపార్టీల్లమధ్య ఘర్షణ అంటూ ప్రారంభించాక ఆ ఘర్షణ ఆగటం అంటూ ఎప్పుడు సమకూరుతుందీ? ఇంతకూ అసలు జరిగినది కూడా కాస్త రూపం మార్చుకున్నా—సుదర్శనం ఎలా జరిగితే బాగుంటుందనుకున్నాడో అలానే జరిగిందేమో!

అయితే బేచులర్ ఆఫ్ ఆర్ట్సువిద్యార్థికి ఇలాటి ప్రశ్నలు తట్టకపోవటంలో అతని లోప మేమీ లేదనుకుంటాను.

సుదర్శనం విషాదపూరితస్వరంతో అన్నాడు:

"అమ్మతత్వం నీకు తెలుసు! బహు పట్టుదల మనిషి! మళ్లా వాళ్లముఖం చూస్తుం దనుకోను. యింక మేమైనా ఆమెను కష్టపెట్టలేం కదా!......"

సుదర్శనం ఈవిధంగా మూడు ముక్కలతో తమ చిరకాలసంబంధం తెగగొట్టేశాడు. కాని నిజంగా అత నన్నట్టు ఈ సంబంధమే తెగిపోతే, అత డూహించలేదుకాని, సరస్వతి ఎక్కడ వెళ్లి పడుతుందీ? ఆమె జీవనరంగంలో ఏడింట అయిదుపాళ్లూ ఈ మూడుమాటలతో శుద్ధఎడారిగా మారిపోయిందన్నమాట.

ఈ చిత్రమే పెత్తల్లిని భయపెట్టి మాట్లాడించింది. ఆమె అంది—

"పోనిద్దబ్బాయ్! చిన్న పిల్ల ఏదో తెలివి తక్కువగా ప్రవర్తిస్తే పెద్దవాళ్లు గడుపుకోవాలి! చదువుకున్నవాడివి—నువ్వూ అలా అంటే ఎలా?

"కాని, అమ్మమాట దొడ్డమ్మా అమ్మ మనమెలా కష్టపెడతాం?"

దానికి క్షణకాలంవరకూ పెత్తల్లి జవాబివ్వలేదు. తర్వాత సందేహంగా అంది:

"ప్రతీదీ అమ్మకు తెలుస్తుందా ఏమిటి? ఏదో విధంగా చెయ్యాలి. అసలే మీరుతప్ప దానికి నా అనే వాళ్లెవరూ లేరు. ఇప్పుడు మీరు కూడా ఎడపెట్టేస్తే ఏమౌతుందీ?"

సుదర్శనం జవాబుకోసరం ఎదురుచూస్తుంటే లయిట్‌క్లియర్ గంట కొట్టారు. దృష్టి అటుతిరిగేసరికి రెండేళ్లయి కలుసుకొనని దగ్గరస్నేహితుడొకడు అయిదారుగజాలదూరంలో తనవంకే చూస్తూ నిలుచుని ఉన్నాడు. త్వరలోనే వస్తానని పెత్తల్లితో చెప్పి స్నేహితుణ్ణి కలుసుకొని బాతాఖానీలో పడ్డాడు.

## ౨

ఒకనాడు సాయంకాలం కళాశాల విడువగానే సుదర్శనం ఒక స్నేహితునితో మాట్లాడుతూ వస్తున్నాడు. మెయిన్‌రోడ్డు జంక్షన్లో అకస్మాత్తుగా చిరపరిచితమైన స్వరం వినిపించింది. ఎవరో కాదు శ్రీపతి.

శ్రీపతి తన చిన్నగొంతుతో అరుస్తున్నాడు.

"మామయ్యోయ్ మామయ్యా!"

సుదర్శనం ఒకసారి వెనుతిరిగి చూశాడు. తండ్రీ కొడుకులు!

ఒకసారి వెనక్కు తిరిగి చూచాక చూడనట్లు ముఖం తిప్పేసుకొని వెళ్లిపోవటం సుదర్శనానికి చాతనయిందికాదు. స్నేహితునివద్ద శెలవుతీసుకొని చిరునవ్వుతో మేనల్లుని ఎదుర్కొనడానికి వెళ్లాడు.

ఒకరినొకరు సమీపించగానే శ్రీపతి మామ రెండుకాళ్లూ పట్టుకొని కావలించేసుకున్నాడు. సుందర్శనంలో కూడా వాత్సల్యతకు కొరత లేదు. కాని అతడికి పిల్లల్ని ఎత్తుకోవడం అలవాటు లేదు. పైగా వేసుకున్న సూటూ, నడిబజారూ అందుకు చాలా అననుకూలంగా ఉన్నాయి. అందుచేత అలానే ఓసారి అల్లుని లేతతనువును కాళ్లకు అదుముకొని తర్వాత పట్టు విడిపించుకుంటూ అడిగాడు.

"ఎక్కణ్ణుంచిరా మామా?"

"బదారుకీ—బదారుకీ—బిసకత్తులు కొనుక్కోలాంకి వచ్చాం."

ఆ నాలుగుమాటలూ త్రోయగా త్రోయగా చివరకు ఊడి బయటపడ్డాయి.

అల్లునిచేత ఇటువంటి ఫీట్సు చేయించి సంతోషించడం మామకు అలవాటు. అందుచేత మరొక ఫీటు పురమాయించే ఉద్దేశంతో అన్నాడు:

"మరైతే కొన్నావా?"

శ్రీపతి అంగీకారసూచకంగా తలతోపాటు శరీరమంతా ఊపుతూ జవాబిచ్చాడు.

"ఊఁ...ఊఁ...కొన్నాను. యి యిగో....."

అంటూ జేబుమీద చెయ్యివేశాడు.

సుదర్శనానికి యింకా తృప్తి కలుగలేదు. అందుచేత అన్నాడు.

"మరి నాకో!"

శ్రీపతి భద్రంగా ఓ బిస్కట్టుముక్క పైకితీసి యివ్వబోయాడు.

కాని సుదర్శనం చిన్నపిల్లల మారాంను అనుకరిస్తూ అన్నాడు—

ఊఁ....ఊఁ......నాకది వద్దు. ఇంతకన్నా మం...చిది కావాలి."

శ్రీపతి స్నిగ్ధహృదయంలో ద్వంద్వభేద రోగం ప్రవేశించలేదు—కనీసం ఇలాటి పదార్థాల విషయంలో. కారణం యింట్లో వాడికి యింకో పోటీ లేకపోవడం. అందుచేత వాడికి మామమాట బోధపడ లేదు. వాడలా తెల్లబోయి చూస్తుంటే తండ్రి చూసి కర్తవ్యం ఉపదేశించాడు.

"అయితే మంచివి కొని యిమ్మనురా......అను! 'మామా, ఆ మంచివేవో ఒకసారి కొని చూపించు. ఈసారి అలాటివే పెడుతుంటాను' అను."

తండ్రి బోధింపవచ్చిన కర్తవ్యం కూడా కుమారునితల కెక్కలేదు. చివరకు సుదర్శనం తెల్లబోయి చూస్తున్న అల్లుణ్ణి కాళ్లకు అదుముకుంటూ నవ్వాడు.

తర్వాత అకస్మాత్తుగా సంభాషణ స్తంభించి పోయింది. ఘర్షణలకు వెనుకంజవేసే సుదర్శనమే కదిలాడు.

"యిలా యెక్కణ్ణుంచి?"

యెందుచేతో మూర్తి సరిగా జవాబివ్వలేదు. 'యిక్కణ్ణుంచే' అంటూ నసిగేశాడు. ఈ పరాఙ్ముఖత

సుదర్శనానికి చిత్రమనిపించింది. కాని మూర్తే సర్దుకున్నాడు.

"యెక్కడా అగపడ్డం లేదేం?"

దానికేం జవాబు చెప్పాలి? సుదర్శనం ఏదో చెప్పాడు.

"సరే, రేపు శనివారం శలవు కదూ! అలా ఓసారి రా!"

సుదర్శనం మంత్రితుడిలా జవాబిచ్చాడు:

"అలాగే"

"ఇల్లు తెలుసు కదూ—కలెక్టరేట్‌కు పడమటి కొద్దున. పద్మాబిల్డింగ్స్ దాటాక ఆ మలుపులో మొదటి యిల్లే."

యింతలో శ్రీపతి అందుకున్నాడు.

"మామయ్యా, యిప్పుడే లా మామయ్యా!"

"కాదులే మామా! రేపు వస్తాను."

"కాదు ఇప్పుడే"

"కాదు—రేపు"

శ్రీపతి బిక్కమొహం వేసేశాడు.

"అది కాదురా నాన్నా! రేపు వస్తాడు; ఇప్పుడు మామయ్య కాలేజీకి వెళ్తున్నాడు. రేపు వస్తాడు."

మామ కూడా యీ అబద్ధానికి సాక్ష్యం యిచ్చాడు. చివరికెలాగో ఆ పెద్దమనుష్యులిద్దరూ కలిసి పసివాణ్ణి మోసం చెయ్యగలిగారు.

సుదర్శనం దారికడ్డూ ఆలోచిస్తూనే ఉన్నాడు. 'మర్నాడు వెళ్లటమా మానటమా' అని, తర్వాత రాత్రి నిద్రపోయేముందుకూడా మళ్లా యీ విషయమే జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వెళ్లకూడదనే ప్రాతిపదికతో ఆలోచిస్తూ ఉంటే అతని అంతరంగంలో వెళ్లటమే ధర్మమనే వ్యతిరేకప్రాతిపదికను బలపరిచే యుక్తులు ఒకదానివెంబడి ఒకటి స్ఫురించసాగాయి.

చిన్నప్పుడు చదువుకున్న 'ఉపకారికి నుపకారము' అనే పద్యంలోని సుమతినీతీ, మహాత్ముని బోధనలూ ఒకటేమిటి—చాలాచాలా యుక్తులు అగపడ్డాయి. అందులో ముఖ్యంగా రెండు—తండ్రి తనకు చాలాసార్లు చెప్తూవచ్చిన పాఠాలూ, పోతూపోతూ పెత్తల్లి అన్న మాటలూ. ఈ రెండు మాసాలయి సరస్వతి ఒంటరిజీవితం ఎలా గడిపి ఉంటుందో ఊహించుకుంటుంటే ఎప్పుడు పట్టేసిందో నిద్ర పట్టేసింది.

౮

అనుకున్ననాడు వెళ్లలేదు కాని—చివరకు ఒకనాడు బయలుదేరాడు. ముహూర్తం మిథునలగ్నం అవడంచేత కలెక్టరాఫీసుకొద్దు కూడా నిర్మానుష్యంగానే ఉంది.

సుదర్శనం యిల్లు సుళువుగానే గుర్తుపట్టగలిగాడు. కాని మెట్లెక్కుతుంటే ఆ అరవశత్రువును మరోకసారి ఎదుర్కోవలసివచ్చింది. ఎలాగో శత్రువును ప్రక్కకు నెట్టి తలుపు తట్టగలిగాడు. లోనుండి 'ఎవరూ?' అంటూ కేక వినవచ్చింది. కాని సుదర్శనం జవాబివ్వకుండానే మళ్లా తలుపు తట్టాడు. తలుపు తెరువబడింది. కుడిచెయ్యి వెనక్కు దాచుకొని సరస్వతి ఎదురుపడింది.

సరస్వతి తనను చూడగానే కొంత త్రుళ్లిపడడం సుదర్శనం గుర్తించాడు. క్షణకాలం యిద్దరూ అలానే నిలుచున్నాక ఆమె లోనికి తప్పుకుంటూ శ్రీపతిని పిలిచి మామరాకను తెలియజేసింది. శ్రీపతి గజేంద్రుణ్ణి రక్షింపనేగే సంరంభంతో నగ్నరూపంలో మూతినిండా మెతుకులూ, చేతిలో కొబ్బరికాయ ముక్కలతో దర్శనమిచ్చాడు అల్లుడూ మామా ఇద్దరూ నవ్వూ చిరునవ్వులతో పలకరించుకున్నారు. తర్వాత ముగ్గురూ ఎవరిస్థానాల్లో వారే మౌనంగా ఊరుకున్నారు. సుదర్శనం లోనికి వెళ్లటమా మానటమా అనే సందేహంతో అలానే నిలిచిపోయాడు. కొద్దిసేపట్లోనే తన పొరపాటు గుర్తించిన సరస్వతి కొట్టుకునే గుండెలతో అంది—

"లోపలికి రా అన్నయ్యా! అవతల ఉండిపోయావేం?"

సుదర్శనం లోనికి వెళ్లాడు. కాని మళ్లా

అతణ్ణి సంశయచిత్తుణ్ణి చేస్తూ సరస్వతి లోనికి వెళ్లి పోయింది. సుదర్శనం 'ఇడీ చప్పుడూ లేకుండా వెళ్లి పోదామా ?' అనుకున్నాడు. కాని యెలా ?

సరిగా ఈసమయంలోనే సరస్వతి చేయి చీర చెరగుతో తుడుచుకుంటూ ప్రవేశించి మూల నున్న చాప తెచ్చింది. సుదర్శనం కూర్చుంటూ తన తప్పు గుర్తించాడు. తరవాత సరస్వతి కొడుకువంక తిరిగి అంది—

"నువ్వు భోంచేసి రారా నాన్నా ! మామ యిక్కడే వుంటాడు. వెళ్లు !"

శ్రీపతి ప్రశ్నార్థకంగా బుర్ర తిప్పుతూ మామను ఉద్దేశించి అడిగాడు :

"ఉంతావా మలి ?"

మామవాగ్దానం గ్రహించాక వంటయింట్లోకి వెళ్లిపోయాడు.

శ్రీపతివెళ్లగానే సుదర్శనం చెల్లెలి వంక తిరిగి అడిగాడు —

"నువ్వు కూడా సగంభోజనంలో లేచిపోయినట్టుంది ?"

"లేదు. నా భోజనం అయిపోయింది."

"కాదు. నీ భోజనం కాకపోతే వెళ్లి భోజనం చేసి రా !"

ఈ బరువసా గ్రహించి కాస్తసేపు పోయాక జవాబిచ్చింది:

"సరే అల్లుడురానీ, వెళ్తాను."

సుదర్శనానికి ఎవర్నీ బ్రతిమాలడం అలవాటు లేదు. మరికొంతసేపు గడిచాక సరస్వతే అడిగింది—

"దొడ్డమ్మ యిక్కడే ఉందా ?"

సుదర్శనం జవాబిచ్చాడు. మళ్లా కొంతసేపు నిశ్శబ్దం. సరస్వతే మాట్లాడుతూ మళ్లా అడిగింది—

"నాన్నగారూ, సుబ్బులూ అంతా కులాసాగా ఉన్నారా ?"

జవాబిస్తూ, ప్రశ్న ఆలోచనాపూర్వకంగా వేసిన దవుణా కాదా అని ఆలోచించసాగాడు. తర్వాత సరస్వతి వెల్లడించిన విషయం ఆలోచనా విషయాన్ని మార్చేసింది.

"నాన్నగారు ఆమధ్య పనిమీదనురోజుల క్రిందట ఒకసారి వచ్చారు. మళ్లా రాలేదు."

ఈవిషయం సుదర్శనానికి పెద్ద ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఆలోచనకుమాత్రం ప్రేరేపించింది.

ఇంతలో అల్లుడు పరుగెత్తుకుంటూ వచ్చి మామమీద వ్రాలబోయాడు. తల్లి తుళ్లిపడి ఒక్క అంగలో పట్టుకుని కసురుతూ వారించింది. శ్రీపతి నివ్వెరపోయాడు. మామ కూడా అలాటిముఖమే వేశాడు. సరస్వతి సౌమ్యస్వరూపంతో కొడుకుతడి ఒళ్లు తుడుస్తూ అంది—

"అలా వెళ్లి మీదపడితే మామయ్యబట్టలు పాడవ్వూ—"

అంటూ ఒళ్లంతా తుడిచి మామకు అప్ప జెప్పింది. అల్లుడూమామలిద్దరూ ఒకర్నొకరు గౌరవించుకొని ముచ్చట్లుపడ్డారు. సరస్వతి భోజనం ముగించుకోవడానికి వెళ్లింది.

కొంతసేపయ్యాక సుదర్శనం అల్లుణ్ణి ఒళ్లోంచి లేవనెత్తి నిలునబెడుతూ మంచినీళ్లు తెమ్మని పురమాయించాడు.

శ్రీపతి అక్కణ్ణుంచే కేకలువేస్తూ వెళ్లి కొద్ది సేపట్లోనే అతిప్రయత్నంమీద నీళ్లు తొణకనీకుండా తెచ్చి మామ కందిస్తూ అన్నాడు—

"అమ్మ ! ఎప్పులూ ఏలవలమే మామయ్యా ! ఎప్పులూనూ !"

శ్రీపతి ఈమాటలు అభినయపూర్వకంగా చెప్పాడు కాని మామ ఆ అభినయం ఆకర్షించ లేదు. అతను పెదవులముందు పెట్టుకున్న గ్లాసును అలానే ఉంచేశాడు. పావునిముషం, అరనిముషం, నిముషం గడిచినా గ్లాసు అలానే ఉండిపోయింది. శ్రీపతిబుర్రలో ఏం మెదిలిందో ఏమో, అన్నాడు—

"నీల్లు మంచివే మామయ్యా, అమ్మ బిందెలోంచి తీచి యిచ్చింది."

సుదర్శనం యీ హెచ్చరికతో నీళ్లు తాగేశాడు.

తర్వాత గ్లాసు ఎడంగా పెట్టి అల్లుణ్ణి దగ్గరకి లాక్కుంటూ రహస్యంగా అడిగాడు—

"ఇప్పుడేడుస్తోందా ఏమిరా ?"

"ఆఁ. నన్ను చూడగానే కళ్లు తుడిచేసుకుంది"

తర్వాత సుదర్శనం మళ్లా ఏ ప్రశ్నా వెయ్యలేదు. కొంతసేపయ్యాక సరస్వతి వచ్చింది. సుదర్శనం ఆమెముఖంలోకి చూడగానే అల్లుని మాటల్లోని సత్యం గోచరించింది.

సుదర్శనం అలానే విడవకండా చెల్లెలిముఖంలోకి చూడసాగాడు. సరస్వతి ఆ చూపులను ఎదుర్కోలేక ముఖం వంచేసింది. తర్వాత ఏదోపని జ్ఞాపకంవచ్చినదానిలా అక్కణ్ణుంచి కదలిపోయింది.

ఈసారి ఆమె తిరిగివచ్చేసరికి సుదర్శనం లేచి నిల్చునివున్నాడు. ఆమె రాగానే వెళ్లివస్తానమ్మా అన్నాడు నెమ్మదిగా. సరస్వతి తత్తరపాటుతో మరి కొంతసేపు ఉండమని బలవంతం చేయబోయింది. చివరికి సుదర్శనం ఏవో అబద్ధాలు చెప్పి తప్పించుకోగలిగాడు. కాని వెళుతూ వెళుతూ ఓచిన్న సరదాకు పోయాడు.

వాళ్ల సంసారం సాగరంగా మారకముందు— ఆ అన్నా చెల్లెళ్లమధ్య అటువంటి హాస్యాలు అప్పుడప్పుడూ ఉండేవి. మళ్లా నేటికి సుదర్శనానికి ధైర్యం కలిగింది. సరస్వతిముఖంలోకి పరిశీలనాదృష్టి నటిస్తూ చూసి అడిగాడు—

"అదేమమ్మా, కళ్లు యఱ్రగా ఉన్నాయే?"

సరస్వతి గతుక్కుమంది. కాని కాస్త ఆలస్యమైనా జవాబిచ్చింది.

"అబ్బే! ఊరికేనే! ఏదో పడిందేమో ఇందాకా పొయ్యి ఊదుతుంటే..."

సుదర్శనం చిరునవ్వుతో మధ్యలోనే అటకాయించాడు:

"బొగ్గుల పొయ్యా!"

సరస్వతి చిరునవ్వుముసుగులో సిగ్గును దాచబోతూ తల వంచేసింది.

సుదర్శనం వెళ్లివస్తానంటూ బయటకు నడిచాడు. అల్లునిదగ్గర శెలవు తీసుకొని అల్లంతదూరం వెళ్లాక సరస్వతి గుమ్మంలోంచి కాస్త ఉచ్చస్వరంలో అడిగింది:

"మళ్లా వస్తావుకదూ?"

సుదర్శనం ఓసారి వెనుతిరిగి, తల అంగీకారసూచకంగా ఆడిస్తూ కదలిపోయాడు.

సుదర్శనానికి దారిపొడుగునా ఆ తల్లీకొడుకుల మాటలు జ్ఞాపకం వస్తూనే ఉన్నాయి.

౯

మరి ఒకనెలదినాలు కాలగర్భంలో కలిసిపోయాయి. ఒకనాడు తండ్రి ఊళ్లో లేరు. ఎక్కడికో కాంపుకు వెళ్లారు. నాడు సుదర్శనం ఆశ్చర్యకరంగా ప్రవర్తించసాగాడు.

సుదర్శనం ఆడవాళ్లను వెంటబెట్టుకొని ఎక్కడికైనా వెళ్లవలెనంటే అర్ధనగ్నంగా వీధిలోకి వెళ్లవలసివస్తే కష్టపడేటట్టు కష్టపడతాడు. అటువంటిది ఆవాళ తానై సినీమాకు వెళ్దామంటూ ఆరంభించాడు.

పోనీ సినీమా మంచిదేమో అంటే అరవసినీమా. నాల్రోజులక్రిందటే "అబ్బే, బాగులేదట"అని తన నోటితో తానే అన్నాడు.

సుబ్బులు యీ అయాచితకారుణ్యం గుర్తించి కొంతసేపు కారణంగురించి చర్చించింది. 'కాని తెగిందాకా లాగకూడదు' అనే పెద్దలవాక్కును జ్ఞాపకంచేసుకొని ఆ చర్చను అట్టే సాగించలేదు.

అయితే తీరా బయలుదేరేవేళకు ఒక అవాంతరం వచ్చిపడింది. తమ కొంప యేదో మునిగిపోతున్నట్టు అకస్మాత్తుగా నాలుగువాలలనుంచీ మేఘాలు కమ్ముకవచ్చి ఆకాశమంతా అలముకున్నాయి. సుబ్బులుగుండెల్లో రాయి పడింది. క్షణక్షణానికి పెరటివాకిలిలోకి పోయి ఆకాశంవంక

చూడసాగింది. ఆకాశంనుండి మేఘాలుకూడా సుబ్బులువంక చూస్తుంటేవి. సుబ్బులు వాటిచూపులను సులువుగానే చదువుకోగలిగింది.

"మేం సిద్ధం! మీరు బయటకు అడుగుపెట్టడమే తరవాయి" అన్నట్టున్నాయవి.

అయితే సుగుణమేమంటే అన్నీ కూడా తనలానే అతృప్తిపడుతున్నట్టుంది. ఈ తృప్తి అయినా ఆమె కెంతోసేపు దక్కలేదు. తల్లి మేఘాలను చూస్తూ—

"మేఘాలేమిట్రా యిలా వచ్చిపడ్డాయి?" అంటూ కదలకేశారామె.

ఆ మేఘాలు గుప్తిమేఘాలేననీ, అవి భయపెట్టటంతప్ప యింకేమీ చెయ్యవనీ యెన్ని చెప్పినా ఆ ముసలావిడ నమ్మరు. చివరకు ఈసందర్భంలో కోపం తెచ్చుకోని కనుగొకున్నాడు కూడా. ఈ చిన్న విషయంగురించి యేల కోపం తెచ్చుకోని కసురుకో వలసివచ్చిందో స్ఫురించకుండానే పార్వతమ్మగారన్నారు—

"పోనీ, నీకెందుకంత కోపం? వస్తానులేరా!" అంటూ బయలుదేరారు.

హాలుదగ్గరకు వెళ్లాక వాళ్లిద్దర్నీ ఒకదగ్గర నిలబెట్టమని సుదర్శనం యెటో వెళ్లిపోయాడు.

సుమారు పావుగంట గడిచాక చాలా తొందరగా వచ్చి తల్లిచేతికి టిక్కెట్లందిస్తూ చెప్పసాగాడు—ఎవరో స్నేహితుడట. తనని కదలకుండా గట్టిగా పట్టుకొని ఎంతకీ పోనివ్వలేదట. ఎలాగో వదిలించుకొని వచ్చాడట. తర్వాత జనవస్నేహితుల ఇంగితజ్ఞానరాహిత్యం గురించి స్పష్టంగానే తన అభిప్రాయం తెలిపాడు.

సుదర్శనం తను చెప్పుకోనిపోవటమేగాన్ని అంత వివరంగా చెప్పవలసిన ఆవశ్యకత లేదేమో అని సందేహించలేదు.

తల్లీ కూతుళ్లు హాల్లోకి వెళ్లేసరికే లైట్లు ఆర్పేశారు. ఆట అప్పుడే ఆరంభమయింది. ఆ చీకట్లోనే తడుముకుంటూ వెళ్లి ఒకచోట కూర్చున్నారు.

కొండవీటిచాంతాళ్లను పోలే పాటలతోనూ, అనవసరపు కామిక్ ఉపాఖ్యానాలతోనూ కథ చాలా పెద్దది.

చివరి కలానైతేనేం యింటర్వల్ ఇచ్చారు.

పార్వతమ్మగారు అప్పటికప్పుడే పరిచయం చేసుకొని సిద్ధంగా ఉంచిన పొరుగమ్మతో బాతాఖానీ ఆరంభించింది. ఆ యమ్మకు యెంతమంది పిల్లలో, ఆమెమొగుడికి యేమి ఉద్యోగమో, జీతమెంతో, పైన సంపాదన యెంతో మొదలైన అత్యవసర విషయాలు గ్రహించటానికి చెయ్యటంలో నిమగ్నురాలయిపోయారు. సుబ్బులు యింకా స్త్రీ కాదు—కిశోరి. అందుచేత కూర్చున్న స్థలం యిబ్బందిపెడుతున్నట్టు ఏదో సాకుతో త్రుళ్లిపడ్డట్టు మధ్యమధ్య లేచి పైట సవరించుకుంటూ నాలుగువైపులా కలయజూస్తోంది.

ఒకసారి అలా చూస్తూచూస్తూ అలానే ఉండిపోయింది. గేటుదగ్గర—బుజాన నిద్రిస్తున్న శ్రీపతితో సరస్వతి నిల్చునివుంది. ఆమెకళ్లు తల్లివంకే ఉన్నాయి. ఒకసారి చలించటంలో తనవంక చూస్తుం తటస్థించింది. ఇద్దరూ ఒకరిదర్శనాన్ని ఒకరు గుర్తించారు. సరస్వతి కుడిచేతిచూపుడువేలుని ఒకసారి ముక్కుమీద వేసుకొని చేయి అడ్డంగా ఊపింది. సుబ్బులు గ్రహించి ఊరుకుంది. తర్వాత కూర్చోమనీ, తనవంక చూడవద్దనీ, చూస్తే తల్లి గ్రహించేస్తుందనీ అభినయం ద్వారా చెప్పింది. సుబ్బులు అలానే చేసింది. కాని క్రీగంట అక్కను గమనిస్తూనే ఉంది. అక్క తల్లివంకే చూస్తోంది.

సుబ్బులు అలోచిస్తూఉంటే ఆమెకు అకస్మాత్తుగా ఓవిషయం తట్టింది. పూర్వాపరాలు చర్చించి చూస్తే సందేహం నిజమే అనిపించింది. ఇంతలో ఆట మళ్లా ప్రారంభించేశారు.

ఆట వదిలాక సుబ్బులు అక్కకోసరం చూసింది. కాని ఎక్కడా కానరాలేదు.

ఇంటికి వచ్చాక తల్లి నూతిపద్ద కాళ్లూ,చేతులూ కడుక్కుంటూ ఉంటే సుబ్బులు ఈవలి గదిలో బట్టలు మారుస్తున్న అన్నదగ్గరకు వెళ్లి అంది—రహస్యంగా.

"నాకు తెలిసిందిలే"

సుదర్శనం ఉలిక్కిపడ్డాడు. అప్పుడప్పుడే పేంటు జేబులోని సిగరెట్ పెట్టె తీసి సూట్ కేసులో భద్ర పరిచిఉన్నాడు తను. అయినా దబాయించాడు.

"ఏమిటి తెలుసు?"

"నువ్వు అక్కయ్యగారింటికి వెళ్తున్నావు కదూ?"

సుదర్శనం గుండెలు తేలికపడ్డాయి. అందుచేత అతడు కాస్త నమ్మకంగానే జవాబిచ్చాడు.

"ఎవరన్నారు?"

"ఎవరన్నారేమిటి? ఎన్నడూ లేంది నువ్వు బల వంతంచేసి సినిమాకు తీసికెళ్లడం, ఆపైన గారు కూడా సరిగ్గా ఆ అటక ఎక్కడం..."

సుదర్శనం మనస్సులోనే ఆ వేశానా.

"అమ్మ చూసిందా?"

"లేదులే. కాని నేను చెప్తాను."

"నువ్వూ—." నిబ్బరంగా అన్నాడు. కాని ఆ నిబ్బరం అరక్షణమైనా నిలవలేదు. తల్లి మెట్ల చప్పుడు వినిపించసాగింది.

సుదర్శనం తత్తరపాటుతో గొణుక్కున్నాడు. "వస్తోంది! జాగ్రత! పిచ్చిచేష్టలు చేయకు!" తర్వాత గుప్ చుప్! సుబ్బులుకూడా తల్లి వచ్చేసరికి పొగా కొయ్యదగ్గర యీ కొయ్య నున్న లాల్చీ ఆ కొయ్యకు తగిలిస్తోంది.

కాని ఈవిధమైన మోసం ఎంతో కాలం సాగిరాలేదు. కనీసం కొన్నిసార్లయినా అనిపోలేదు. వెళ్లాళ్లయాక రెండవసారి మళ్లా సినిమాకు వెళ్లి నప్పుడు బయలుపడిపోయింది.

జరిగిన పొరపాటేమంటే యీసారి యింటర్ వల్ లో శ్రీపతి తెలివితోనే ఉన్నాడు. వాడు అమ్మమ్మఅర్ధపలితకేశాల అనాగరికబంధనాన్ని ఎంత దూరంనుంచియినా పోల్చుకోగలడు. వాడు ఒకసారి తల్లితో చెప్పి ఆమెఒడిలోంచి జారిపోతూ "అమ్మ మ్మాయ్! అమ్మమ్మా!" అంటూ కేకలు వెయ్యడం ఆరంభించాడు. సరస్వతి రాబోయే ప్రమాదాన్ని ఆకస్మికంగా గుర్తించి చప్పున ఒకచేత్తో చేయి పట్టు కొని ఒకచేత్తో నోరు మూస్తూ అదిమిపట్టుకుంది.

సరిగా యీ స్థితిలోనే అమ్మమ్మ వెనుదిరిగి చూసింది. ఈ దురదృష్టసంఘటనకుతోడు యింకొకటి కూడా జరిగింది. ఆట వదిలాక ముగ్గురూ మెయిన్ రోడ్డుమీదికి వచ్చారు. సుదర్శనం కాస్త వెనుక పడ్డాడు. ముందు మగవాళ్లు అడ్డురావడంచేత పార్వ తమ్మగారు ఆగిపోయి కొడుకుకోసరం వెనక్కు చూశారు. వెనకనే గజందూరంలో నున్న సుదర్శనం ఎవరికో వెళ్లిపోతానన్నట్టు తల వూపుతున్నాడు.

ఏమా అని చూస్తే భుజంమీద నిద్రపోతున్న కొడుకుతో సరస్వతి, అల్లుడూ!

మెయిన్ రోడ్డు విడిచి సందులోకి మళ్లాక ఆరంభించారు! కొంతవరకూ అడ్డుప్రశ్నలయాక తర్వాత—

"......మనుష్యులకు ఒకర్ని చూశాకయినా బుద్ధిరావాలి. సిగ్గూ లజ్జా విడియం పౌరుషం— అన్నీ విడిచిపెట్టేసిన బ్రతుకు ఏం బ్రతుకు! రేం? దాని కొడుకు నన్ను చూడాలనిపించిందా! నోరు అడ్డంగా నొక్కేసింది! చేయిపట్టుకొని గుంజేసిందే!! వెలడు వెగటయితే అవుగాక! తర్వాత మళ్లా 'అమ్మమ్మా' అన్నాడా? ఇంగితజ్ఞానం లేకపోయాక యెన్నేళ్లొస్తే యేమి లాభం?......"

ఇంతలో యిల్లు సమీపించడంతో ఆగిపోయింది. సుదర్శనం ఒక్క అంగలో వెళ్లి తలుపు దబదబ కొట్టాడు. తండ్రిజవాబు కూడా వెంటనే రావటం వల్ల పార్వతమ్మగారి నోటినుండి మరొక్కమాట కూడా వినవలసిన బాధ లేకపోయింది—సుదర్శనానికి.

## ౧౦

మర్నాడు ఉదయం ఒకసారి కూడా సుదర్శ నం తల్లితో మాట్లాడలేదు. అంతగా మాట్లాడక విధి లేని అవసరం కూడా రాలేదు. సాయంకాలం తను యింటికి రాగానే తల్లి వీధిలోకి ఎక్కడికో బయలు దేరింది. ఆమె అవతలికి వెళ్లగానే పెరట్లో వండుకుం టున్న చెల్లెల్ని సమీపించి మెల్లిగా కదలేశాడు.

"యేమి టంటుందే అమ్మ?"

సిబ్బిఅడుగుభాగం శుభ్రంగా తుడిచి పొయ్యి మీద యెసరుకు మూతపెడుతూ అంది:

"అమ్మకు నీమీద బాగా కోపం వచ్చింది."

దీనికి సుదర్శనం కొంతసేపుండి జవాబిచ్చాడు.

"రానీ!"

మళ్లా ఒకనిమిషంవరకూ ఎవరూ మాట్లాడలేదు. తర్వాత సుబ్బులు అంది—

"ఇంతకూ ఆ చిన్న వెధవనుంచి వచ్చింది"

"అన్నట్లు అడుగుదా మనుకుంటూ మరచి పోయాను; యెలా తెలిసిందీ?"

సుబ్బులు చెప్పింది.

సుదర్శనం అంతా విని నోటితో భగ్నప్రయత్నాన్ని వ్యక్తీకరించే విలక్షణధ్వని చేస్తూ అన్నాడు—

"—! యీ చిన్నపిల్లలుంటే యింతే! యిలానే జట్టీలు తెచ్చిపెడుతూ వుంటారు! వాళ్లకు తెలిసిన గొడవా కాదు తెలియని గొడవా కాదు!"

సుదర్శనం వ్యథితహృదయం ప్రకటించి ఊరుకున్నాడు. సుబ్బులు కూడా అవునన్నట్టుగా మాట్లాడలేదు.

యిద్దరూ కూడా యెవరికుట్టుకు వారు చిన్న పిల్లల అజ్ఞానంగురించే తలపోస్తున్నారు.

మానవుల రీతే యిలా వుంటుంది. యెక్కడో ఏసందర్భంలోనో ఎవరో అన్నమాటలను పట్టుకొని అవే సిద్ధాంతాలుగా—ప్రాతిపదికలుగా—తీసుకొని విమర్శిస్తూవుంటారు—కాని ప్రస్తుత సందర్భాన్ని దృష్టిలో పెట్టుకోరు. అందుచేతే తరుచు యీ ఏకోదరులులా పొరపాట్లు చేస్తూ వుంటారు.

సుదర్శనం రెండు ప్రశ్నలు వేసుకుని వుంటే సత్యం గ్రహించగలిగేవాడు.

"ప్రవర్తనామర్యాదలు బాగుగా తెలుసుకొని యుక్తాయుక్తజ్ఞానం పూర్తిగా సంపాదించిన సరస్వతి ప్రవర్త—"

అన్నట్టు యీప్రశ్న అక్కరలేదు; రెండో ప్రశ్న ఒక్కటే చాలు.

నాడు తొలిసారి సరస్వతియింటికి వెళ్లిననాడు శ్రీపతి తెలిసీ తెలియని గొడవగా తల్లికన్నీళ్ల రహస్యాన్ని బహిరంగం చేయటంవల్ల కలిగిన ఫలితం ఎటువంటిది?

ఈ ప్రశ్న వేసుకుంటే పార్వతమ్మగారి పునరుజ్జ్వలితకోపానికి శ్రీపతిఅజ్ఞానం ఎంతవరకూ బాధ్యత వహిస్తుందో తెలిసేది.

కాని దురదృష్టవశాత్తూ చాలామందికి కార్యకారణసంబంధంగురించి సమగ్రంగా ఆలోచించే జ్ఞానం లేదు. సుదర్శనం అందులో ఒకడు.

కొంతసేపయాక సుబ్బు లంది—

"—మధ్యాహ్నం భోజనాలవేళ ఏదో మాట మీద మాట వచ్చి అందుకుంది. మానసుందరమూ ఒకటేట. నాన్నగారేమో వాళ్లను పట్టుక వెళ్లి వేరు పెట్టారట. అప్పటినుంచి ఏబ్బులూ గా యిస్తున్నారట. నువ్వేమో వాళ్లలో కలిసిపోయావుట. నే నీసంగతులన్నీ తెలిసి కూడా తనతో యేమీ చెప్పలేదు కాబట్టి నేను కూడా మీలోనే జమట. యింక యెప్పుడువచ్చి తనను ఒక్కర్తినీ వేరుచేసేశారుట. ఇలా అంటూ ఏడుపు ఆరంభించింది. చివరకం—నే నా గొడవలో ఉన్నదంతా ఉన్నట్టు చెప్పేశాను—నువ్వు చాలా కాలమయి వాళ్లింటికి వెళ్లవస్తున్నావనీ, అవాళ అక్కయ్యకు కల రావటం, అనుకున్నదు ఉదయం బాన బజారులో అగపడి అక్క ఉపవాసంవుంచి ఏడుస్తోందని చెప్పటం, నువ్వు వెళ్లటం, తర్వాత సినీమా నెపంతో తనను తీసుకువెళ్లి మాట్లాడటం—అంతా పూసగుచ్చినట్లు చెప్పేశాను.

అంతా మాట్లాడకుండా వింది. తర్వాతైనా చాలాసేపటివరకూ మాట్లాడలేదు. ఏమిటో తనలో తనే వలపోసుకుంది. ఇంక ఏడుపు మానుకున్నాక—చెప్పలేను. అక్కుగ్గు బుక్కుర్రు ఏడ్చేసింది. మరి వాళ్ల చెల్లెలే జ్ఞాపకం వచ్చిందో ఇంకేమిటో! నేనుమాత్రం దడిచాను. మాట్లాడలేను—ఊరుకోలేను. అక్కణ్ణుంచి లేచి పారిపోయాను. కాని బయటమాత్రం స్తిమిత మేదీ? అబ్బా! తెగగొడవ అయిపోయింది."

సుదర్శనం అంతా ఆశ్చర్యంతో విన్నాడు. అతడాలోచిస్తూఉంటే సుబ్బులు పొయ్యికంక తిరిగింది. చక్కగా మండుతున్న పొయ్యి యెప్పుడారిపోయిందో ఆరిపోయింది. అప్పటికప్పుడే పొగలు గదల్లా ఆక్రమించి వాతావరణాన్ని దుర్భరం చేసి

విడిచిపెట్టింది. సుబ్బులు పొయ్యి చిమ్నీ పొగల జాడలనుండి ముఖాన్ని తప్పిస్తూ తల బాగా క్రిందికి వంచి గట్టిగా ఊదింది. రెండుమూడు ప్రయత్నాలతో పొయ్యి మళ్లా కులాసాగా మండ నారంభించింది. పొగ కూడా—ఎలా వచ్చింది అలానే మాయ మయింది.

సుబ్బులు ముఖం వికృతంగా పెట్టి, కళ్లు తుడుచుకుంటూ, ముక్కుతో ఎగపీలుస్తూ అంది—

"ఏమో సుమీ, చేసింది మంచి పని అవునో కాదో ఏ మాటా చెప్పలేను. ఆ గొడవలో అలా చెప్పవలసివచ్చింది. చెప్పేశాను. దానివల్ల మంచే రానీ చెడ్డే రానీ!"

సుదర్శనం చప్పున ఏమీ మాటాడలేదు. మాటాడే లోగా తల్లిఅలుకు డయింది. ఆమె వస్తూనే సుదర్శనాన్ని ఉద్దేశిస్తూ అంది—

"ఎవరో అబ్బాయి నీకోసరం అవతల నిలుచున్నాడయ్యా!"

సుదర్శనం లేచి బయటకు వెళ్లిపొయ్యాడు.

౧౧

సుబ్బులు చేసిన ప్రయోగఫలితం పదిరోజుల నాడు తెలిసింది. అది ప్రయోగం అనటానికి వల్ల కాదు. సుబ్బులు ఆలోచించి ఒక ఫలితాన్ని సుమారుగా ఊహించి చేసినపని కాదది. కనీసం ఫలితం బయలుపడినప్పుడు దానిని గమనించనైనా గమనించలేదు. అందుచేతే అది ప్రయోగ మనిపించుకోదు. అప్పటి కలా చెయ్యవలసివచ్చింది—చేసేసింది. అప్రయత్నంగా అది ప్రయోగమైపోయింది.

సుబ్బులు ఒక సాయంకాలం డాబామీద నీరెండలో పచారుచేస్తున్న అన్నను సమీపించింది. ప్రకృతీ, ఆ పెద్దపట్టణం డాబా, డాబామీది సుదర్శనం, అప్పుడే వచ్చిన సుబ్బులూ అరుణకాంతుల్లో మునిగి తేలుతున్నారు. ఆ వింతవాతావరణంలో సుబ్బులు అన్నను సమీపించి అంది—

"ఇవాళ అమ్మ నిన్ను పడచీవాట్లు వేసింది."

సుదర్శనం అకస్మాత్తుగా నిలబడిపోయి చెల్లెలిముఖంలోకి శూన్యంగా చూస్తూ ఊరుకున్నాడు.

సుబ్బులు అర్థయుక్తమైన చిరునవ్వుతో చెప్పనారంభించింది:

"నువ్వేమో కర్కోటకుడవుట. అచ్చం నాన్నగారి గుణాలన్నీ నీ కబ్బాయిట. మీ రిద్దరూ కూడా యెంతసేపూ మీ స్వార్థమే గాని ఇంకేమీ చూడరుట ......"

సుబ్బులు ఆగిపోయింది. ఆ మాట్లాడే వైఖరినీ, ఆ చిరునవ్వునూ చూచి మొదట వేళాకోళ మనుకున్నాడు. కాని మధ్యాహ్నంనుంచీ తల్లి ప్రదర్శిస్తున్న వైఖరి మాత్రే నిజమే అయివుంటవచ్చనిపించింది. ఏవిషయం తేలేవరకూ తనూ బయటపడరాదు అనుకుంటూ తాను కూడా అదే ధోరణిలో అన్నాడు.

"ఊఁ. చెప్పు!"

"యేమిటి చెప్పటం?"

"ఇంతకూ యిప్పుడు స్వార్థపరులమై మేం చేసిన మహాదోష మేమిటి?"

"ఏమిటా—ఆవిడగారి మనుమణ్ణి తీసుకరాక పోవడం!"

సుదర్శనానికి బోధపడినట్లు లేదు. తెల్ల మొహం వేసుక నిల్చున్నాడు. సుబ్బులు విసుక్కుంది.

"—అక్కయ్య అభిమానాలగురించి వాదన వచ్చింది. అక్కయ్యకు తనమీద అభిమానం ఉందని నేనూ—తను నామాట పడనివ్వదు—తనకు దానిమీద ఉన్న అభిమానం తనమీద దానికి లేదంటుంది. అది నిజమే. తనకైతే పెంచినందువల్ల ఏర్పడ్డ మమకారం. దానికూడా ఉండాలంటే ఎక్కణ్ణుంచి వస్తుంది?"

సుబ్బులు ప్రశ్న వేసి ఆగింది. కాని సుదర్శనం తన అభిప్రాయం వెలిబుచ్చలేదు.

ఆ మౌనం తన మానవమనస్తత్వపరిశోధనా జ్ఞానానికి అంగీకారంగానే తీసుకొని సుబ్బులు చెప్పనారంభించింది.

"—అలా అని యిప్పుడు యిన్నాళ్లుచేసి మాట దక్కించుకోకపోవట మేం? అంటాను."

సుబ్బులు ఈప్రశ్న వేసి మళ్లా ఆగింది. సుదర్శనం దీనికూడా జవాబివ్వలేదు. చెల్లెలు చెప్పనారంభించింది—

"—యిలా అని చాలాసేపు వాదించుకున్నాం. చివరి కా వాదనలో నిన్నటి విషయం చెప్పేశాను."

సుదర్శనం ఈసారి మాట్లాడాడు. ఆతృతగా అడిగాడు—

"ఏమిటి ?"

"నిన్న జరిగినది. శ్రీపతి బజారులో అగపడటం."

సుదర్శనం చిరాగ్గా మధ్యలోనే అడ్డుతగిలాడు.

"ఎందుకు చెప్పావ్ ? ఈ ఆడవాళ్ల నోట్లో నువ్వుగింజ నానదు !"

సుబ్బులు జంకకుండా రెట్టిస్తూ అడిగింది :

"ఇప్పుడు చెప్పినందువల్ల వచ్చిన నష్ట మేమిటి?"

"నువ్వే చెప్పావ్—చీవాట్లు వేసిందని ?"

"పాపం ! అబ్బాయి వణికిపోతున్నాడు !..." గొంతుక తగ్గిస్తూ "ఏదో మాటవరస కంది. ఆమె తత్వమే అంతే."

కాని సుదర్శనం ఉద్దేశం ప్రకారం—సుబ్బులు పొరపడుతోంది అనీ, ఆ లోకానుభవరాహిత్యకు మనుష్య హృదయం తెలుసుకునేపాటి జ్ఞానం ఉండదనీ సుదర్శనం నమ్మకం. నిజానికి సుదర్శనం చెల్లెలి కన్నా పదేండ్లు పెద్ద. కాగా చాలా చదువుకున్న వాడు. "ఇనుము విరిగ నేని" అన్న వేమనసూక్తి చిన్ననాడు చదువుకున్నా బాగా ఒంటబట్టిపోయింది. అందుచేతే విరిగిన మనస్సు మళ్లా అతుక్కుపోయిందని చెల్లెలు చెప్పబోతే నమ్మటం లేదు. పోనీ అని నమ్మక పోవటానికి వలనుపడకుండా ఉంది. దానికి తోడు సరీగా అదేసమయంలో తల్లి చేసుకవచ్చిన పని సుదర్శనాన్ని సందేహంలో పడేసింది.

క్రిందనుంచి కొంపలంటుక పోతున్నప్పటి పెద్ద నారి గందరగోళంలా ఓ చిన్నకంఠం అరుస్తోంది.

"పిన్నోయి ! చుబ్బు పిన్నీ ! నే నొత్తాను ! ఇదుగో నే నొత్తాను !"

సుబ్బులు సంతోషంతో రెండే అంగల్లో క్రిందికి పారిపోయింది. వెనుకనే సుదర్శనం కూడా దిగి వచ్చాడు. తల్లీ కొడుకులిద్దరూ ఒకరిమెడ ఒకరు గట్టిగా కౌగలించుకొని ఉన్నారు. పార్వతమ్మగారు అప్పుడే ప్రవేశిస్తున్నారు. సుదర్శనాన్ని చూడగానే అల్లుడు మామవంక తిరిగి కలానికి అందని స్వరంతో నూ, సంతోషంతోనూ, పోజుతోనూ, ఒక అసంపూర్ణ వాక్యం వదిలాడు—

"మామయ్యోయ్ !..."

మామ కూడా అల్లుడి స్వరాన్ని అనుకరిస్తూ కళ్లు బాగావిప్పి, నోరు బాగా వంచిస్తూ అన్నాడు—

"ఓ... హో !"

అల్లుడు ఒక నవ్వు నవ్వాడు. మామ జవాబిచ్చాడు. తర్వాత "ఇక్కడే ఎలా వచ్చాడూ !" అంటూ సుదర్శనం, "ఎక్కడ దొరికాడీ వెంకన్న" అంటూ సుబ్బులూ కాస్త హెచ్చుతగ్గగా ఒకేసారి తల్లివంక తిరిగి అడిగారు. పార్వతమ్మగారు మెట్లెక్కెళ్లనా ప్రక్కకు మళ్లించుకుంటూ అన్నారు—

"ఏమో నాయన ! కనకమహాలుకి గుడిసిద్ద కొబ్బరికాయకొనుక్కుంటే ఎక్కణ్ణించో వచ్చి కాళ్లు రెండూ కౌగలించుకున్నాడు. ఎవరా అని గుల్లిపడి చూస్తే—వీడూ ! తర్వాత 'నీతో వస్తాను పద' అంటూ కూర్చున్నాడు. నా వెంట అంటూంటే ఏమి టననూ ! సరే అని తీసుక వచ్చేశాను."

సరస్వతిసంగతి వాళ్లు అడగనూలేదు. తల్లి చెప్పనూ లేదు. అన్నా చెల్లెళ్లిద్దరూ మాత్రం ఒకరిముఖం లోకి ఒకరు సాభిప్రాయంగా చూసుకున్నారు.

పార్వతమ్మగారు పెరట్లోకి వెళ్లిపోయిన తర్వాత సుబ్బులు రహస్యంలా అడిగింది—

"ఎవరితోరా బాబూ వచ్చావూ !"

"అమ్మా ! నాన్నగారూ ! పొలుసు చాంత పిన్నీ ! అంతా వచ్చారు..."

"అమ్మతో చెప్పావా—నువ్విలా వస్తున్నావనీ !"

"ఆఁ... చెప్పాను... నేనల్లంతమూలాన్ని అమ్మమ్మను చూచి వలుగొత్తిక వస్తాను. మే మిద్దరం వలి పోవత్తున్నాం—అమ్మ కొబ్బరికాయలు కొంతోంది. నేను వెల్తున్నానని చెప్పాను. అమ్మా...అమ్మా... అమ్మ వూలుకుంది. అలా... చూస్తూ ఊలుకుంది."

చాలాచాలా అభినయంతో, బహుకష్టంమీద విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకొని, ఒక పెద్దఉద్యమాన్ని నిర్వహించేంత శ్రమతో చెప్పాడు. అన్నా చెల్లెళ్లిద్దరూ ఒకరివంక ఒకరు మరిఒకసారి చూసుకున్నారు. తర్వాత సుదర్శనం అడిగాడు.

"నాన్నగారేమీ అనలేదూ !"

"నాన్నగారా ?...నాన్నగారూ......నాన్నగారు ఏమీ అనలేదు. అమ్మమ్మ అల్లక్కడున్నప్పుడు నాన్నగారే చూపించి వెళ్లమన్నారు."

సుదర్శనం ఈ చివరివాక్యాన్ని పట్టుకొని తలా తోకా అమర్చుకుంటూ నిష్క్రమించాడు.

## ౧౨

రాత్రి భోజనాలవుతున్నాయి. శ్రీపతిమహానైవేద్యం ముందుగా అయిపోయింది. అందుచేత తాతగారిప్రక్కనే పీటమీద కూర్చుని కబుర్లు చెపుతూ తినిపిస్తున్నాడు. కొంతసేపయినతర్వాత ఏం బుద్ధి పుట్టిందో - లేచి "నే పలుకుంతాను!..." అని ప్రకటించాడు. మామ వద్దు ముందని వారించబోయాడు. కాని పిల్ల నిచ్చుకున్న మామల సలహాలనే పాటించే అంత ఆత్మగౌరవరహితులు తెలుగుగడ్డమీద ఇంతవరకూ పుట్టలేదు. అటువంటప్పుడు ఈ ఒంటిపోగు మేనమామ మాటలు ఖాతరు చేసే దెలాగ ?

సుదర్శనం ముందుగా భోజనం చేసి ఇవతలకు వచ్చాడు. చీకటిగా ఉన్న నట్టింట్లోంచి శ్రీపతి గొంతు నెమ్మదిగా వినవస్తోంది.

"ఊం. లోజూ ఏలిచేది! నాన్నగాలూ, అమ్మా అప్పులప్పులూ దెబ్బలాలుకోలమే—నువ్వూ అమ్మా దెబ్బలాలుకోనేవాలూ—అలానే"

తర్వాత పార్వతమ్మగారు ఏదో ప్రశ్న వేసివుంటారు. దానికి శ్రీపతి కాస్త గట్టిగా జవాబు చెప్పటం ఆరంభించాడు.

"ఊఁ! నే నలా...అంతే అమ్మ నెమ్మొత్తుందీ... తీసుకెల్తుందీ అనీది..." తర్వాత అమ్మమ్మ మందలించింది కాబోలు మెల్లిగా చెప్పసాగాడు. "...ఎప్పుడంతే లోజూ, లేపే అనేది. తాతయ్యా...తాతయ్యా అప్పు లోకసాలీ అల్లప్పులోకసాలీ...మల్లా అల్లప్పు లోకసాలి... వచ్చాలు. తాతయ్య అన్నీ అబద్ధాలే అమ్మమ్మా! నువ్వూల్లో లేవన్నాలు. ఊల్లో లేవమ్మమ్మా!"

బహుశా ఉన్నానని జవాబు వచ్చుంటుంది. శ్రీపతి హుంకరించి చెప్పసాగాడు.

"హుఁ! అబద్ధాలే... అన్నీ అబద్ధాలే"

ఇంక బాగుండదని సుదర్శనం గదిలో ప్రవేశించాడు. మంతనాలు ఒకవిధంగా ఆగిపోయాయి. చీకటి గదిలోంచి మెల్లగా ప్రక్కగదిలోకి వెళ్లిపోయాడు.

సుదర్శనం బట్టలు మార్చుకుంటుంటే శ్రీపతి మళ్లా కుశకుశలాడసాగేడు.

"నేను నీదగ్గరే పలుకుంతా నమ్మమ్మా. పిన్ని దగ్గిల పలుకోను.

అమ్మదగ్గిల పలుకుంతే...అమ్మ మంచిది కాదమ్మమ్మా! చగంలాతిల్లో నాదగ్గిల్నుంచి లేచిపోయి వెలిపోతుం దమ్మమ్మా. నాకు తెలివొత్తుందీ—చీకతీ బయ్యం! అప్పులు అమ్మా...అమ్మా...అనిపిలుత్తే... అప్పులు వత్తుంది. నాకు చీకతీ, బయ్యం..."

తర్వాత మళ్లా ఏ గుసగుసలూ వినరాలేదు.

సుదర్శనం బట్టలుమార్చి నడవలో ఉన్న దీపం తీసుకొనిపోయి నట్టింటిమధ్యగా ఉంచాడు.

దీపం వెలుతురులో చీకట్లన్నీ మాయమయాయి. అంతకుముందు కానరాని వస్తువుల ఉనికి స్పష్టంగా కనుపించసాగింది. సుదర్శనం తల్లివంక చూశాడు. ఆమె గోడకభిముఖంగా ఉండటంచేత ఆమెముఖం మాత్రం కానరాలేదు.

మంచినీళ్లకోసం వంటయింటివంక నడిచాడు. అంతకుముందు తండ్రీకూతుళ్లు ఏమిమాట్లాడుకుంటూ ఉండిరో తెలియదు—సుదర్శనం వెళ్లేసరికి తండ్రి ఉత్తరాపోసనం ముగిస్తూ అంటున్నాడు.

"—మాటలటమ్మా! పెంచిన మమకారం కన్నదానికన్నా ఘనమైనది. దాని పుట్రలో ఏదో పురుగు పుట్టింది. కొన్నాళ్లు బాధపడింది. ఇప్పుడు ఏవిధంగానో అది మళ్లా పోయింది...అంతే..."

యిలా అంటూ ఆయన లేచిపోయాడు.

సుదర్శనం అక్కడి పాత్రలోని మంచినీరు తృప్తిగా త్రాగి బయటకు వచ్చేశాడు.

పార్వతమ్మగారి పుట్రలో పుట్టిన పురుగేది—ఎప్పుడు పుట్టింది— ఎలా బాధించింది— చివరి కెప్పుడెలా హరించిపోయిందీ—మొదలైన ప్రశ్నలను అతడు వేసుకోలేదు. ఇందులో కొన్ని తమంతతామే ప్రవేశించబోయినా ఓపిక లేకపోవడంవల్లనో, లేకయింకే సంతృప్తివల్లనో అతడు వాటికి ఎడమిచ్చాడు కాదు.

# గంగాలహరి

[అనువృత్తము]

●

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

దిక్కుతోఁచని వట్టి దీనాత్ముఁడను నేను, క్షేమమార్గప్రదర్శినివి నీవు
చింతాసమాకులితాంతరంగుఁడ నేను, చాంచల్యభంజనౌషధము నీవు
పరమతృష్ణాతురస్వాంతుండ నేను, సంపూర్ణదయామృతపూర మీవు
మారవికారాంధకారమగ్నుఁడ నేను, వైరాగ్యరత్నదీపంబ వీవు
తనయుఁడను నేను లోకైకజనని వీవు - అనదనై నిస్సహాయుఁడనై కరావ
లంబ మర్థించి "పాహి, పాలయ" యటంచుఁ-జెంత నిలచితి, నేమి చేసినను మేలె.

జీవితాంతమునందు, నన్ జేనకవచ్చు - శమనుదూతకు నుచ్చాటనముగ, వదన
రంగమునఁ దాండవించుత గంగ యనెడి - యద్వయానందనామాక్షరద్వయంబు.

పదియునాలుగు భువనాల భవనమైన - కమలజాండము నీతరంగముల నడుమ
దుమికి పందు విధమ్ముగా దొర్లుచుండు - వ్యోమకేశుని ఘనజటావ్యూహమందు.

శ్వపచులైనను నలుపఁ జాల్పడని ఘోర - పాపపుంజమ్మునకు నేకభవనమైన
నన్ను నీ వుద్ధరింపగా నడుముగట్టె - దమ్మరో! యెట్లు శ్లాఘింతునమ్మ నిన్ను?

"ఒక్కరుఁడేని లేఁడొకో దురుద్ధరపాపుఁడు, వానినే జగం
బక్కజమంద బ్రోవవలె" నన్నది నీ చిరకాలవాంఛ, నే
నొక్కఁడ నట్టివాఁడ నిదిగో! చనుదెంచితి, నన్ను బ్రోచి నీ
మక్కువ తీర్చికొ మ్మఖిలమానవలోకము విస్మయంపడన్.

నిలుకడ లేని బుద్ధియును, నీతివిదూరచరిత్ర, పొట్టకై
తులువల నాశ్రయించుటయు, దుర్జనమైత్రియుఁ, గొండెముల్, మృషా
ప్రలపనముల్, కుతర్కములు, బాల్యమునుండియు నాకు నైజ మీ
ఖలుని ముఖ మ్మెవండు సుముఖమ్ముగఁ గన్గొను నీవు దక్కఁగన్!

కన్నులున్న ఫలం బేమి కాంచరేని - నిత్యనూత్నమ్ము నీ రామణీయకమ్ము?
వీను లున్న ఫలం బేమి వినరయేని - గమకమధురమ్ము నీ కలకలరవమ్ము?

పుణ్యులకు స్వర్గసుఖము, పాపులకు నరక - బాధ యనియెడి ధర్మవిభాగ మఖిల
పాపహారిణి గంగాభవాని లేని - యశుభమయమైన దేశమ్మునందె చెల్లు.

వేదషడంగపారగుని విప్రుని ద్రుంచియుఁ, బుత్రనిర్విశే
షాదృతిఁ జూపు దేశికు గృహమ్మున కెగ్గు దలంచియున్, దురి
నీదరి దేహమూడ్చి జననీ! చనునమ్మ నరుండు, యజ్ఞసం
పాదితపుణ్యులైన యాజమానులు పోవు మహాపథమ్మునన్.

విరహిణీప్రాణములను గ్రొవ్విరులసౌరభమును హరియించు క్రూరస్వభావుఁడయ్యు
నీ జలస్పర్శశుద్ధుఁడై నిఖిలజగము - పావనము సేయుచున్నాఁడు పవనుఁ డంబ!

ఇహసుఖమ్మని పరసుఖమ్మని కోరి - పురుషకార మొనర్తురు నరులు సతము
నేను భువనద్వయభరమ్ము నిన్నె పూన్చి-యురక సుఖముగ నిదురించుచున్నవాఁడ.

నరకగహ్వరపతితసంత్రాణమందు - నీకు నెంతటి ప్రీతియో, నాకు నంతె
నరకపతనోన్ముఖంబైన నడకయందు-నైజ మెవ్వారికేని మానంగరాదు.

వాసుకిభూషణుండు రసనన్మతి దాండవకేళి సల్పు సం
ధ్యాసమయమ్మునన్, బ్రతిగఁ దాను నుదీర్ణతరంగహస్తవి
న్యాసములన్ భ్రమిభ్రమణనవ్యగతిస్ఫురణంబులన్ మహో
ల్లాసము దోప జహ్నుసుత లాస్యము సల్పుట ప్రస్తుతించెదన్.

నాసుఖమైనఁ గష్టమయినన్ భవదీయభరమ్ముగా, సమా
శ్వాసితబుద్ధినై బరవసమ్ముమెయిన్ మనుచుంటి; డెప్పరం
బీసమయమ్ము; నన్ను ద్యజియించదవేని జగాన భక్తివి
శ్వాసము లస్తమించునో, యసారము లౌనో దయాస్వభావముల్.

అర్ధనారీశు జడల నీ వాడునపుడు-పొరలి, గిరికన్యసీమంతమును స్పృశించు
చిఱుతరగ నామె కోపరంజితదృగంత-యగుచు విదిలించుటలు నవ్వులాట నీకు.

(సశేషము)



# ప్లేటో అనుకరణవాదము

## 3. రామణీయక విచారణ

●

శ్రీ జి. వి. కృష్ణరావు

ప్లేటో ప్రతిపాదించిన జ్ఞానస్వరూపాన్నిబట్టి ౧ ఆధ్యాత్మికమనీ, భౌతికమనీ రెండు జగత్తు లేర్పడుతున్నాయి. భౌతికజగత్తుకు ఆధ్యాత్మిక జగత్తు మూలం. భౌతికజగత్తు వ్యక్తికము, సాపేక్షము, ఇంద్రియగోచరము. అభిప్రాయానికి విషయము. పరిణామి, నశ్వరము. విరుద్ధగుణభూయిష్ఠము. ఆధ్యాత్మిక జగత్తు అంటేనో అలా కాదు. స్వయంభువు. సంపూర్ణము. వివేకానికి విషయం. అతీంద్రియం. పరిణామ రహితం. పారమార్థికం. నిత్యం.

ఈ విభాగాన్నిపట్టి రామణీయకమునేదికూడా రెండు విభాగాలవుతున్నది. (౧)అలౌకికరామణీయకం, (౨) లౌకిక రామణీయకం.

అలౌకికరామణీయకం ఏకైకం, స్వయంభువు. సంపూర్ణము, అతీంద్రియము, వివేకైకవిషయం. మారేది కాదు. సాపేక్షం కాదు. నిత్యం.

ఈ రామణీయకం ఏకైకముఅంటే సత్యం, ధర్మం మొదలైన భావాలకంటె భిన్నమై స్వతంత్రంగా ఉంటుంది. దీనిలో తరతమ భావాలు లేవు.

స్వయంభువు. ఈ రామణీయకం మనఃకల్పితం కాదు. ఈశ్వరకల్పితమూ కాదు. అంటే ఏవిధంగాను ఉత్పాద్యం కాదు. దేశకాలబద్ధమూ కాదు.

రామణీయకం భౌతికం కాదు. అంటే ఇది ఆకృతిలోకాని, రూపంలోకాని, శబ్దంలోకాని, నాదంలో కాని లేదు. అందువల్ల ఇంద్రియగోచరం కాదు. ఇది అతీంద్రియం. రామణీయకం వివేకానికి విషయం. అంటే వివేకానికి ఒక్కదానికే గోచరిస్తుంది. ఇది నిరుపాధికం (*Nonhypothetical*). ఈ రామణీయకం మారేది కాదు. అన్ని దేశాలకూ, అందరువ్యక్తులకూ, అన్ని కాలాలకూ ఇది ఒకటే. ఒకప్పుడు తరిగేది కాదు, మరొకప్పుడు పెరిగేది కాదు.

రామణీయకం ధర్మంమీదకాని, సత్యంమీద కాని, మరొకభావంమీదకాని ఆధారపడటం లేదు. ఇది కేవలం నిరపేక్షము. స్వయంప్రకాశము.

లౌకికరామణీయకం ప్లేటోమతంప్రకారం రెండుభాగాలౌతుంది. ఒకటి ప్రకృతిసిద్ధరామణీయకం. రెండు మానవకల్పితరామణీయకం. ప్రకృతిసిద్ధరామణీయకం అలౌకికరామణీయకానికి అనుకరణం. ఈ అనుకృతికి కల్పితరామణీయకం అనుకృతి.

అయితే లౌకికరామణీయకలక్షణ మేమిటి? ఇది ౧ వ్యక్తికము. ౨ సాపేక్షము. ౩ ఇంద్రియగోచరము. ౪ అభిప్రాయానికి విషయము. ౫ పరిణామి. ౬ అనశ్వరము. ౭ విరుద్ధగుణభూయిష్ఠము. ౮ అసంపూర్ణము. ౯ అవివేకము. ౧౦ సోపాధికము.

ఈ లౌకికరామణీయకం అనేకము. రమణీయ భవనాలు, రమణీయవిగ్రహాలు, రమణీయగానం, రమణీయకావ్యం, రమణీయచిత్రం ఇలా అనేకంగా ఉంటుంది. ఈ రామణీయకం చక్షుష్కర్ణగోచరం. సాపేక్షం. ఇందులో తరతమభావాలున్నాయి. ఇది పరిణామి. సత్యం, ధర్మం, వికారం మొదలైనవాటికి కూడా ఇందులో ప్రసక్తి ఉంటుంది. దీనికి ప్రయోజకతా ప్రయోజకత లున్నాయి. ఈ రామణీయకం నశ్వరం.

మానవకల్పితరామణీయకానికి కూడా ఇవే లక్షణాలు. అయితే ప్రకృతిసిద్ధరామణీయకం దీనికంటె

ఉత్తమం. ఎందుకంటే ప్రకృతసిద్ధరామణీయకం యథార్థతరం, ప్రయోజనకారి. మానవకల్పితరామణీయకమంటేనో అనుకృతికి అనుకృతి. అందువల్ల అయథార్థ అవివేక ఉద్బోధకం. అందువల్ల మానవకల్పితరామణీయకం, అవివేక ఉద్బోధకం త్యాజ్యం అని ప్లేటో నిషేధిస్తాడు.

ఈ సిద్ధాంతాలను దృష్టిలో ఉంచుకొని ప్లేటో వాద మనుసరిస్తే తేలికగా అర్థమౌతుంది.

* ఏవి రమణీయవస్తువులు ? రామణీయకమంటే ఏమిటి ? వివేకం, కలిగినవారిని వివేకవంతు లంటున్నాము. మంచితనం ఉన్నవాళ్ళను మంచివాళ్లంటున్నాము. కాబట్టి వివేకం మంచితనం ఉన్నాయి. అలాగే రామణీయకం కలిగిన వస్తువులను రమణీయ వస్తువు లంటున్నాము. అంటే రామణీయకమనేది ఒకటి ఉన్నది. అయితే ఏమిటి యీ రామణీయకం? దేనిని రామణీయక మంటున్నాము ?

అందమైన కన్య రామణీయక మనవచ్చును. కాని కన్య ఒక్కటేనా రామణీయకం? అశ్వాలు, గోవులు, వీణలు, భాండాలు రమణీయాలు కావా ? రమణీయార్థాలు ఎన్నో ఉన్నాయి. కాని వీనిలో తరతమభావా లంటున్నాయి. రమణీయకాంతలతోను, అశ్వాలతోను, వీణలతోను పోల్చిచూచినప్పుడు భాండాలు రమణీయాలు కావు. అత్యంతరమణీయమైన కోతిని మానవునితో పోల్చిచూచినప్పుడు వికారంగా ఉంటుంది. భాండాలను కాంతలతో పోల్చిచూచినప్పుడు వికారంగా ఉంటాయి. ఈ కాంతలనే దేవకన్యలతో పోల్చి చూచినప్పుడు చాలా వికృతంగా ఉంటారు.

ఇంతకూ అసలుప్రశ్న అలాగే ఉంది—— ఏది పారమార్థికరామణీయకం ? దేని ఉనికివల్ల వస్తువులు రమణీయాలౌతున్నాయి? కన్య కావటంవల్లనా ? లేక వీణ కావటంవల్లనా ? కాక అశ్వం కావటంవల్లనా ?

మెరిసేదీ, కగ్గనిదీ స్వర్ణం. దీనిని కోరనివాళ్లు ఉండరు. దీని సంయోగంతో ఎలాంటి వికారవస్తువైనా రమణీయమౌతుంది. వికారంగా కనిపించేది కూడా రమణీయంగా కనిపిస్తుంది అనవచ్చును.

ఆలెక్కలో శిల్పి ఫీడియస్ (*Phiedias*) తెలివితక్కువవాడు కావాలి. ఎందుకంటే అతడు "ఎథీనా" సుందరీప్రతిమకన్నులను బంగారంతో చేయలేదు. ముఖంకాని, కరచరణాలుకాని బంగారంతో చేయలేదు. కేవలం దంతంతో చేశాడు. దంతంకూడా రామణీయకమేనంటే, నేత్రగోళంకూడా ఆ దంతంతో చేసిఉండవలసింది. కాని అతడు అలా చేయలేదు. దంతచ్ఛాయ కలిగిన రాతితో చేశాడు. అతడు అలా ఎందుకు చేయాలి ? రమణీయశిలకూడా రామణీయకమేనా ?

ఔచితి ఉంటే, రాయికూడా రామణీయకమే అనవచ్చును. ఈ లెక్కలో అనౌచితి వికృతి అన్నమాట. కాబట్టి ఔచితిఉన్నప్పుడే స్వర్ణదంతములు వస్తువులను రామణీయకాలుగా చేస్తున్న వన్నమాట. అందువల్ల ఔచితి ఏ వస్తువునైనా రమణీయం చేయాలి.

సరే, బాగానే ఉంది. తొర్రిమొర్రికుండలో ఒకనిర్భాగ్యుడు వంట చేస్తుంటాడు. దానికి తగింది, ఉచితమైనది బంగారుతెడ్డా ? కొయ్యతెడ్డా ? కొయ్యతెడ్డుతో వంటకానికి కొంత రుచి రావచ్చును. బంగారుతెడ్డుతో అసలు కుండ ముప్పు రావచ్చును. కాబట్టి తొర్రిమొర్రికుండకు కొయ్యతెడ్డు ఉంటే రమణీయ మౌతుంది. కాబట్టి వంగలేని అత్తకు లేవలేని కోడలు, కుంటివానికి గ్రుడ్డిపెళ్లాము ఉండటం రామణీయకం. అంతేనా ?

అది అలా ఉంచి మనకు ముఖ్యమైన విషయం విచారింతాము. మనకు కావలసింది ఏమిటి ? ఎవరికీ, ఎప్పుడూ వికారం కాని రమణీయవిషయం కావాలి.

ఈమాట అనగానే ఒకటి స్ఫురించవచ్చును.

"కీలారమునఁనుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేల బండి యొరగ

---

* *Hippias Major* ఈకృతి నిజంగా ప్లేటోదేనా అన్న విషయంలో సందేహాలు సూచించారు. కాని విషయాన్నిబట్టి చూస్తేమాత్రం ప్లేటో వాదమే కనిపిస్తున్నది. A. E. *Taylor* మొదలైనవారు ప్లేటోదిగా అంగీకరించారు.

కేవలం చక్షుస్సుద్వారా సంతోషం కలిగించే వస్తువులు చక్షుష్కర్ణంద్వారా సంతోషం, సుఖం కలిగించే వస్తుకోటిలో చేరవుకదా? అప్పుడు అవి రామణీయకం కాదుకదా. అలాగే కేవలం కర్ణం ద్వారామాత్రమే సంతోషం, సుఖం కలిగించే వస్తువులు కూడా రామణీయకం కాదుగదా అన్న సందేహం వస్తుంది. ఈరెండింద్రియాలలో ఒక ఇంద్రియంద్వారా సుఖకరమైనది ఈ ఉభయఇంద్రియాలద్వారా సుఖకరం కాని మాట వాస్తవం. ఈ రెండుసుఖాలలో ప్రతి ఒక్కటీ తనకు తాను రామణీయకం కాబట్టి రెండూ రామణీయకమే.

సరే అంతవరకూ బాగానే ఉన్నదందాము. మీరు చెప్పినట్లుగా కంటిద్వారా సుఖం కలిగించేవీ ఉన్నవి. చెవిద్వారా సుఖంకలిగించేవీ ఉన్నవి. ఇలాగే తతిమ్మా ఇంద్రియాలద్వారా సుఖంకలిగించేవీ ఉన్నవి. అయితే ఈసుఖంలో తేడాలున్నాయి. అంటే విభిన్నఇంద్రియాలద్వారా కలుగుతున్న సుఖంలో తారతమ్యాలు ఉన్నవా లేవా అని అడగటం లేదు. కాని ఒకటి సుఖమై మరొకటి కాకపోతున్నదా? లేదు. అన్నీ సుఖం కలిగించేవే.

దీనినిబట్టి ఒకటి తేలుతున్నది. దృశ్యతారమణీయాలు, శ్రవ్యతారమణీయాలు రామణీయక మంటున్నామంటే సుఖం కలిగిస్తున్నవికాబట్టి రామణీయక మనటంలేదు. వాటిని రామణీయక మంటున్నామంటే, తతిమ్మా సుఖకరాలనుంచి వేరుపరచే ప్రత్యేక లక్షణ మేదో ఒకటి ఉండాలి. దృశ్యతాసుఖం కేవలం దృశ్యతవల్ల కలుగుతున్నది కాబట్టి రమణీయ మనటం లేదు. దృశ్యతవల్ల కలిగే సుఖము ఒక్కటే రామణీయక మనేటట్లయితే, శ్రవ్యత ద్వారా కలిగే సుఖం రామణీయకం కాకపోవాలి. ఎందుకంటే అది దృశ్యతద్వారా లభించటం లేదు. శ్రవ్యతాసుఖం రామణీయకమంటే పైవిధంగానే దృశ్యతాసుఖం రామణీయకం కాకపోవాలి. అయినా రెండూ రామణీయక మంటున్నాము. కాబట్టి రెంటినీ రమణీయంచేసే సామాన్యలక్షణం ఒకటి వాటిరెంటిలోను ఉండాలి. అలా కానిపక్షంలో ప్రతిఒకటే కాని, రెండూకాని రామణీయకం కాజాలవు.

రమణీయవస్తువులలో దృశ్యతారమణీయాలు, శ్రవ్యతారమణీయాలుమాత్రమే రామణీయక మని వేరు చేస్తున్నాము ఇలా వేరుచేస్తున్నా ఈ రెండుసుఖాల లోను ఉన్న రామణీయకాన్ని ఎలా నిర్వచించాలి? ఈ రెండుసుఖాలు నిరపాయాలు. సుఖాలన్నిటిలోను ఇవి ఉత్తమాలు. ఇది రెంటికీ, ప్రతిఒకదానికీ అన్వయిస్తుంది. అయితే యింతకూ రామణీయకమంటే లాభదాయకమైన సంతోషమునేనా నిర్వచనం? ఆ పక్షంలో ఇంతకుముందు చెప్పుకొన్నట్లు లాభదాయకమంటే ధర్మప్రతిపాదకమనీ, రామణీయకం కారణమై, ధర్మం కార్య మౌతుందనీ, కారణకార్యములు వేరనీ సిద్ధిస్తున్నవి కాబట్టి మళ్ళీ మొదటికే వస్తున్నా మన్న మాట. ఎందుకంటే రామణీయకం ధర్మంకాదనీ, ఈ రెంటిలో ప్రతిఒక్కటే రెండవదానికంటె భిన్నమనీ ఇదివరకే తేలిపోయింది.

ఈ పర్యాలోకనంతో ఏమి తేలింది? రామణీయకమంటే శిలావంతిసువర్ణాదిక ద్రవ్యం కాదు, ఔచితి కాదు. ప్రయోజనం కాదు. సామర్థ్యం కాదు. ప్రయోజనసామర్థ్యం అంతకన్నా కాదు. ధర్మం అసలే కాదు. సుఖసంతోషాలు అంతకన్నా కావు. అయితే ఇదీ ఒక నిర్వచన మేనా? రామణీయకమంటే ఏది కాదో చెప్పటం జరిగిందికాని, ఏమిటో నిర్వచించటం జరగలేదు. కాబట్టి ప్లేటోకు రామణీయకమంటే ఏమిటో తేలలేదు. అతడుకూడ సందిగ్ధావస్థలోనే ఉన్నా డనిపించ వచ్చును. కాని అది పొరపాటు. అతనికి రామణీయక మంటే ఏమిటో ఒక నిర్దిష్టాభిప్రాయం ఉంది. ఆ అభిప్రాయాన్ని ప్రతిపాదించటానికే పైని పేర్కొన్న చర్చ సాగించాడు.

అతని మతంప్రకారం రామణీయకం భౌతిక పదార్థం కాదు. అది కేవలం ఒక భావం. ఈభావం స్వతంత్రం ఇది మానవకల్పితమూ కాదు, ఈశ్వర కల్పితమూ కాదు. ఇది జీవాత్మ కాదు, పరమాత్మ కాదు. నిత్యమూ, తారతమ్యవిరహితమూ, స్వయంభువు అయిన భావం.

ఈ అర్థమే ప్లేటో సింపోజియంలో ఇలా వివరించాడు—"ఈ రామణీయకం నిత్యం. దీనికి ఆద్యం

తాలు లేవు. ఇది ఉత్పన్నం కాదు. నష్టం అంత కన్నా కాదు. ఈ రామణీయకం ఒకవిధంగా రమణీయమై మరొకవిధంగా వికారంగా కనిపించేది కాదు. ఇది ఒక కాలంలో, ఒకచోట, ఒకదృష్టికి రామణీయకమై మరొకకాలంలో, మరొక చోట, మరొకదృష్టికి వికారంగా కనిపించేది కాదు. ఈ రామణీయకం ద్రష్టలమీద ఆధారపడి లేదు. ఈ రామణీయకం ముక్కు గాదు, ముఖం కాదు. రక్తమాంసాలతో కూడిన శరీరం కాదు. వాక్కు కాదు. విద్యా గ్రహణం కాదు. దాని సత్తా ప్రాణిలో కాని, పృథ్విలో కాని, ఆకాశంలో కాని లేదు. మరేజీవిలోను ఉండేది కాదు. దాని కేవలసత్తాస్వీకకమై తనలో తానుంటుంది. ఈ రామణీయకంయొక్క లక్షణాలను పొందిన వస్తువులు రమణీయాలవుతున్నవి. ఇలాంటి రమణీయవస్తువులు పుడుతూ గిడుతూ ఉంటాయి. అయితే, పారమార్థికమైన రామణీయకంమాత్రం తరగదు, పెరగదు. వికారం లేక పరిణతి అంతకన్నా పొందదు."

అయితే ఇలాంటి పారమార్థికరామణీయకం నుంచి లౌకికరామణీయకం ఎలా అవతరిస్తుందో చూదాము.

### లౌకిక రామణీయకం

* భావం ఈశ్వరాభివ్యక్త మని చెప్పుకొన్నాము. దీనికి భౌతికప్రపంచంలో అనేకవిధాలైన ఆభాసా లున్నాయి. ఉదాహరణకు గృహం తీసికొందాము. గృహభావం ఈశ్వరాభివ్యక్తం. ఈ భావాన్ని అనుసరించి వాస్తుజ్ఞుడు ప్రయోజనంకోసం గృహం నిర్మిస్తున్నాడు. చిత్రకారుడు భౌతిక గృహాన్ని అనుసరించి గృహచిత్రం గీస్తున్నాడు. ఇక్కడొక విశేష ముంది. వాస్తుజ్ఞుడు వాస్తుశాస్త్ర నిర్దిష్టవిషయాలనుమాత్రమే నిర్మిస్తాడు. చిత్రకారుడు అలా కాదు. ఇతరవృత్తులవారు చేసే వస్తువులన్నీ సృష్టిస్తున్నాడు. అతడు మనుష్యులనే కాదు, తరులతాదులనే కాదు, ప్రాణికోటినే కాదు, సమస్తవిషయాలనూ సృష్టిస్తున్నాడు. మూడులోకాలను, తుదికి దేవతలనుకూడా సృష్టిస్తున్నాడు.

ఇలాంటి పని కష్టతమ మనిపించవచ్చును. కాని నిజానికి ఇలాంటిపని సులువుగా తొందరగా చేయటానికి అనేకమార్గా లున్నాయి. వాటన్నిటిలో మరీ సులువైనది మరొకటి ఉంది. అద్దం నలుమొగాల తిప్పివేసరి, భూమ్యాకాశాలను, సూర్యుణ్ణి, తరులతాదులను, మానవులను తేలికగా సృష్టించివేయవచ్చును. అయితే యిలా సృష్టమైనవన్నీ ఆభాసాలే. కవి, చిత్రకారుడు ఈ ఆభాసాలనే తయారుచేస్తారు. వీరిచే సృష్టమైన దంతా అయథార్థం.

ఇప్పటికి మూడురకాల సృష్టులు కనిపిస్తున్నాయి. ౧. ఈశ్వరాభివ్యక్తమైన గృహభావాదికం, ౨. వృత్తికారసృష్టి అయిన గృహాదికం, 3. కళాస్రష్ట సృష్టి అయిన గృహచిత్రాదికం. మొదటిది యథార్థం. రెండవది మొదటిదాని ఆభాసము. మూడోది రెండవదానికి అనుకరణం. కాబట్టి మూడవదైన కళాసృష్టి యాథార్థ్యానికి మూడింతలు దూరమౌతున్నది.

### వ్యావహారికజగత్తు-కళాసృష్టి

ఇంతకూ కలాస్రష్ట అనుకరణం సత్యాన్ని అనుకరించటంలేదు. కేవలం ఆభాసాన్ని అనుకరిస్తున్నది. వ్యావహారికశయ్య ఒకటి ఉన్న దనుకొండి. దానిని భిన్నభిన్న స్థానాలనుంచి, భిన్నభిన్నదూరాలలో ఉండి చూస్తే ఆ ఒకేశయ్య భిన్నభిన్న ఆకృతులతో గోచరిస్తుంది. (కళాస్రష్ట ఆ భిన్నత్వాలనే చిత్రిస్తున్నాడు. కాని ఏకంగా ఉన్న ఆ వ్యావహారికశయ్యను చిత్రించటం లేదు.) అందువల్లనే కళాస్రష్ట కేవలం ఆభాస మనుకరిస్తున్నాడని చెప్పాలి.†

* *Republic*, *chap* : 10.

† ఈ అర్థమే పండితరాయలుకూడా ప్రతిపాదించాడు:—

"విభావాదీనామపి స్వప్నతురగాదీనామివ, రంగరజతాదీనామివ సాక్షిభాస్యత్వ మవిరుద్ధమ్."

(రసగంగాధరం, ప్రథమాననం ౨౬ పే.)

ఇది సిద్ధాంతమైతే బోశాంకో పేర్కొన్నట్లు సంగీతసాహిత్యకళల యాథార్థ్యంవిలువ పూర్తిగా అపకృష్టమౌతుంది.

అతడు ఇలా కేవలం ఆభాసాలను అనుకరిస్తూ ఉండటం వల్లనే అన్నివస్తువులను సృష్టించగలుగుతున్నాడు. కమ్మరిని, వడ్రంగిని మొదలైనవారినంతా సృష్టిస్తున్నాడు. కాని వారి వృత్తులలో ఒకటికూడా అతనికి తెలియదు. అయినా అతని బొమ్మలను చూచి పిల్లలు తెలియనివాళ్లు నిజంగా వడ్రంగిని కమ్మరిని చూస్తున్నా మనుకొంటున్నారు. చిత్రకారుడు సర్వజ్ఞుడని భావిస్తున్నారు. కాని ఇలా అనుకొనే వారికి జ్ఞాన అజ్ఞాన అనుకరణాల స్వరూపం తెలియదు.

కవి చిత్రకారాదులు అనుకరిస్తున్నారని అనుకొన్నా, అలా అనుకరించటానికైనా జ్ఞానం కావాలి కదా అనవచ్చును. కాని బింబము, ప్రతిబింబమూ సృష్టించగలిగినవాడు ప్రతిబింబసృష్టిలో ఎందుకు నిమగ్నుడౌతాడు? జీవితానికి మరొక పరమార్థం లేనట్లుగా అనుకరణమే ప్రధానంగా ఎందుకు చేసుకొంటాడు?

అసలు అనుకరణస్వరూపం తేల్చుకొంటేనే కళాప్రపంచసృష్టిసంగతి తేలుతుంది. అనుకరణం రెండువిధాలు: (౧) దివ్యము, (౨) మానవము. ఈశ్వరసృష్టి దివ్యము. మానవుడు చేసే సృష్టి మానవం. దివ్యసృష్టి భౌతికవస్తువులను అపేక్షించదు. మానవసృష్టి అలా కాదు. భౌతికవస్తువుల సహాయసంయోగంతో జరుగుతుంది. దివ్యమూ మానవమూ అయిన సృష్టి తిరిగి రెండు విధాలు. (౧) యథార్థం, (౨) అయథార్థం. ప్రకృతిసిద్ధవస్తువులు, భూ సముద్రాదులు, తరు లతాదులు, పశు పక్ష్యాదులు యథార్థదివ్యసృష్టిలోనివి. స్వప్నాలు, వెలుగువల్ల ఏర్పడే నీడలు, మణిదర్పణాదులందు గోచరించే ప్రతిబింబాలు అయథార్థదివ్యసృష్టిలోనివి. గృహారామాదికములు యథార్థమానవసృష్టిలోనివి. సంగీత సాహిత్యాదికసృష్టి అయథార్థమానవసృష్టిలోనిది.

అయథార్థమానవసృష్టి తిరిగి సదృశము, అసదృశము అని రెండువిధాలు. ఈ సదృశసృష్టిలోని ప్రతిబింబాలు బింబం ఏనిష్పత్తిలో, ఏరంగులో, ఎలా ఉంటుందో అలాగే ఉంటాయి. అసదృశసృష్టిలో అలా కాదు. ఉదాహరణకు శిల్పి చెక్కే బృహద్విగ్రహమే తీసికొందాము. ఈ విగ్రహము అవయవాలు ప్రకృతిసిద్ధంగా ఉండే పరిమాణంలో ఉండవు. అలా ఉండకపోగా ప్రకృతిసిద్ధమూర్తి అవయవాలు ఏ నిష్పత్తిలో ఉంటాయో ఆ నిష్పత్తిలోనైనా ఉండవు. విగ్రహంక్రింద నిలిచి తల పైకెత్తి చూస్తే ప్రకృతిసిద్ధనిష్పత్తి కనిపించేటట్లుగా అవయవపరిమాణం ఉంటుంది. అంటే విగ్రహాగ్రభాగం ప్రకృతిలో ఉన్న నిష్పత్తికంటె అధికంగా ఉంటుంది. ఇది అసదృశం. ఈ అసదృశం ఉపకరణోత్పన్నమనీ, ఆత్మోత్పన్నమనీ రెండురకాలు. తూలికాకాళికాదిసోత్పన్నాలైన చిత్రరాగసంచారాదికములు మొదటి దానిక్రిందికి వస్తవి. (౨) తన్నుతానే ఉపకరణంగా వాడుకొని చేసే సృష్టి నాట్యం (*mimicry*). ఈ నాట్యం రెండువిధాలు: ౧. తెలిసి చేసేది, ౨. తెలియకుండా చేసేది. న్యాయధర్మాదుల యథార్థరూపం తెలియనివాళ్లు తమ వాక్కార్యాలద్వారా తాము అనుకొనే న్యాయధర్మాదికముల ఆభాసను ప్రదర్శిస్తారు. ఇలా తమకున్న లక్ష్యాన్ని ప్రదర్శించటంలో కొందరు సఫలు లౌతారు. ఇలా తెలియకుండా చేసే నాట్యానికి ప్రత్యేకమైన పేరు లేదు. కాబట్టి ప్రస్తుతానికి దీనిని వంచకము (*Counterfeiting*) అందాము. ఇలాంటి వంచన చేసేవానికి తనకు యాథార్థ్యం తెలుసునన్న నమ్మకం ఉండవచ్చును. కాని నిజానికి అతనికి తెలియదు. మరొకరకమైన వారికి తమకు తెలియునని నటిస్తున్నది నిజంగా తమకు తెలియదన్న అనుమానం ఉండవచ్చును. ఇలా తెలియదని తెలిసి కూడా చేసేవారు *Imposters*.

మొత్తంమీద అనుకరణం ఇన్నిపోకలు పోతున్నది. ఇలాంటి అనుకరణంవల్ల ఏర్పడుతున్న కళాప్రపంచసృష్టిలో వినియోగానికి వచ్చేది ఏమీ లేదు. ఈ సృష్టిలో అనేకవిషయాలు ప్రసక్తాలవుతాయి. పురాదికవర్ణనలు, వైద్యం, సత్పరిపాలనం, జీవితపరమార్థం మొదలైనవి వర్ణితము లౌతాయి. అవి పురాదుల నిర్మాణానికి, రోగచికిత్సకు, జీవితలక్ష్యనిష్కర్షకు తోడ్పడవు. అసలు అది ఉపదేశకం కాదు.

కాబట్టి కవి చిత్రకారాదికళాస్రష్టలంతా వృక్షాదిక ప్రతిబింబాలను అనుకరించేవారే కాని సత్యం చెప్పలేరు. చిత్రకారుడు వర్ణాలతో ఆయా ప్రతిబింబాలను అనుకరిస్తున్నట్లే కవి తన పదాలతో వాటిని అనుకరిస్తున్నాడు. అనుకరించటానికి అవసరమైనంత జ్ఞానమాత్రమే అతనికి ఉంటున్నది. ఆ లయ (*Melody*), ఛందస్సు, నాదము, పదగతుల చిత్రి తీసి వేసి వచనంలాగా చేస్తే అసలు కావ్య మేమిటో బోధపడుతుంది. కవుల కథల బండారం బయటపడుతుంది. ముఖం సహజంగా అందంగా లేకపోయినా యౌవనోదయంతో వికాసం పొందుతున్నట్లుగానే ఛందోలంకారాదికనిగనిగలతో కవిత వికాసం కలిగిఉంటున్నది. యౌవనవిగమనంలో ముఖం ముడతలుపడి వికారం పొందుతున్నట్లే ఛందోలంకారాదులను తీసి వేసి [illegible] ప్రదానం చేసిన కవిత వికారంగా ఉంటుంది.

పైగా అనుకారానికి యథార్థస్థితి తెలియదు. ఆభాసాలుమాత్రమే అతనికి తెలుసు.

ప్రతిదాని ఉత్తమత్వం, రామణీయకం, సత్యం అనేది సృష్టికర్త ఉద్దేశించిన ప్రయోజనంమీద ఆధారపడిఉంటుంది. ఉదాహరణకు వీణను తీసి కొందాము. వీణయొక్క మంచిచెడ్డలు వైణికునికే తెలుసు. ఏ వీణ బాగున్నదో, ఏది బాగుగలేదో, ఎలా చేస్తే బాగుంటుందో అతడు వీణ చేసేవానికి చెబుతాడు. అతడు వైణికుని సలహా ననుసరించి వీణ తయారుచేస్తాడు.

వైణికుడు వీణమంచిచెడ్డలను చెప్పగలిగినట్లుగా కవి చిత్రకారాదులు ప్రయోజనాన్నిబట్టి తమ కృతులు సరిగా, అంటే రమణీయంగా ఉన్నవో లేవో చెప్పగలరా ? తాము ఏమి ప్రాయాలలో దేశికునివద్ద ఉపదేశం పొందితే వారికి సరియైన అభిప్రాయం ఏర్పడుతుందా ? లేదు. తమ కృతుల బాగోగులు వారికి తెలియవు. వారికి సరియైన అభిప్రాయమూ ఉండదు.

బాగోగులు దేనివల్ల ఏర్పడుతున్నవో తెలియకుండానే చిత్రకారాదులు అనుకరిస్తున్నారు. దీనినిబట్టి అజ్ఞానంలో మునిగితేలే ప్రజాసామాన్యానికి మంచిదానివలె కనిపించేదానినే వా రనుకరిస్తున్నా రనుకోవాలి. "ఈ అనుకరణం ఒకవిధమైన క్రీడ, లేక ఆట."

ఈఅనుకరణం మనలోని అభిప్రాయానికి విషయమౌతున్నదేకాని, వివేకానికి మాత్రం కాదు. అనుకృతి నిజంగా అనుకృతిగా ఉంటే అది వివేకానికి విషయం కాదు. బుద్ధికీ విషయం కాదు. అభిప్రాయానికిమాత్రమే. అంతే కాదు. ఈ అనుకృతి వీక్షణ శ్రవణములకుమాత్రమే విషయమౌతున్నది.1 ఈ అనుకృతికి యథార్థం, లేక శివంకరమైన లక్ష్యం లేదు.

కళ అవివేకవతి.2 ఈ అవివేకమే అనుకృతికి అనంతమైన వైవిధ్యం ప్రసరిస్తున్నది. వివేకవంతము, ప్రశాంతము, ఉత్తమమైన వృత్తము ఎప్పుడూ ఒకటిగా సమంగా ఉంటుంది. ఇలాంటిది అనుకరణకుదుష్కరం. ఒకవేళ అనుకృతమైనా ఆస్వాదించటం కష్టం. అందులో నానావిధమనస్తత్వం కలిగిన జనసందోహం నాటకశాలలలో సమావేశమైనప్పుడు మరీ కష్టం.

కవిస్వభావంకాని, అతని కళకాని, ఆత్మలోని వివేకాన్ని దుష్టం చేయటానికి ఉద్దిష్టం కాదు. అతడు ప్రజాసామాన్యం మెప్పుకోసం ప్రాకులాడుతాడు. అందువల్ల తేలికగా అనుకరించటానికి వీలైన ఆవేశాలను అనుకరించటానికి ఇష్టపడతాడు. ఇలాగే చిత్రకారుడు. వీరు మానవునిలోని మనోమాలిన్యాలను రెచ్చగొట్టి వివేకానికి భంగం కలిగిస్తారు. కవి తన రచన ద్వారా మనలోని శోకాన్ని ఎంతగా పొంగించగలిగితే అంతగా సంతోషిస్తున్నాము. నిజానికి మన కొక కష్టం వచ్చి దుఃఖం కలుగుతున్నప్పుడు దానిని ఎంత అణచివేసికోగలిగితే అంత గర్వపడతాము.

---

1. *This imitation is confined to the sight and to the hearing relating in fact to what we term Poetry.*

2. ***Art is irrational.***

ఇలా శోకం దిగమింగటానికి బదులుగా పైకి వెళ్లబోసి కొంటూ దానికి సంతోషించటం హేయంకాదా ?

కష్టాలు వచ్చినప్పుడు బావురుమని ఏడ్చి శోకవిముక్తి పొందాలన్న స్వాభావికవాంఛ మనలో ఉంటుంది. అయితే ఇది వివేకానికి కట్టుబడి అణగిఉంటుంది. ఈ వాంఛే కవులవల్ల తుష్టిప్రాప్త మౌతుంది. ఈ వాంఛ వివేకంవల్ల సముచితశిక్షణ పొందకపోవటంవల్ల కాని, కలుగుతున్న దుఃఖం మరొకనిదికదా అన్న సానుభూతి వల్ల కాని పొంగిపొర్లటానికి అవకాశ మేర్పడుతుంది. ఇతరుడు వచ్చి తన మంచితనం, తనకు వచ్చిన కష్టాలు చెప్పుకొన్నప్పుడు అతనిని ప్రశంసిస్తూ జాలిపడటంలో అవమానకరమైనది ఏమీ లేదని సామాజికుడు అపోహ పడుతున్నాడు. ఈ సుఖం ఒకలాభమని కొంటున్నాడు. పైముఖ్యం అవలంబించి ఈ సుఖాన్ని కావ్యాన్ని ఎందుకు కోల్పోవాలి అనుకొంటు న్నాడు. ఇతరుల అనర్థకాలవల్ల కొంత అనర్థం తనకు కూడా సంక్రమిస్తున్నదన్న పరామర్శం కొలది మందికికూడా కలగటం లేదు.

ఇదే హాస్యానికికూడా అన్వయిస్తుంది. కొన్ని చతురోక్తులు నీకు నీవు విసరటానికి సిగ్గుపడతావు. అయినా వాటినే రంగభూమిమీదంచో, మరొకరినోటి నుంచో విన్నప్పుడు వినోదిస్తావు. వాటి అసభ్యతకు అసహ్యించుకోవు. ఇదంతా సానుభూతి ఉన్నప్పుడే జరుగుతుంది. మానవుని తత్త్వంలోనే యీ హాస్యం వాసనామాత్రంగా వుంది. అయితే ఇతరులు విదూషకుడంటారని భయంతో నవ్వం. ఈవిధంగా వాసన వివేకానికి లొంగి లోలోనే ఉండిపోతుంది. ఈ వాసన నాటకాలలో విహారం పొంది నీకు తెలియకుండానే విదూషకుడవై పోతున్నావు.*

ఇట్లాగే [illegible] రతి క్రోధాదులు మానవుని ప్రతివ్యాపారంలోను అవినాభావసంబంధం కలిగిఉంటున్నాయి. కవిత్వం, [illegible] ఈ ఆవేశాలను, మనోవాంఛలను అణచివేయటానికి బదులుగా నీరుపోసి పెంపొందిస్తుంది. వీటిని అదుపుఆజ్ఞలలో ఉంచక స్వైరవిహారం చేయనిస్తుంది. మానవజాతి అభ్యుదయం పొందాలంటే, ఈ ఆవేశాలను కంట్రోలుచేయాలి. కాబట్టి దేవతాస్తోత్రాలు ఉత్తమపురుషుల ప్రశంసలు తప్ప మరేరకమైన కవిత్వాన్ని రాజ్యంలోనికి అడుగుపెట్టనీయకూడదు. అడుగుపెట్టనిస్తే, రాజ్యంలో పెత్తనంచేసేవి సుఖదుఃఖాలే కాని నీతినియమాలు, వివేకం కావు.

కాబట్టి కవిత్వం సత్యసాధకంగా పరిగణించటానికి వీలు లేదు. ఆత్మసిద్ధి పొందగోరేవాడు దాని ఊబిలకు లొంగిపోరాదు.

(సశేషము)

* *Having stimulated the risible faculty at the theatre, you are betraying unconsciously to yourself into playing the comic part at home.*

***Republic*, *Chapt*. 10.**



# వర్షారాధిక

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

చవులూరన్ నవనీలనీరదవిభాసంపత్తి; శంపాలతాం
గివిలాసంబులు చూడ ముచ్చటగు; పంకేజాతజీవాతువౌ
రవి ఏచాయల గానరాడు - మన మారాటమ్ము తీరయ్యె! మా
ధవుజాడల్ తెలియంగ నో చెలియ! లేదా ఏ యుపాయం బికన్?

పవలను రేలునుం గలతబారెడు డెందము; చందమామ రా
నివిధము నేవిధిన్ దలతునే! తన మోమును జూడ జూడ లే
యవి యగుపించు - ఇంచువిలునంచలముల్ గనిపించు - మంచిదా
నివి - హరివిల్లునందు; నవనీరదవారము ఘోరమయ్యెడున్!

తలపులు పూలుబూచె వినుదారుల మబ్బులజూచి, చూచుక
మ్ముల గిలిగింతల స్మనసుపోయెను; ముమ్మను వానచిన్కులన్
వలిగొను తెమ్మెరల్ మెఱయు వైఖరి పోకిరిదాంగ పొంగుల్లన్
గులికెడు; చిత్తమెల్ల గలగున్ మలగున్ చెలి! భావసంపదల్.

నేనా - మా నవనీతచోరు నవవాసీరావనీయామునీ
యానూపాగ్రవనీనిలోలపదవీవ్యామోహముం జూడగా
నేనా - తానె సనాతనం బగునటుల్ వ్యాయామముం జేయు; నిం
కైనా మారదు వానదుర్మదము కొమ్మా! క్రమ్మెడుం గ్రమ్మరన్.

చినుకులు తోనతోన వడి జెల్లెడు వెల్లువ పెల్లు పైని వ్రా
లినవి; కిశోరు నంగుళుల లీలలు దోలెడు వీణగాన మే
మని సవరించెనో మురళి యాలపనమ్మును మాని - ఏదియై
నను మన మేల పొంగెడినొ! నాథుని భావధునీవిశేషమే!!

చిక్కని నల్లమబ్బుల రుచించెడు నీదు తనూవిలాసమే
ఎక్కుడు నాదు డెందమున కీమెయి కౌగిలి చల్లతెమ్మెరల్
దిక్కున; కాని కొంకు మది దీరద - నీరదనీల! మబ్బు ఆ
మెక్కిన శంప కొంపరగిలించెడు నీ చెడు గేడదో కదే!

# ఎదురుగుమ్మాలు

[కథానిక]

●

శ్రీ పిలకా గణపతిశాస్త్రి

ప్రాతఃకాలంనీరెండ ఆ భవంతిముందు వేళ్లాడగట్టిన కొత్త వరివెన్నుల గుత్తులమీద పడి, క్రమంగా పసిరిపచ్చికమీద పాకిపోతూంది. ఆ నీరెండలో వరివెన్నులకోసం వచ్చే పిచ్చుకలుతళతళా మెరిసిపోతూ, వెన్నులతో తిరిగి పోతున్నాయి. రంగు రంగుల సీతాకోకచిలుకలు పచ్చికమీదనించి బంతి పూలమీదా, ఎర్రగోరింటలమీదా పవాళ్లు ప్రారంభించాయి. ఇరుగుపొరుగు చిన్నపిల్లలంతా ఆ భవంతిగుమ్మం ముందు ఆడుకుంటున్నారు.

పదిపన్నెండేళ్ల పిల్లలు చెమ్మచెక్క ఆడుతున్నారు. మరీ చిన్నపిల్లలు లక్కపిడతలతో బువ్వాలాట లాడుతున్నారు. ఆ వేళ అక్కడ అంతమంది చిన్నపిల్లలు చేరడానికి కారణం లేకపోలేదు. ఆ సంవత్సరం ఆయింట్లో బొమ్మలుపెట్టారు. బొమ్మల పూజ కనివచ్చిన ముత్తైదువలతో పిల్లలు కూడా వెంటపడి అక్కడ చేరుకున్నారు.

క్రమంగా ముత్తైదువలు కొంతమంది బొమ్మలకు పెంద్రాళే నైవేద్యాలు పెట్టి తీయని సన్నకంఠాలతో మంగళహారతులు పాడుతున్నారు. కొంతమంది వెళవెళలాడే చీరలతోను, గలగలలాడే నగలతోను ఒయ్యారంగా నడుస్తూ, పిల్లల్ని వెంటబెట్టుకుని నైవేద్యాల పళ్లాలతో తిరిగిపోతున్నారు.

క్రమంగా నీరెండ బంతిపూలరంగుల్లో కలిసిపోతూంది. కలకల నవ్వే పరిహాసకంఠాలలో ఒక ముగ్ధబాలిక 'చేమంతి పువ్వంటి చెల్లెలినియ్యావే, బంతిపువ్వంటి బావ నియ్యావే, మొగలిపువ్వంటి మొగుణ్ణియ్యావే!' అని కులాసాగా పాడుతూ తిరుగుతూంది.

మిగిలిన పిల్లలు ఆమెతో తిరుగుతూ, ఆఖరి చరణం కలిసి పాడేటప్పుడు చిరుసిగ్గులతో తలలు వంచుకుని మెల్లిగా మెల్లిగా గిరగిరా తిరుగుతున్నారు. వారి కంఠాలలోనించి వెలువడే ఆ పాటసవ్వడి ఆ పరిసరం అంతా ఒక చిత్రమైన కలగా మార్చేసింది.

ఇంతలో అక్కడ ఆడుకునే పిల్లల్లో ఒక పసి గొంతుబారుమని ఏడ్చింది. దాంతో ఆ చుట్టూ పాటలూ, పరిహాసాలూ క్రమంగా తగ్గుతూ ఆగిపోయాయి.

నగల భారంతో నడవలేక తూలుతూన్న ఒక ముత్తైదువు లోపలినించి తటాలున అక్కడికి వచ్చి 'ఎవరే ఆ ఏడుపూ ?' అంది. 'అమ్మగారండీ, మరేమోనండీ— మాట్టరుగారమ్మాయి— మనబాబాయిగార్ని గిల్లేసుందండీ' అంది, ఆ పిల్లాణ్ణి ఆడించే తూర్పుపిల్ల. తల్లి కంగారుపడుతూ 'మాశావా అమ్మా, పిల్లాడి బుగ్గ ఎల్లా చీరుకుపోయిందో. అయ్యో, అయ్యో, పిల్లాడు గుక్క తిప్పుగో లేకపోతున్నాడే, ఎంత పని జరిగిందే ఈ వేళ. ఏమే! అమ్మణ్ణీ! ఇలా గేనా పిల్లాణ్ణి రక్తాలొచ్చేట్లు గిల్లెయ్యడం.' అని గదమాయించింది.

అంతవరకూ బిక్కమొహంతో తెల్లబోయి చూస్తూన్న అమ్మణ్ణి 'నేను కాదు...వాళ్ల చిట్టి...' అని పెద్దగా భయపడుతూ చెప్పింది. ఇంకా ఏదో చెప్పబోయి, ఆమాట పూర్తిచెయ్యకుండానే గోలు గోలున ఏడవడం మొదలుపెట్టింది.

ఆచిట్టి ఎంత చూచినా ఆ పరిసరాల్లో ఎక్కడా కనబడలేదు. ఏమయిందో మరి. ఆపిల్లవాడి బుగ్గమీద మాత్రం గోరుదిగినంత మేరా రక్తపుజీర కనబడుతూంది. వాడు తల్లిని చూచి మరీ గట్టిగా ఏడవడం మొదలు పెట్టాడు.

# మీ ఆరోగ్యానికి సేవించండి

బోర్న్ వీటా పాలపానీయాల కంటె ఎంతో ఉత్తమమైనది. శక్తిని కలిగించే విటమినులు మరియు క్యాలిషియం కల్గి ఉంటుంది. ఆటగాళ్లకు, దుర్బలులకు కూడా ఆదర్శమైనది. దాని చాకొలేట్ రుచిని పసిబిడ్డలు కోరతారు. ఒక కప్పుడో, గ్లాసుడో వేడి లేక చల్లని పాలలో రెండు టీస్పూనులు పొద్దున్నా సాయంకాలమూ తీసికొనండి.




CFV-2 T6




ఆరోగ్యవృక్షం
క్రొత్త తగ్గింపు ధరను
కూర్చి అడగండి




కాడ్బరీస్

## బోర్న్ - వీటా

క్యాల్షియం మరియు ఎ, డి విటమినులతో నిండి ఉన్నది.

కాడ్బరీ - ఫ్రై (ఇండియా) లిమిటెడ్

P. B. 1417, బొంబాయి - P. B. 251, కలకత్తా - P. B. 1725, మదరాసు

# కుష్టు ★ బొల్లి

అన్ని రకముల కుష్టులకు - బొల్లి వ్యాధులకు ఇతర చర్మవ్యాధులకు గ్యారంటీగా పనిచేయుచున్నవి-

**మా ఔషధరాజములే!**

కేటలాగులు - యోగ్యతాపత్రములు ఉచితము

## రెడ్డి & కో., (రిజిస్టర్డ్)

**H. O. గోపాలపురం.**

(వయా) తణుకు - తా॥ గోదావరిజిల్లా.

---

బ్రాంచిఆఫీసులు:—

(1) నెల్లూరు - కాపువీధి (2) విజయవాడ - గాంధీనగరం (3) సికింద్రాబాద్ - 3560 కింగ్స్‌వే (4) వాల్తేరు - R. S. (5) బరంపురం - దేశిబెహరావీధి (6) కటక్-బక్సిబజార్ (7) ఫజిల్‌నగర్.U.P

## లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




**శ్రేష్ఠమైన మదరాసు నశ్యం**

**R. S. సుగంధ ముక్కుపొడి.**

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

**పి.వి.రాజన్ & కంపెని,**

**అరకోణం, Arkonam, N. A. Dt.**



# ఉబ్బసపు రోగమునకు

## శాస్త్రయుక్తమైన చికిత్స

ఉబ్బసపురోగము చిటికలతోనూ మంత్రములతోనూ తదితర విధములైన ఔషధములతోనూ అప్పటికప్పుడు తగ్గినట్లు కనిపించినా ఈ మందులవలన అది దీర్ఘరోగముగా మారుట తప్ప ఏమియు లాభము లేదు.

**పురోహిత శ్వాసహరి** అనేక సంవత్సరములుగా వైద్య శాస్త్రమునకు తెలిసినదే ఉబ్బసమునకు సరియైన శాస్త్రయుక్తమైన మందు యిదే అని అందరికీ తెలిసినదే పక్కాగా జీర్ణం అవుతుంది. క్రమక్రమముగా ఆరోగ్యం చేకూరుతుంది. ఊపిరితిత్తులు బలపడుతవి. ఉబ్బసం శాశ్వతంగ నివారణ మగును. మంచి కెమిస్టు లందరివద్ద 3. డా 6. డా. 12. డా॥ల సీసాలలో రు 3/8. రు 6/- 10/- లకు దొరకును లేదా డాక్టర్ పురోహిత్ ఫార్మసీ కొల్హాపూర్, యస్. యమ్. సి. గారికి వ్రాయుడు.



**పురోహిత శ్వాసహరి**

మద్రాసు స్టాకిస్టులు : అప్పా అండ్ కో., చైనా బజారు (2) జే. బాలాభాయ్ అండ్ కో. 260 చైనా బజారురోడ్డు. (3) దాదా అండ్ కంపెనీ. నైనియప్ప నాయకన్‌వీధి; రాజమండ్రి. ఈశ్వర్‌దాస్ అండ్ కో; బెజవాడ. బెజవాడ మెడికల్ స్టోర్సు; విశాఖపట్నం. వైజాగ్ మెడికల్ స్టోర్సు; సికింద్రాబాద్. పండలిక్ అండ్ కో. సుబ్రిక్‌వీధి; నెల్లూరు. ఏ. ఆర్. గోపాల్ బ్రదర్సు. ట్రంకురోడ్డు; ఒంగోలు. ధన్వంతరి మెడికల్ స్టోర్సు గుంటూరు. మెడికల్ అండ్ ఆప్టికల్ ఎంపోరియం; గుడివాడ. గుడివాడ మెడికల్ స్టోర్సు; ఏలూరు. రావు మెడికల్ స్టోర్సు; కాకినాడ. లక్ష్మీనారాయణ అండ్ కో; మచిలీపట్నం. మెడికల్ స్టోర్సు.

'చూడు, పిల్లాణ్ణి రక్కేసి అమ్మకిత్తిలా ఎల్లా రాగాలు పెడుతూందో. గొంతుకుంటే సరి' అని గద్దించింది పిల్లవాడి తల్లి.

ఇంతలో అమ్మణ్ణితల్లి కనకమ్మ అంగలు వేసుకుంటూ అక్కడికి వచ్చి, రుసరుసలాడుతూ—

'నరసమ్మగారూ, మీ సుబ్బుల్ని మావాళ్ల కాదుటమ్మా గిల్లుతా! వాళ్ల చిట్టెట.' అంది.

నరసమ్మ అందుకుంది—

'అదేమిటమ్మా అలా అంటావు? వాళ్ల చిట్టి ఇక్కడ లేందే. సత్తీ, ఎవరె గిల్లుతా?'

'అమ్మణ్ణిగోరనండి.'

'ఆ, నువ్వు చూశావులే భడవా!' అని రొక్కాయించింది కనకమ్మ.

'నాను సూశానండి, నిజమేనండి, అమ్మగోరు.' అంది సత్తి భయపడుతూ.

కనకమ్మ రొక్కాయింపుతో నరసమ్మకు కోపమూ, ఉడుకుబోతుతనమూ ఒక్కసారిగా కళ్లకొచ్చాయి. ఆమె ఉక్రోషం ఆపలేక సత్తికేసి తిరిగి, 'పిల్లాణ్ణి కనిపెట్టుకుని ఉండవే అంటే, నువ్వేం చేస్తున్నావే' అని చేతికొద్దీ బుగ్గలు మెలిపెట్టింది. 'సూత్తానే ఉన్నానండి, అమ్మగోరూ' అని ఏడుస్తూ సత్తి సమాధానం చెప్పింది. అయితేనేం సత్తివీపుమీద మణుగంత అణుపు పడింది. ఆ అణుపుతో సత్తి ముందుకు తూలిపోవలసిందే. అయినా అది ఎల్లాగో కాళ్లు నిలదొక్కుకుని ఏడుస్తూన్న పిల్లాణ్ణి ఎత్తుకుని తనుకూడా ఏడుస్తూ నిలబడింది.

'అయ్యగారు రానీ నీ పని పట్టిస్తా' అని మళ్లీ బుగ్గలు నులుమ బోయింది నరసమ్మ. సత్తి దిక్కులేని దానిలా బావురుమని ఏడుపు మొదలెట్టింది. నరసమ్మ సత్తిమీదకు వచ్చి 'నోరు మూస్తావా ముయ్యవా.' అని కళ్లెఱ్ఱజేసింది. సత్తి నోరుమూసుకుని లోలోపలే కుమిలిపోయింది. సుబ్బులు ఈ కేకలతో మరింత గట్టిగా బావురుమన్నాడు.

కనకమ్మ మళ్లీ అందుకుని 'అదేమిటమ్మా, అనవసరంగా దాన్ని కొట్టుకుంటారు. వాళ్ల చిట్టి గిల్లేసి పారిపోయిందిలా ఉంది.' అంది. నరసమ్మ దీనితో గుగ్గిలం వేసిన అగ్గిలా అయిపోయి—

'మా పిల్ల నేమీ అనలేదమ్మోయ్ నేను. ఉత్తినే అనవసరంగా మీరు కలగజేసుకోకండి.' అంది కనకమ్మ. 'కలగజేసుకోడానికేముందమ్మా ఇందులోను? మా పిల్ల కాదమ్మా గిల్లింది, వాళ్ల చిట్టి అన్నాను. ఇంతేనా. ఇందులో తప్పేముంది? మీ దల్లా మొహం చెండుకోడానికి!' అంది.

నరసమ్మకి ఆ కోపంలో స్వారకం తప్పిపోయింది. ఆమె కనకమ్మమీదికి మీదికి వెడుతూ 'మీ తప్పేమీ లేదమ్మోయ్. తప్పంతా మాదే. ఈ తంపిలన్నీ పడలేకే నేను మా అత్తగారితో 'ఈ యేడు మన ఇంట్లో ఈ బొమ్మలు పెట్టించవద్దండి మహారాజా' అని వెయ్యివిధాల పోరాను. నా మాట చెవినిపెట్టిందా ఆవిడ? అసలు ఒకప్పుడు చెవి పెట్టిందా ఏమిటి? ఎప్పుడూ నా బతుకిల్లాగే వెళ్లింది' అని ఇంకా ఏవేవో సణుగుకుంది.

దానిమీద కనకమ్మ 'మీ కంత కష్టమెందుకమ్మా. ఈసారితో బాగా బుద్ధి వచ్చింది. ఇంక మీ యింట్లో అడుగుపెట్టం లెండి' అని గిరుక్కున వెనక్కి తిరిగింది. కాని అమ్మణ్ణి అక్కడ కనబడలేదు. ఆమె కూతుర్ని పిలుస్తూ 'ఓఅమ్మణ్ణోయ్. ఎక్కడ అఘోరించావే? నీతో పడలేకుండా ఉన్నానే మావమ్మా... నేను ఎక్కడికి వడితే అక్కడికి నాతో దిగబడిపోవాలిగదా...అబ్బబ్బా! నే నీ పిల్లలతో పడలేకుండా ఉన్నానమ్మా...అయినా ఒక్క నిమిషం పిల్లల్ని చూడండి అంటే తమర్ని కానట్టు మాట్లాడకూరుకుంటారు. కాస్త శనివారాదివారాలు వచ్చాయంటే పొద్దస్తమానం పేకాటతో సరి. ఎన్నేళ్లు వస్తేయేం? మనుషులకి కాస్త జ్ఞానముంటూ ఉండాలి గాని' అని తనకి అలవాటయిన ధోరణిలో పడింది.

ఇంతలో పొరుగింటి పెద్దముత్తైదువ ఒకావిడ అక్కడికి వచ్చి 'ఊరుకోండమ్మా ఊరుకోండి. ఇంతకీ ఏముందని ఈ తగాదా? పిల్లలూ పిల్లలూ ఆడుకుంటే

టప్పుడు కొట్టుకోనూ కొట్టుకుంటారు, తిట్టుకోనూ తిట్టుకుంటారు. ఇంతమాత్రానికే ఇదయిపోతే ఎలాగ! మీరేమయినా పరాయివాళ్లా ఏమన్నానా. కొద్దో గొప్పో కావలసినవాళ్లే ఆయిరి. అదీగాక తెల్లారిలేస్తే ఎదురుగుమ్మాలు. వారింటికి వీరూ రావాలి, వీరింటికి వారూ వెళ్లాలి. తప్పమ్మా. నోములు మానుకోకండి' అంది.

ఈ హడావిడి అంతా అంచీలమీద లోలోపలి తులసికోటదగ్గర పూజచేసుకుంటూన్న నరసమ్మఅత్తగారికి తెలిసిపోయింది. ఇంటికంతా ఆమే పెత్తనదారిణి ఆయిరి. ఆమె ఊరుకుంటుందా? జారిపోతూన్న బట్ట చెవులమీదికి సవిరించుకుంటూ గబగబా అక్కడికివచ్చి కనకమ్మని బతిమాలుకుంటూ—

'ఏమిటోనమ్మా, మా కోడలు అనే మాటలకి లెక్కేమిటి! నువ్వేమీ అనుకోకమ్మా. కోపం వస్తే ఆపలదినన్నే తీసేస్తుంది. దాని ఘోరణే అంత. ఇంతకీ—ఇంటికి పెద్దదాన్ని నేనా? అదా? తెలిసీ తెలియనిదాని మాటలు పట్టుకుని తప్పట్టుకుంటే ఎలాగ...ఏడాదీ గంటేళ్లూ కాదమ్మా ఇది, తొమ్మిదేళ్ల నోము. కనిపెంచిదానవు. ఇల్లాగ మధ్యన మానేస్తే ఎప్పటికి ఉద్యాపనకాను. నా మాట వినమ్మా. మీ అమ్మ ఓకే నోటికాదు. నోము మానుకోకమ్మా. కాస్త ఈ వేళకు ఎల్లాగో అల్లాగ కాలక్షేపం చేసుకో అమ్మా! నైవేద్యం పెట్టిపో. ఈ కాస్సేపూ కళ్లు మూసుకుంటే సాయంత్రం వాల్లాడింపే ఆయిరి' అంది.

దానిమీద కనకమ్మ కొంచెం శాంతించింది. కాని లోలోపలి ఉక్రోషం అంతా వెళ్లబోస్తూ— 'వర్ధనమ్మత్తా, అసలు సంగతంతా విని, నావల్ల తప్పుంటే నన్నేమన్నా అను, పడతాను. ఇంతకీ మా పిల్ల కాదమ్మా కొట్టింది, వాళ్ల పిల్లమ్మా అన్నాను. అంతేనా అంతకంటే ఏమన్నా అన్నానా. అంత మాత్రానికే ఇంత రంధి చెయ్యాలా? భాగ్యభోగ్యాలుంటే చెయ్యి ములగా జారుకుంటారు. ఒకళ్లకి పెట్టేదీ పోసేదీ ఏముంది? మేమేమీ గతిలేక ఇక్కడికి రాలేదుగదా. మాకు భగవంతుడిచ్చినదానితో—కలో గంజో తాగి బతుకుతాము. అంతేగాని చచ్చిపోం గదా' అంది.

వర్ధనమ్మ—'తప్పు తప్పమ్మా. శుభమల్లే పండుగ రోజుల్లో అవేం మాటలు! నాకు తెలియక అడుగుతాను గాని, ఇందులో మేము మీకు పెట్టేదీ పోసేదీ ఏముందే! నలుగురూ నాలుగు బొమ్మలు తెచ్చుకుని ఒకచోట పెట్టుకున్నారు. వాళ్లవాళ్ల పూజలూ పునస్కారాలూ వాళ్లు చేసుకున్నారు. అంతేనా! కాస్త ఇంటికి దగ్గరగా ఉందిగదా అని ఈయేడు బొమ్మలు ఇక్కడే పెట్టుకున్నావు. ఇదేమన్నా మాయింట్లో పెళ్లిళ్లే వ్రదానా. నామాటలు విని ఈకాస్సేపూ ఎల్లాగో అల్లాగ కాలక్షేపం చేసుకో అమ్మా!' అంది.

దానికి కనకమ్మ ఏమీ సమాధానం చెప్పలేదు. కాని పేరంటాళ్లలోంచి నరసమ్మ కళ్లమ్మట నీళ్లతో అత్తగారికి ఎదురుగుండా వచ్చి నిలబడి, 'అసలు ఈ గంధి అంతా నన్ను యాగీచెయ్యడంకోసమే వచ్చింది. నేను మిమ్మల్ని ఎప్పుడైనా పల్లెత్తుమాటన్నానా? నన్నెందుకిల్లాగ నలుగురినోళ్లలోనూ పడేస్తారు' అని బుడిబుడిదీర్ఘాలు తియ్యడం మొదలుపెట్టింది.

అత్తగారు కోడలుచెయ్యి పట్టుకుని బలవంతంగా లోపలికి లాక్కుపోతూ, 'చాల్చాలులే నేర్చావు. గుమ్మంలోకి ఇరుగూ పొరుగూ వస్తే ఇలాగేనా మర్యాద చెయ్యడం! నడు నడు. లోపలి కీపాటికి.' అని కూకలేసింది. అత్తాకోడళ్లిద్దరూ అక్కడినించి వెళ్లిపోవడంతో ఆ గాలిదుమారం ఆసమయానికి శాంతించింది. ఇరుగూపొరుగూ ఎవరికితోచినవి వారు అనుకుంటూ తమతమ ఇళ్లకి వెళ్లిపోయారు.

ఆతరవాత ఆ తల్లులిద్దరిమధ్యా ఉండే ఎడం ఎక్కువైనది గాని తగ్గలేదు. కనకమ్మ ఇక నరసమ్మగారి గుమ్మం తొక్కనని పట్టుపట్టుకుని కూర్చుంది. కాని నరసమ్మఅత్తగారు వచ్చి కాదుకూడదని బతిమాలడంవల్లా, తన అత్తగారిచేత చెప్పించడంవల్లా విధిలేక సాయంత్రం వాల్లాడింపుకి వెళ్లడానికి అంగీకరించింది. అందుచేత అంటీఅంటనట్టు బొమ్మలకు పూజచేసి నైవేద్యంపెట్టి వెళ్లిపోయింది. అమ్మణ్ణి కూడా మళ్లీ వెంటబడింది కాని రానివ్వలేదు.

సాయంత్రం అయేసరికి బొమ్మల వాల్లాడింపులోకని అంతా తయారయ్యారు. అమ్మణ్ణి కొత్త పరికిణీ, కొత్త చొక్కా తొడుక్కుని వాల్లాడింపుకి వస్తానని ఏడ్చింది. తల్లి మొదట ససేమిరా వల్లకాదంటే వల్లకాదంది. కాని వాల్లాడింపంటే పిల్లలందరికీ పెద్ద సరదా. వాళ్లు మానమంటే మానతారు కనకనా. చివరికి అత్తగారి బలవంతంవల్ల అమ్మణ్ణిని తీసుకువెళ్లడం తప్పలేదు. తల్లి అమ్మణ్ణితో 'ఈసారి వాళ్ల కుబ్బలలో ఆడి చూడు నిశ్నం చేస్తానో' అని బెదిరించింది. అమ్మణ్ణి

ఉలక్కుండా పలక్కుండా తల్లివెనకాలే వాళ్లాడింపులోకి వెళ్లింది.

బాజాభజంత్రీలతో బొమ్మల ఊరేగింపు బయలుదేరింది. పేరంటాళ్లంతా ఒకళ్లొకళ్లమీద బుక్కాలు జల్లుకుంటూ పెద్దకాలవ్వయిపు నడిచి పోతున్నారు. సాయంకాలం నీరెండలో బుక్కా రంగు ఎర్రమతాబా వెలుగులా కనబడింది. పిల్లవాణ్ణి ఎత్తుకున్న సత్తీ, నరసమ్మకూడా ఊరేగింపులో ఉన్నారు. నరసమ్మా కనకమ్మా ఒకరొకర్ని చూసుకుని ఎడమొహాలూ, పెడమొహాలూ పెట్టుకుంటూ నడిచి వెళ్లారు.

కనకమ్మ నరసమ్మకేసి కన్నెత్తి చూడలేక పోయింది. అసలా ఊరేగింపులో ఆమెతో కలిసి నడవడమే తనకొక చిన్నతనంలా కనబడింది. అయితే తప్పనిసరి అవడంవల్ల నరసమ్మకి దూరదూరంగా నడిచి వెళ్లింది. ఇప్పుడిక ఏమనుకుంటే ఏం లాభం !

ఉత్సవం పిల్లలతోనూ, పెద్దలతోనూ, మెల్లిగా ఊరికి దగ్గరగా ఉన్న పెద్దకాలవగట్టుకి చేరుకుంది. అప్పుడే సూర్యాస్తమానం కాబోతూఉంది. నిశ్చలంగా ప్రవహిస్తూన్న కాలవలో చిన్నచేపలు ఎగిరి పడ్డప్పుడల్లా సూర్యకిరణాలు తళతళా ప్రతిఫలిస్తున్నాయి. కాలవలో చెట్లనీడల్లో పడవ ఒకటి తెరచాపతో నీళ్లు తాగుతూ తాబేలులా తేలిపోతూంది. పశువులు అవతలి వొడ్డునించి మెల్లిగా ఈదుకుంటూ వస్తున్నాయి. ముత్తయిదువలు పూజచేసిన బొమ్మలు కాలవ నీళ్లల్లో కలుపుతున్నారు. బొమ్మలు కలిసిన నీళ్లల్లో పసుపు కుంకుమలు చిత్రమైన రంగులుగా చెదిరిపోతున్నాయి. దొన్నెల్లో ఉంచిన దీపాలు సంధ్యానక్షత్రాలలా నీళ్లలో తేలిపడుతున్నాయి.

కొందరు ముత్తయిదువలు పోకదొన్నెలతో అక్కడ ఉన్న పిల్లలకీ, పెద్దలకీ ప్రసాదాలు పంచి పెడుతున్నారు. లోలోపల ఉక్రోషాలవల్ల తల్లులిద్దరూ ఒకరికొకరికి ప్రసాదాలు పంచిపెట్టుకోలేదు. ప్రసాదాలు పంచిపెట్టినతరువాత తల్లులు తమ పిల్లల్ని వెంటబెట్టుకుని ఇళ్లకి వెళ్లిపోతున్నారు. కనకమ్మ అమ్మణ్ణికోసం చూసింది. కనబడలేదు. తన కనుకప్పి అప్పుడే ఎక్కడికి వెళ్లిందో అని ఆమె ఆశ్చర్యపోయింది. మళ్లీ ఇంతలోనే అది ఏంతగాదాలు తెస్తుందో అని ఆమెకు కంగారు పుట్టింది.

కాని అమ్మణ్ణీ, సుబ్బులూ, సత్తీ ఒకచోట కూర్చోడం చూస్తే ఆమెకే ఆశ్చర్యం వేసింది. తొందరగా వెళ్లి అమ్మణ్ణిని తీసుకురావాలని చూసిందిగాని, వాళ్ల ధోరణి చూస్తే ఆమెకే ఒక నిమిషం ఉండి ఏం జరుగుతుందో చూద్దామనిపించింది. పిల్లవాడిపక్కనే సత్తి కూర్చొని వాడడిగిన ప్రశ్నలకేవో సమాధానాలు చెబుతూంది. అమ్మణ్ణి ప్రసాదం తినగా ఖాళీఅయిన ఒకటిరెండు పోకదొన్నెలు కాలవనీళ్లల్లో పడవల్లా వదులుతూంది. పిల్లవాడు కళ్లు రెప్పలు వెయ్యకుండా అల్లాగే పోకదొన్నెలకేసి చూస్తున్నాడు. వాడికా పోకదొన్నెలు బామ్మ చెప్పిన కథలలోని రత్నాల ఓడలు ! అవి రంగురంగుల రత్నాలతో సముద్రంమధ్యనున్న రాజకుమార్తెకోసం ప్రయాణమై వెళ్తున్నాయి. అవి ఆ పసిహృదయంలో ఇంకా చిత్రమైన ఆకృతులు ధరిస్తున్నాయి. ఇంతలో నరసమ్మ తన పని ముగించుకుని సత్తితో 'రండ్రా వెడదాము' అంది. సుబ్బులు ఆమాటే వినిపించుకోలేదు. చివరికామె సత్తిచేతుల్లోనించి వాణ్ణి తీసుకోబోతూ 'రా నాయనా వెడదాము' అంది.

'ఉన్నవే నేను లానే.'

'ఏమిరా, ఏమొచ్చిందీ, రా !'

'అమ్మణ్ణక్కా, నేనూ పడవెక్కాలి.' ఈ మాటలు విని నరసమ్మకూడా ఎంతో ఆశ్చర్యపడుతూ 'ఎందుకురా ?' అంది.

'తాతగారింటి కెళ్లాలే'

'ఆఁ ! మరి పడవేదిరా ?'

'అదిగో' అని అప్పుడే బయలుదేరబోతూన్న రెండో పోకదొన్నె చూపించాడు వాడు. ఆమె కళ్లెత్తి ఆ పడవకేసి చూస్తూ 'మీరిద్దరూ ఎక్కితే అది మునిగిపోతుందమ్మా. రా. యింటికెడదాం రా' అంది.

'మునిగిపోతే, నేను రానే' అంటూనే ఆ పిల్లవాడు అక్కా తనూ ప్రయాణం చేదామనుకున్న ఆ ఓడకేసి రెప్పవాల్చకుండా చూశాడు. నరసమ్మ ఇక చీకటి పడుతోందని సత్తిచేతుల్లోంచి పిల్లవాణ్ణి తీసుకుంది. ఆసమయంలో హఠాత్తుగా అమ్మణ్ణికోసం వచ్చిన కనకమ్మ కళ్లూ ఆమెకళ్లూ కలిశాయి. ఆ కళ్లల్లో, అంతరాంతరాలల్లో చిన్ని చిరునవ్వులు మెరిశాయి !

# గాడ్సే జాతకములో 'తమాషాలు'

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

మహాత్మునియొక్కయు, నాథూరాం వినాయక గాడ్సేయొక్కయు జాతకములను చర్చించుచు, గ్రహసహమాదిధర్మములు, దశాఫలపరిపాకము, దైనిక కేంద్రముల శక్తి, పర్వకాలప్రభావము, ఇతరేతరజాతక గ్రహసంయోగము ఇత్యాదివిషయములనుగూర్చి గడచిన 'భారతి' సంచికలలో నేను మనవిచేసిన అభిప్రాయములను కటాక్షించినవారిలో కొందరు మహనీయులు "ఇదంతా తమాషా" అని సెలవిచ్చిరట! ఎగతాళిధోరణిలో చెప్పినను, వారు వాస్తవమునే నిర్వచించినారు. ఈజగత్తు అంతయు 'తమాషా' కాదని ఎవ్వరనగలరు? ప్రపంచపు సృష్టి, స్థితి, లయములు ఆ సృష్టికర్త యొక్క లీలావిభూతి యని తత్త్వశాస్త్రవేత్తలను చున్నారు. అనగా, 'తమాషా' అనుట కాక వేరేమి?

"ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన;
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః;
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి;
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్."

అను భగవద్గీతావాక్యములో ఇట్టి అర్థమే ఇమిడియుండలేదా? ఈ సృష్టిధర్మపు 'తమాషా'లలో గ్రహసంచారపద్ధతి సయితి యొక్కటి. వానినిగూర్చి నదే ఈ 'జ్యోతిషశాస్త్రము.

కాని, శాస్త్రదృష్టి గల విద్యావంతులకు దీనిలో హృదయాహ్లాద మున్నది. సృష్టిధర్మములపై విశ్వాసముగలవారికి దీనివలన లౌకికప్రయోజన మున్నది. ఆస్తికధర్మముపై అభిమానము గలవారికి దీనినుండి కర్తవ్యవిషయమున ఉపదేశము లభించగలదు. ప్రారబ్ధమును నమ్మునట్టి కర్మవాదులకు దీని మూలమున మనశ్శాంతి చేకూరును. ఇట్లెన్నియో చెప్పవచ్చును. కాని, 'జ్యోతిషాలయము'లకు ఒకటో, రెండో రూపాయలు ముడుపు సమర్పించుకొని జాతకఫలములను తప్పాలుద్వారా తెప్పించుకొనుటచే తృప్తిపడగోరు యథాలాభసంతుష్టుల పాలికిమాత్రము ఇట్టి చర్చలు వాస్తవముగా 'తమాషా'లే. అనాగరకులలో కాక, ఆధునికవిద్యావంతులలోనే ఇట్టివా రనేకు లుండుట నేటికాలపు లక్షణము.

పోనిత్తము. గాడ్సేజాతకమునకు సంబంధించిన మరికొన్ని 'తమాషా' లను పరిశీలింతముగాక!

తాజక (అనగా, యవన) మతములో 'వర్ష జాతకము' అనబడు దశాసంప్రదాయ మొకటి కలదు. పాశ్చాత్యులు ఈపద్ధతిని "రవిపునరాగమనము" (*Solar Return*) అని వ్యవహరించెదరు. జన్మకాలమునందు రవి ఏరాశిలో, ఏభాగలో, ఏ కలలో, ఏ వికలలో నుండెనో, అదే స్థానమునకు నికరముగా ఏయేట, ఏ దినమున, ఎంతకాలమునకు రవి వచ్చునో, అది కనిపెట్టి, ఆ క్షణమునకు స్పష్టగ్రహభావాదులను గుణించినచో, అది వర్షజాతక మనబడును. భూమియొక్క పరిభ్రమణారంభక్షణములో సూర్యకుటుంబమునకు మధ్యవర్తి యగు రవితో ఇతరగ్రహాదులకు రాగల నూతనసంబంధముల ననుసరించి ఆ సంవత్సరమున జాతకులకు శుభాశుభఫలములు అనుభవమునకు వచ్చునను టే ఈపద్ధతికి మూలసూత్రము. యవనులు తమ భాషలో వ్రాసియుంచిన గ్రంథములనుండి మన దేశపు ప్రాచీనపండితులు ఈసంప్రదాయము నభ్యసించి, అనుభవమునకు తెచ్చుకొని దానినిగూర్చి సంస్కృతభాషలో అనేక గ్రంథములను వ్రాసియున్నారు. వానికి ఆంధ్ర దేశములో తగిన వ్యాప్తి రాకుండుట విచారహేతువు.

దేవమానదశలో, ౧౯౪౮వ సంవత్సరమునకు, గాడ్సేజాతకమున ప్రారబ్ధ మెంత దోషభూయిష్ఠముగా

మండెనో, గతవ్యాసములలో కొంత విపులముగనే పరిశీలించితిమి. అదే సంవత్సరమునకు 'వర్ష జాతకము' ఏమి సాక్ష్య మిచ్చుచున్నదో, పరికించుటకు చదువరులు కుతూహలపడకపోరు. జన్మకాలమునకు స్పష్టపరచినచో, రవి వృషభరాశిలో ౨౭ భాగలు, ౧౭ కలలు, ౧౮ వికలలలో నుండగలడు. జాతకుని ౩౮ వ సంవత్సరారంభమున—అనగా, ౧౯౪౭ వ సంవత్సరమున, మే నెల, ౧౯ వ తేదీనాడు—స్వస్థానమునకు రవి వచ్చుకాలము ఉదయము ౭ గంటలు, ౮ నిమిషములు, ౫౯ సెకండ్లు A. M. (L. M. T) అగును. అప్పటికి గుణించిన వర్ష జాతకకుండలి ఇది :—

| | | | |
|---|---|---|---|
| X ౧౧-౪౬ | శు<br>౭౮-౨౮<br>శు<br>౭౮-౪౯ | చ<br>౭-౧౯<br>ర ౨౭-<br>౧౭-౧౮ | బు ౧-౧౦<br>బుద్ధి(స)౧-౪౮<br>పుణ్య(స)౨-౨౩<br>రా ౨-౫౦<br>వ ౨౦-౬౬<br>I ౨౨-౧౧ |
| | గాడ్సే గారి<br>౩౮ వ సంవత్సరపు<br>వర్ష జాతకము<br>——<br>సాయనము | | |
| | | | శ ౩-౪౪ |
| కే ౨-౫౦ | గు<br>౨౨-౫<br>(వ) | ఇ<br>౧-౧౭<br>(వ) | హత్య (స)<br>౬-౨౬ |

వర్ష ప్రవేశలగ్నాధిపతి బుధుడు మిథునరాశిలో ప్రబలుడై యున్నాడు. బుద్ధిసహమము బుధుని అంశ చేరుకొన్నది. ప్రబలమైన బుద్ధిశక్తితో వర్షారంభమైనట్లు. కాని, ఈ యోగము రాహువుయొక్క ముఖద్వారమందే సంభవించుట శోచనీయము. రాహువుముఖమునుండి వెడలు విషవాయుప్రవాహమునకు బుధుడును, బుద్ధియు చిక్కియున్నారు. ఇగ్నమో, వరుణునియొద్ద నున్నది. అనగా, బుద్ధి విషతత్త్వము నాశ్రయించి పెడతల పట్టినది. జన్మకాలమందలి మాయావి ఇంద్రునినుండి అర్ధకేంద్రస్థానమునందే ఈ రాహు వుండుట! ఇట్టి రాహువు బుద్ధికి హింసాతత్త్వమును నేర్పించుట వింతకాదు. వర్ష జాతకమందలి హత్యాసహమము జన్మబుధునితో నిండు కేంద్రస్థితిలో నున్నది. ఈ హత్యాసహమమునకు వర్ష లగ్నాధిపతియగు బుధుడే అధికారి. అనుటచే, ఈ సంవత్సరమున జాతకుని బుద్ధి ఏమార్గమున ప్రవర్తించునో, పై సామగ్రి ఢంకాకొట్టి దండోరావేయుచున్నది. మరియు, బుధుడు, బుద్ధి, రాహువు-ఈ మూడును జన్మచంద్రునికి (అనగా, లగ్నాధిపతికి) ప్రత్యక్షమిత్రదృష్టిస్థానమందే చేరియుండుట. మనస్సు, బుద్ధి, అహంకారములు—ఈమూడును జట్టుకట్టుకొని పరస్పరసహకారమునకు బద్ధకంకణములై నిలుచుట కదా యిది? ఈ మూర్తిత్రయములో బుధుడే జన్మకాలవ్యయస్థానాధపతి. వీనికే తాత్కాలికముగా ఇప్పుడు వర్షలగ్నాధిపత్యము లభించుట. వర్ష జాతకములో ఈ మూర్తిత్రయము వ్యయస్థానము—అనగా, మోక్షస్థానము—నందే విజృంభించినది. బుద్ధి, ఆలోచన, సంకల్పము, వాగ్ధోరణి, కార్యకుశలత- ఇవన్నియు మోక్షవిచారమున పనిచేయవలదా! సందేహమేమి? కాని, ఇది బంధమోక్షమా, లేక కపాల మోక్షమా?

పురాణములలోని కథ నిందుక స్మరింతము. మాయచారితన ముపయోగించి, మాచువారి కనుబ్రామి, చోరవృత్తితో అమృతమును సంపాదించిన వ్యక్తి ఈ రాహువు! తత్ఫలముగా, అతడు సాధించినది కపాల మోక్షమే కదా? రాహువునకు వచ్చిన, నచ్చిన, విద్య ఇది. వేరువిద్యను అతడెట్లు ఉపదేశించగలడు?

దేశమానవశిలో చరితశనిశుజులకు క్రూరమైన పరస్పరకేంద్రస్థితి ఏర్పడియుండుటయు, వారిలో చరితకుజుడు మహాత్ముని జన్మరాహువుపై ఆవాహన మగుటయు, చరితశని మహాత్ముని జన్మలగ్నమును ప్రత్యక్షశత్రుదృష్టిచే వేధించుటయు చదువరులకు జ్ఞప్తిలో నున్న వనుకొందును. ఇట్టి సందర్భములలో, వర్షజాతకమందలి శని గాడ్సే చరితకుజ

స్థానమునే చేరుకొనుట విశేషము కాదా? జన్మ కాలములో శని మృత్యుస్థానాధిపతి; కుజుడు ఉద్యోగస్థానాధికారి. "లెమ్ము. వేళ వచ్చినది." అని మృత్యువు ఉద్యోగశక్తిని తట్టి, లేపి, మంతన మాడి, హెచ్చరిక ఇచ్చినట్లు చూపట్టుచుండలేదా? కుజుడు, ఇక, తన సన్నాహము తాను చేయకతప్పినది కాదు. ఇతనికి కార్యనిర్వాహకుడు శుక్రుడనుట మనము మరవరాదు. వర్షజాతకమున వీరిరువురు ఒక చోట (మేషరాశి ౨౯ వ భాగములో) చేరుకొని మంత్రాలోచన చేయుచుండుట గమనింపదగినది. మేష రాశి ౨౯ వ భాగ ద్రోహమును (*Treachery*) సూచించు స్వభావము కలదని పాశ్చాత్యుల మతము. ఈ ప్రదేశములోనే అధికారి (కుజుడు) కర్తవ్యమును బోధించినాడు. అతని ఆజ్ఞను శిరసావహించి కార్య నిర్వాహకుడు (శుక్రుడు) ముందంజ వేసినట్లు చూపట్టు చుండలేదా?

వర్షజాతకమున పుణ్యసహమము దుష్టుడైన బుధుని ఏలుబడిలో నున్నది. మహారాహువు దానిని తన అంకసీమచేర్చి ఆలింగన మొనర్చుకొని ఆనందించుచున్నాడు. ప్రారబ్ధము పెడదారిపట్టినది. క్రూరకార్యమునకు వలయు సంస్కారము సిద్ధమగుట ఏమియరుదు? గాడ్సేజాతకమందలి 'తంటాకోరు' ఇంద్రుని అర్ధకేంద్రవేధకు లోబడినది ఈ పుణ్యసహమము. ఇది చాలదా?

జన్మలగ్నాధిపతి చంద్రుడు. వర్షజాతకమున ఈ చంద్రుడు వార్షికహత్యాసహమమునకు పరమమిత్రుడైనాడు. శని మహాత్ముని జన్మలగ్నమునకు పూర్ణ కేంద్రవేధాస్థానమును చేరుకొన్నాడు.

దేమానదశలో ఉద్బోధితములైన ఫలములకు వర్షజాతకము మెరుగుపెట్టుచున్నదని పాఠకమహాశయులు గమనించగలరు.

వర్షజాతకపద్ధతిలో, సంవత్సరమునందలి ౩౬౫ దినములను గ్రహములకు (రాశిసంచారములో ఆయా గ్రహము సంపాదించుకొన్న భాగ కలల కనుగుణముగా) పంచిపెట్టు దశావిభాగక్రమము వాడుకలో నున్నది. ప్రశంసలో నున్న సంవత్సరములో (౧౯-౫-౧౯౪౭ నుండి ౧౮-౫-౧౯౪౮) వర్షజాతక దశావిభాగ మీక్రింద చూడనగును:—

| | | | |
|---|---|---|---|
| వర్షారంభము | | ౧౯-౫-౧౯౪౭ | |
| బుధదశ | (౧౪.౮ దిన) | ౨.౮-౬-౧౯౪౭ | వరకు |
| శనిదశ | (౩౨.౫ ,, ) | ౫.౩-౭-౧౯౪౭ | ,, |
| చంద్రదశ | (౪౫.౪ ,, ) | ౧౯.౭-౮-౧౯౪౭ | ,, |
| ఇంద్రదశ | (౧౨.౩ ,, ) | ౧.౦-౯-౧౯౪౭ | ,, |
| వరుణదశ | (౧౫౩.౮ ,, ) | ౧.౮-౨-౧౯౪౮ | ,, |
| గురుదశ | (౨౦.౯ ,, ) | ౨౨.౭-౨-౧౯౪౮ | ,, |
| రవిదశ | (౬౫.౮ ,, ) | ౨౮.౫-౪-౧౯౪౮ | ,, |
| కుజదశ | (౧౫.౦ ,, ) | ౧౩.౫-౫-౧౯౪౮ | ,, |
| శుక్రదశ | (౪.౫ ,, ) | ౧౮-౫-౧౯౪౮ | ,, |
| మొత్తము | ౩౬౫ ,, | | |

జన్మకాలమున స్వార్థత్యాగ (*Self-sacrifice*) సూచకమైన భచక్రప్రదేశములోనున్న గ్రహము వరుణుడనియు, చలితజాతకమునందు చలితచంద్ర, చలితహత్యాసహమములకు నిందు త్రికోణసంబంధమును సంపాదించుకొన్న గ్రహ మీవరుణుడే అనియు చదువరులు స్ఫురణకు తెచ్చుకొనిరేని, ఆ వరుణుని దశలోనే మహాత్ముడు హత్యకావింపబడుటకు కారణము మనకు బోధపడగలదు. సాహసమును (*Adventure*) సూచించు మిథునరాశి ౨౧ వ భాగములో వర్షజాతకమున వరుణు డుండుట! లగ్నములో నుండుటచే, ప్రధాన కార్యనిర్వాహకత్వ మిపుడు వరుణుని పాలికి వచ్చినది. మహాత్ముని చలితశనికి సమసప్తకశత్రుదృష్టి స్థానమందే ఈ వరుణుడు నిలిచియుండుట! మహాత్ముని హత్యకై గాడ్సే సాహసమున కొడికట్టుటకు వరుణుని దశ ఎంతో తగియున్నదికదా?

వర్షజాతకసంప్రదాయములో మహాత్ముని హత్యాదినమును సూచించు మార్గమేదైన కలదా? అను సందేహము రావచ్చును. దైనికజాతకసంప్రదాయములో కేంద్రములకు గ్రహవేధ వచ్చిన దినమున ఫలప్రాప్తి కల్గుననుట పాఠకమహాశయులకు చిరపరిచితమయిన సూత్రముకదా? వర్షజాతకవిషయములో సయితము పై ధర్మములను మన మేల ఉపయోగించ రాదు? కాని, గమనించదగిన చిన్నవిశేష మొకటి

కలదు. దైనికజాతకపద్ధతిలో సంవత్సరకాలమున దశమకేంద్రము భచక్రపు ౩౬౦ భాగలను పూర్తిచేసి యథాస్థానము చేరుకొనగలదు. వర్ష జాతకపద్ధతిలో దశమకేంద్రగతి వేరు. ఏ లందురా ? రవి స్వస్థానము చేరుకొనుటకు ౩౬౫ దినములు, ౫ గంటలు, ౪౯ నిమిషముల కాలము పట్టును. అగుటచే, వర్షారంభకాలపు దశమకేంద్రము ఆ వర్షాంతకాలమునకు ౩౬౫ పరివర్తనములు పూర్తిచేసి, పైగా సరాసరి ౪౮ ౨/౪ భాగల దూరము ముందునకు జరిగియుండగలదు. ఫలమేమనగా, వర్షారంభదశమకేంద్రము వర్షాంతమునకు (దైనిక కేంద్రమువలె) స్వస్థానమునం దుండక, ౪౮ ౨/౪ భాగల పట్టు (కొంచెము తక్కువగా చక్రపాదము) ముందుకు పోయియుండగల దనుట. ఈ మానము ననుసరించి చలింపజేసినచో, ఇష్టదినమున చలితవార్షికకేంద్రస్థానము మనకు లభించగలదు. ఇతరదశాసౌకర్యము ననుసరించి, ఏ ఫలముల నుద్బోధించుటకు గ్రహములు సిద్ధములైయున్నవో, వానికి చలితకేంద్రముల సంబంధము వచ్చిన దినములు ఫలము నీవలయుకదా ?

నాదృష్టికి వచ్చినంతలో, ఈ కేంద్రచలనపద్ధతి తాజకగ్రంథములలో, ఎచటకాని, చెప్పబడియుండ లేదు. ఆ కారణమువలననే, దీనిని నిరాకరించుట భావ్యము కా దని నా మనవి. పైన సూచించిన ఉపపత్తిని గమనించినచో, దీనికి సయితము కొంత విలువ యుండుట న్యాయ మని చదువరులు సులభముగా గ్రహించగలరు. విద్యార్థుల ఉపయోగమునకై, ౩౦-౧-౧౯౪౮ నాటికి వార్షికకేంద్రముల చలితస్థానములను సాధించు ప్రయోగము ఈ క్రిందచూపబడినది:—

| | |
|---|---|
| ౩౦-౧-౧౯౪౮ వ తేదీన తుపాకిప్రేల్చినప్పటికి (౫-౫ P. M. I. S. T.) గం ని సెక స్థానికనాక్షత్రకాలము. | ౨౦-౩౩-౪౧ |
| వర్షారంభకాలమునకు (౧౯-౫-౧౯౪౭ వ తేదీన ౨-౧౩ A. M. గ్రీనిచి మధ్యమకాలమునకు) స్థానికనాక్షత్రకాలము. | ౩-౪౨-౫౦ |
| వర్షారంభమునుండి హత్యాకాలమునకు సంపాదించిన నాక్షత్రకాలము. | ౧౬-౫౦-౫౧ |
| వార్షికకేంద్రగతికి రావలసిన ధన సంస్కారము. (౧౬-౫౦-౫౧) గ. ౨౪ ౨౪. = | ౪-౫-౪ |
| వార్షికకేంద్రము సంపాదించిన మొత్తపు నాక్షత్రకాలము. | ౨౦-౫౫-౫౫ |
| వర్షారంభ లగ్నమునకు సరి అగు నాక్షత్రకాలమును చేర్చగా. | ౨౨-౫౧-౪౦ |
| హత్యాకాలమునకు సరిఅయిన నాక్షత్రకాలము. | ౧౯-౪౭-౩౫ |

ఈ కాలమునకు సరియగు కేంద్రస్థానము లివి:—

| | భా క | |
|---|---|---|
| చలితవార్షికలగ్నము | ౩-౪౪ | వృషభము. |
| చలితవార్షికదశమము | ౨౫-౧౧ | మకరము |

ప్రశంసలో నున్న వర్షారంభకాలపు లగ్నము హత్యాసమయమునకు వృషభరాశిలో ౩ భా, ౪౪ కలలలో నున్న దని కనుగొన్నచో, పాఠకమహాశయులు ఆశ్చర్యచకితులు కాక మానరు. గాడ్సేచలితశనిస్థానమదే. అతని చలితకుజునికి, మహాత్ముని జన్మరాహువునకు, వార్షికశనికిని పూర్ణకేంద్రవేధాస్థానమదే! గాడ్సేగారి చలితకార్యసిద్ధిసహమప్రదేశమదే! పర్యటనవలన వెలరేగి మహాత్ముని జన్మలగ్నమునకు ప్రళయమును సంపాదించి ఇచ్చిన భచక్రభాగ అదే ! !

ఇక, చలితవార్షికదశమకేంద్ర మే మయినదో, చూడుడు. గాడ్సేగారి జన్మవరుణస్థానమునే ఇది చేరుకోవలయునా ? ఈ వరుణగ్రహపు విలువ ఎట్టిది ! జన్మకాలమున స్వార్థత్యాగబుద్ధిని పోషించు ప్రదేశము నాశ్రయించినాడు ; చలితజాతకమున చలితశుక్రునికి, చలితహత్యాసహమమునకుసహాయుడైనాడు ; వర్ష జాతకములో సాహసమును సూచించు భాగను చేరుకొన్నాడు; వర్షలగ్నములో నుండి కార్యనిర్వాహకత్వమునకు పూనుకొన్నాడు ; మహాత్ముని చలితశని కెదురు నిలిచినాడు ; హత్యాకాలమునకు వర్షదశను తానే నడుపుచున్నాడు ! ఇట్టి వరుణుని జన్మకాలికస్థానము

చలితవార్షికదశనుమునకు ఆనాడు తగినది కాదని చెప్పుట సాహస మనుకొందును.

దశలలో ఫలప్రదములుగా ఏర్పడిన గ్రహస్థానములతో హఠాత్కాలమునకు చలితవార్షికకేంద్రములు ఎంత హృదయంగమముగా సన్నిహితసంబంధమును సంపాదించుకొన్నవో చదువరులు గమనించియుందురు. ఇంతకన్న 'తమాషా' కావలయునా?

వర్ష జాతకముయొక్కయు, వార్షికకేంద్రచలన పద్ధతియొక్కయు విలువ ఏపాటిదో, ఈ ఉదాహరణము కన్నులకు కట్టినట్లు చూపుచున్నది. మామూలుగా వింశోత్తరి మున్నగు దశాపద్ధతులవలన సాధించగల ఫలములు తృప్తికరముగా నుండనికారణముననే, యవన సంప్రదాయమునుండి వర్ష జాతకపద్ధతిని ప్రాచీనశాస్త్రజ్ఞులు గ్రహించి వాడుకకు తెచ్చుకోవలసివచ్చె నని, క్రీ. శ. ౧౬౪౯ (A D.)లో బలభద్రుడను సుప్రసిద్ధ శాస్త్రవేత్త తన 'హాయనరత్న' గ్రంథములో గంట వాయించి చెప్పినాడు. శాస్త్రాభ్యుదయమే ప్రధాన లక్ష్యముగా గల విద్యాధికులు ఈ దేవమాన, సూక్ష్మమాన, వర్ష దశాపద్ధతులతో దైనికజాతకప్రక్రియను సమితము చేసుకొని ఉపయోగింతురని నా ఆశ.

సాధారణముగా ఆధునిక కార్తాంతికులలో అనేకులకు ఇట్టి పద్ధతులు రుచించనే రుచించవు. పైగా వానిపై ద్వేషముకూడ. అనగా జాతకఫలాదేశమే జీవసాధారవృత్తిగా ఏర్పరచుకొన్నవారి కనుట. ఇంచుక ఆలోచించితిమేని, కారణము దురూహ్యము కాదు. విశేషకాలయాపన మవసరమైన ఈ పద్ధతులను వారు వాడుకచేసినచో, ఇప్పటి ఆర్థికపరిస్థితులలో, వారికి గిట్టుబాటు కాదనుట సుప్రసిద్ధవిషయము. అక్కరమాలిన ప్రశ్నలు వేసి, అర్థములేని జవాబులు, రూపాయకు మూడువంతున, చెప్పించుకొని ఆనందించుట కలవాటుపడిన ఇప్పటి నవనాగరకతలో, సూక్ష్మమాన దశలో, వర్ష జాతకములో గుణించుచు కాలక్షేపము చేయజొచ్చిరేని, కార్తాంతికుల ఆలుబిడ్డల ముఖములలో క్షామదేవత తాండవమాడుచుండవలసినదే. కావుననే, ఇవేకాదు, మరి ఏ సూక్ష్మగణితపద్ధతులయినవారి అభిమానమునకు పాత్రముకాజాలవు. ఇంతేకాక, ఈ పద్ధతులు నిష్ప్రయోజనము లనియు, ఇట్టి గరడీసాములతో పనిలేకయే, సర్వసులభమయిన గుప్తపద్ధతులతో, అపూర్వముగా ఫలములను చిటికలో చెప్పగలమనియు దండోరా వేయనిదే వారికి తాత్కాలికముగానయినా, ప్రతిష్ఠ రాదు. ప్రకృతపు పరిస్థితు లిట్లుండుటచే, వారిని మనము తప్పనలేము. కాన, శాస్త్రాభివృద్ధికి వీరు తోడుపడజాలరు. ఇతరవిధజీవనోపాయము కల్గి పరిశోధనదృష్టి యలవడిన విద్యాధికులు సాధారణముగా ఈ కాలములో అరుదు. ఉన్నవారిలో పలువురికి ఇది యొక శాస్త్రమను భావము రాలేదు. ఇక, రాజకీయాభిమానము గల విశ్వవిద్యాలయముల దృష్టి వేరు. ఏమి కాలవైపరీత్యమోకాని, ఏశాస్త్రమునైనా ఆదరించు విశ్వవిద్యాలయములు జాతకశాస్త్రమును కడగంటనైనా చూడకున్నవి. ఆర్థికాభివృద్ధికి పనికివచ్చు పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, భూగర్భశాస్త్రము మున్నగు విద్యలను హెచ్చుగా ఆదరించుట సాధువే. కాని, ఇంకా పురుటింటిలో కన్నులు తెరవని స్థితిలో నున్న మన తత్త్వశాస్త్రముపై ఈ విద్యాసంస్థలు చూపుచున్న భక్తివిశ్వాసములలో శతాంశమైనా ఈ ప్రాచీనవైదికవిద్యపట్ల చూపరాదా? పోనిండు. తత్త్వశాస్త్రమును కళాశాలలలో నేర్పుచున్నారే? విద్యార్థులయొక్క కాని, దేశముయొక్క కాని ఆర్థికాభివృద్ధికొరకేనా? దీని తత్త్వమా పరమేశ్వరునకే ఎరుక! మరియొక వింత చూడుడు. జనసామాన్యముయొక్క విజ్ఞానాభివృద్ధికిని, కళాభివృద్ధికిని పనిబూని నడుముకట్టి నిలిచినది అఖిలభారత రేడియోసంస్థ. పిల్లలప్రోగ్రాములుమొదలు ముదుసళ్ల మాల్గులదాక నానావిధవిజ్ఞానములపై అభిమానము చూపుచున్న ఈ సంస్థకు జాతకముహూర్తముల ప్రశంస, పాపము, నేటిదాక స్ఫురించినదే కాదు. శ్రోతలకు రుచించ దనియో, లేక అర్థము కా దనియో వీరి అభిప్రాయ ముండునా? కవిత్వములో రీతులు, అలంకారములలో ధ్వని, పాత్రపోషణములో ఉపజ్ఞ, వేదములలో గానకళ ఇత్యాదివిషయములపై పండితులచే వీరిప్పించు ఉపన్యాసములు ఎందరు శ్రోతలు అర్థముచేసుకొనగలిగిరో? గ్రహములతో మనకు గల

సంబంధము, ఆరోగ్యవిషయమున గ్రహచారపు ఫలము, వ్యవసాయమునకు ఋతుధర్మముల సాహాయ్యము, ముహూర్తముల ఆవశ్యకత ఇత్యాదిసర్వజనోపయుక్తములగు విషయములనుగూర్చిన ఉపన్యాసములు శ్రోతలకు రుచించవా, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడవా ? జనసామాన్యమున కింకను గ్రహనక్షత్రాదులపై విశ్వాసము పోలేదు. వారపత్రికలు, మాసపత్రికలు, సర్వసాధారణముగా, గోచారనక్షత్రరాశిఫలములను ప్రకటించుటే దీనికి సాక్షి.

పోనిండు. "జీవన్ భద్రాణి పశ్యతి." అని వేచియుందము. ప్రకృతమునకు మరికొన్ని తమాషాలు చూచి ఆనందింతముగాక.

మహాత్ముని నిధనకాలపు కుండలి ఇది :—

| | | | |
|---|---|---|---|
| కు౧౫-౧౦ | | X ౦-౩౦ రా౧౯-౧౬ | వ ౨౨-౩౦ |
| బు౨౬-౩౨ ర ౯-౩౧ | మహాత్ముని నిధనకాలము సాయనము | | |
| | | | I ౬-౩౦ శ ౨౦-౧ (వ) |
| శు ౨౧-౫ (వ) | కే ౧౯-౧౬ | చ ౮-౮ ఇ ౧౨-౫౫ (వ) | గు ౪-౨౭ (వ) |

నిధనకాలచంద్రుని దేవమానదశలో చలింపజేసినచో, ఫల మేమి వచ్చునో చూడుడు.

ఈచంద్రుడు తులారాశి ౨౨ వ భాగకు వచ్చెనని వ్యయభావమందలి వరుణునితో త్రికోణదృష్టియు, గాడ్సే జన్మబుధునినుండి సార్ధకేంద్రవేధయు సంపాదించునుకదా ? ౧౯౪౯ ఫిబ్రవరి నెలకు చలితచంద్రుడిచటికి రాగలడు. హత్యాభియోగములో న్యాయాధిపతి తీర్పు అప్పుడే! ౧౯౪౯ ఆగస్టు నెలలో ఈ చలితచంద్రుడు వృశ్చికరాశిని ప్రవేశించుట. ఈ అభియోగము హిందూదేశమందలి న్యాయస్థానముల వదలి ఖండాంతరమువారి 'పంచాయతీ' నపేక్షించినది. ఈ నవంబరుమాసాంతమునకు చలితచంద్రుడు వృశ్చికరాశిలో ౩౧/౪ భాగకు పోగలడు. నిధనదినము నాటి శుక్రుడు చలనవశమున అప్పటికి మీనరాశిలో ౧౭ వ భాగలో నుండును. అగుటచే చలితచంద్రుడు ఈ శుక్రుని సార్ధకేంద్రదృష్టిని స్వీకరించి గాడ్సేగారి చలితకుజచలితశనుల పూర్ణవేధాస్థానమును చేరుకోగల డనుట! ఈనాటకమునకు భరతవాక్య మది కాబోలు!

అది యట్లుండె. న్యాయాధిపతి తీర్పు చెప్పుట ౧౯౪౯ ఫిబ్రవరి నెల ౧౦ వ తేదీనాడు ఉదయము ౧౧-౩౦ *A. M. (I. S. T.)* గంటలకు అప్పటి గ్రహసంపత్తి యిది :—

| | | | |
|---|---|---|---|
| కార్యసిద్ధి (స) ౧౬-౧౩ | రా ౨౯-౧౮ | I ౧౯-౫౦ | ర ౨౬-౪౪ (వ) |
| కు ౨౮-౫౦ ర ౨౧-౧౧ బు౫-౫౯ (వ)X౫-౦ గు ౪-౫౨ | న్యాయాధిపతి తీర్మానము —— (సాయనము) | | చ ౮-౩౯ ప్రాప్తి (స) ౧౦-౧౮ |
| శు ౧౯-౨౯ | | | హత్య (స) ౧-౭ యమ- (ప్లూటో) ౧౪-౧౧(వ) |
| | | ఇ౧౫-౦(వ) మృత్యు (ప) ౨౬-౪ కే ౨౯-౧౮ | శ ౩-౪౨ (వ) |

హంతకునికి శిక్ష విధించుటే ఈ తీర్మానపు ఫలము. ఈకథలో హంతకగ్రహము శుక్రుడని చదువరు లెరుగుదురు. ఈ తీర్మానపు ఫలము వానికి చెందవలసినది! కనుకనే ఈ కుండలిలో లగ్నాధిపత్యము శుక్రుడు వహించుట ఎంతో రమ్యముగా నున్నది. ఈ నిందితుడు దశమకేంద్రమధ్యమందే నిలిచినాడు. అనగా, న్యాయస్థానములో ననుట. అచటనే, ఈ శుక్రుడు బుధుని చేరుకొన్నాడు. నిందితుడు తీర్మానమును విన్నాడని యర్థము. ఈకుండలిలో మృత్యుస్థానాధిపతి

(బృహస్పతి) ధర్మస్థానములోనుండుట. హత్యాభియోగము కోర్టుకెక్కినదికదా! విశేష మేమనగా, ఈ బృహస్పతియొక్క పరిపూర్ణకటాక్షము తీర్మానపు లగ్నముపై నున్నది. ఇం కేం దుండగలదు? రాజ్యస్థానాధిపతియగు శని (న్యాయాధికారి) ఇతరసంబంధములను మానుకొని వివిక్తస్థలములో, మంచి వివేచనా శక్తి నిచ్చు కన్యారాశిలో, చక్కని మంత్రాలోచన తెలుపు పంచమభావములో ఉన్నాడు. దయాదాక్షిణ్యములకు లోనుగాక, జంకుగొంకులు లేక, న్యాయమును పరిపాలించుటకు ఇట్టి శనియే ఎంతయు తగినవాడనుట నిర్వివాదము.

హంతకుడు 'ఫలానా' వ్యక్తి యని నిర్ధరించుటే ఈ తీర్మానమునకు ఫలముకదా? ఈ కుండలిలో 'ఫలప్రాప్తి సహమ మను బిందువు ఎచ్చట నున్నదో గమనించినచో పాఠకమహాశయు లాశ్చర్యపడకమానరు. కర్కాటకరాశిలో ౧౧ వ భాగలో నున్న ఈ సహమమునకు అంతరార్థ మేమో తుణ మాలోచింపుడు! గార్నెజాతకములో ఉద్యోగస్థానాధిపతియగు కుజుడున్న భాగ అదేకదా? తీర్మానపు ఫల మెచట వ్రాలినదో కాలపురుషుడు చూపుచున్నాడనుట కాక వేరేమి?

హత్యాకాలమున ఉద్యోగాధిపతి శుక్రుడు మీనరాశిలో ౧౫ భా. ౧౦ కలలలో నుండెనుగదా? తీర్మానపు కాలమునకు ఈ శుక్రుడు చలనవశమున ౧౬ భా. ౨౦ కలలకు వచ్చినాడు. తీర్మానపు కుండలిలో 'కార్యసిద్ధి' సహమము నికరముగా ఆ చలిత శుక్రునిపైననే ఆవాహనమైనదనుట చిత్రము కాదా? తీర్మానమునకు సాఫల్యము హంతకుడు న్యాయశాస్త్రమునకు చిక్కుటే!

తీర్మానము నాటి గార్నెదైనికజాతకము లోని విశేషము లివి:—

| | | భా. కల | |
|---|---|---|---|
| దైనికలగ్నము | ... | ౨ - ౦ | మేషము. |
| దైనికదశమము | ... | ౧-30 | మకరము. |
| దైనికహత్యాసహమము | ... | ౧౭-౦ | వృషభము. |
| దైనికమృత్యుసహమము | ... | ౨౫-30 | కటకము. |

గార్నెగారి లగ్నాధిపతియగు జన్మచంద్రునికి నికరముగా సమసప్తకవేధకే నాటి దైనికలగ్నము రావలయునా? దైనికహత్యాసహమము తీర్మానకాలపు లగ్నమునే ఆశ్రయించవలెనా? దైనికమృత్యుసహమము జన్మవరుణుని సమసప్తకవేధకే గురికావలయునని విధియా? జన్మకాలమున అవసానసహమము మేషరాశి ౨౫త్తి భాగ; తీర్మానపు కుండలిలో మృత్యుసహమము తులారాశి ౨౬ వ భాగ; దైనికమృత్యుసహమము కర్కాటకరాశిలో ౨౬ వ భాగ! జన్మవరుణునకు ఈ మూడును మూడు కేంద్రములలో నిలుచుట వింతలలో వింత! రోగి కోరినదే వైద్యుడు పథ్యముగా నిర్ధరించిన ట్లయినది. తీర్మానపు వ్యాజమున కాలపురుషుడు చరమశ్లోకము సిద్ధముచేయుటకదా యిది? ఇంతకన్న 'తమాషా' కావలయునా?

దేవమానదశాపద్ధతిని తీర్మానకాలపు కుండలిని సయితము ఉపయోగించిమాతము. రాగల నవంబరు మాసాంతమునకు చలితచంద్రుడు బృహస్పతితో పరిపూర్ణసమసప్తకవేధపాలు కాగల డని చదువరులు గమనించగలరు. ఈ బృహస్పతి అష్టమాధిపతి! పైగా నీచుడు, ధర్మస్థానములో నుండుట! అసాధారణపరిస్థితు లేవయినా అడ్డమురానిచో, తీర్మానపు ఫలము కార్యరూపమునకు రావచ్చునని సూచన ఏల కారాదు?

సరే కాని, దశాసౌకర్యము రావలదా? అను శంక కల్గుట సహజము. దానిని సయితము పరిశీలింతము గాక. ఈప్రక్క నున్నదే చలితజాతకకుండలి.

జాతకమున గురువు ధర్మస్థానాధిపతి. న్యాయసహమముసయితము ఇతని అధికారములోనిదే. ఈగురువునకే చలిత జాతకములో అష్టమాధిపత్యము వచ్చినది. ఇట్టి గురువుతో చలితరవికి (చలితలగ్నాధిపతికి) పూర్ణ కేంద్రదృష్టివేధ! జన్మగురువుతో, జన్మలగ్నాధిపతి చంద్రునితో, కేంద్రమందున్న కారాగృహసహమము చలించి, ప్రాప్తిసహమమును చేరుకొని, జన్మయముని (ప్లూటో)తో అర్ధకేంద్రవేధపాలయినది. ప్రకృతపరిస్థితులకు దేవమానదశ అర్థముచెప్పుచున్నట్లుండలేదా?

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | శు ౨౮-౩౧<br>రా ౨౬-౨౨<br>X౧౯-౦ శ ౪-౧౬<br>ఆత్మ ౦-౧౫ | బు ౧౪-౧౪ | |
| VIII ౧౯-౦<br>చ ౨-౫౦ | ఆత్మ ౯-౨౧ | X ౮-౩౦<br>శు ౧౨-౫౨ | శ ౦-౧౩<br>ర ౨౮-౧౮-౧౭<br>రా ౨౭-౨౬ | బు ౬-౪౯ (వ)<br>యమ ౨౫-౪౦ | |
| | | గాడ్సే జన్మచలిత<br>జాతకములు<br>——<br>(౧౯౪౯) | | కారాగృహ<br>౪-౨౭ కు౧౦-<br>౪౫ I ౧౪-౦<br>ఇ ౧౮-౧౬ | ర ౫-౬<br>ఇ ౧౭-౩౧ |
| న్యాయ౨౬-౪౫<br>వ ౨౪-౦<br>హిల్లాజ ౪-౦<br>మృత్యు ౦-౧ | వ ౨౫-౪ | | | ప్రాప్తి౧౦-౪౭<br>హత్యా<br>౧౮-౨౧ | కు ౫-౨౦<br>కారాగృహ<br>౧౦-౧౦<br>I ౧౯-౩౦ |
| పుణ్య ౨౨-౦ | న్యాయ<br>౧౭-౪౮ | పుణ్య ౧౭-౩౮<br>బుద్ధి ౨౧-౩౭<br>మృత్యు౨౩-౫౬<br>హిల్లాజ౨౭-౧౬<br>కే ౨౭-౨౬ | చ ౧-౫౪<br>గు ౪-౫౩ (వ) | | ప్రాప్తి<br>౧౮-౩౦<br>హత్యా<br>౨౫-౦ |
| | | కే ౨౬-౨౨ | గు ౫-౩౫ | | |

చలితలగ్నము చలితరవిగురువుల మధ్యమునకు పోయి చేరినది. చలితచంద్రుడు ఇంద్రునితో సార్ధకేంద్రవిషమదృష్టిని నవంబరు నెలకు సంపాదించుకొనుచున్నాడు. ఇది విషమకాలము!

న్యాయసహమము చలితకుండలిలో ఇంద్రకుజుల మధ్యబిందువున ఎదురుగా నిలచుట ఈ గ్రహముల సమష్టికార్యమునకు న్యాయశాస్త్ర మిపుడు ప్రతికూలించిన దనుటకాక మరియేమి? ఆత్మసహమ [illegible]సునుచున్నదో, తిలకింపుడు. మృత్యుస్థానాధిపతి యగు జన్మశని తన్నాకర్షించుచున్నాడని చాటుచున్నదికదా?

వృశ్చికరాశిలో మృత్యుసహమము ఆక్రమించిన భాగ రాజ్యాంగతంత్రము (*Politics*) నకు సంబంధించినదని మారిస్ వెమిస్ పండితుని మతము. ఈ సహమము ఇప్పటికే మకరప్రవేశము చేయుటచే, మృత్యుస్థానాధిపతి(శని)ని చేరుకొన్న ఆత్మసహమముతో మైత్రిని అభిలషించుచున్నది. రాజకీయకారణముల మూలముగా రానున్న అవసానమును సూచించుటకదా యిది?

అది యట్లుండె. ౧౯౪౯ వ సంవత్సరమున 'వర్ష జాతక' మెట్లున్నదో! ౧౭-౫-౧౯౪౯ నాడు ౨-౧౨-౫౯ *P. M.* (*G. M. T*) కాలములో వర్షప్రవేశమైనది. అప్పటి కుండలి ఇదిగో ప్రక్కపుటలోనున్నది.

జన్మలగ్నాధిపతి చంద్రుడు జన్మాష్టమభావమును చేరుకొన్నాడు. వర్షజాతకములో అష్టమాధిపత్యము ఈ చంద్రుడు సంపాదించుకొనుట. దీనికి కుజునితో

| | | | |
|---|---|---|---|
| | రా ౨౪-౯ | శు ౧౩-౪౫<br>ర ౨౬-<br>౧౬-౧౮ | శు ౫-౩౯<br>బు ౧౭-౨౫<br>వ ౨౮-౪౪ |
| చ ౧౩-౩౫<br>గు ౨-౧౦<br>(వ) | వర్ష జాతకము<br>———<br>(౧౯౪౯)<br>సాయనము | | VIII<br>౮-౩౪ |
| | | | యమ: ౪-౧౭<br>పుణ్య ౨౩-౧౮<br>శ ౨౯-౩౪ |
| I ౬-౦ | | ఇ ౧౨-౪౪<br>కే ౨౪-౯ | X ౧౧-౫౭ |

కేంద్రవేధ, వరుణునితో సార్ధకేంద్రవేధ, యమునితో సమసప్తకవేధ, పాపము—ఇన్ని దాపురించినవి. హంతకగ్రహమగు శుక్రుని గతి చూచితిరా? జన్మశుక్రునికి సమసప్తకదృష్టిని, చలితరవిశుక్రులకు సార్ధకేంద్రదృష్టిని ఈయగలచోటికి ఇంద్రుడు చేరుకొన్నాడు. వర్షజాతకపద్ధతిలో ఈ ఇంద్రుని దశయే ౬-౬-౧౯౪౯ నుండి ౧౦-౧౨-౪౯ దాక జరుగవలసి యుండుట.

జన్మమృత్యుసహమమునకు నిండుకేంద్రములో, వార్షికమృత్యుభావమునకు అర్ధకేంద్రములో పుణ్యసహమము తటపటలాడుచున్నది.

దశాఫలములతో సమన్వయపరచినచో, వర్షజాతకముసయితము దుష్టఫలమునే చూపుచున్నదని కొనవచ్చును. ఈ సామగ్రి ఇట్లుండగా పర్వము లేమైనా గాడ్సే జాతకమును పరామర్శించునేమో, పరిశీలించుట అప్రస్తుతము కాదు. ౧౯౪౯ జనవరి ౧౪ వ తేదీన వచ్చిన పూర్ణిమ గాడ్సే చలితవరుణునిపైన బడి, ఆత్మసహమమును అర్ధకేంద్రవేధతో పొడిచినది. చరమశ్లోకరచన జరుగుచుండిన కాలమదే. మే నెలలో ౨౬ వ తేదీనాడు జన్మబుధునిపైననే అమావాస్య వచ్చినది. తరువాతనే అప్పీలు పరిష్కారమగుట! జూలై ౧౦ వ తేదీనాడు కర్కాటకరాశి ౧౮ వ భాగలో ఇంద్రునిపైననే పూర్ణిమ వచ్చినది. సకాలమున చరమశ్లోకపఠనము జరుగకుండునట్లుగా, ఇంద్రుడు తన మాయమంత్రముల నుపయోగించినాడు. ప్రీవీకౌన్సిలుకు అప్పీలు చేయు వ్యాజమున కాలయాపనమునకు అవకాశము వచ్చినది. ఇక, నవంబరు నెల ౨౦ వ తేదీన రాగల అమావాస్య జన్మకేతువుపైన పడగలదు. ఆనాడు మధ్యాహ్నము ౦-౨౪-౫౯ *P. M.* (*I. S. T*) గంటలకు ఈ పర్వము వచ్చుట. అప్పటి గ్రహస్థితి ఇది:—

| | | | |
|---|---|---|---|
| | రా౧౪-౧౯ | | |
| I ౨౮-౫౫ | "పర్వము"<br>(౨౦-౧౧-౧౯౪౯)<br>(సాయనము) | | వ ౪-౨౦<br>(వ) |
| సు ౧౪-౫౦ | | | యమ<br>౧౮-౧౧ |
| X ౭-౫౧ | బు ౨౭-౪౪<br>ర ౨౬-౩౯<br>చ ౨౬-౩౯ | కే ౧౪-౧౯<br>ఇ ౧౭-౨౫ | శు ౧౩-౧౭<br>శ ౧౮-౧ |

అపరిహార్యప్రారబ్ధమును (***Inevitable fate***) సూచించు ప్రదేశములలో, గాడ్సేజన్మరవి—చలితశుక్రసంయోగస్థానమునకు ౧౮౦ భాగలలో, ఈ పర్వము వచ్చుచున్నది. గండసంధిలో నున్న జన్మకేతువు, జన్మహిల్లాజము—ఇవి చెలరేగవచ్చును. చలితహిల్లాజము మకరరాశి ౪ భాగలో నున్నది. పర్వకాలపు వరుణుడు జన్మకాలపు కారాగారసహమమును చేరుకొని చలితహిల్లాజమును సమసప్తకదృష్టితో ఆకర్షించుచున్నాడు. పర్వవేళలో అష్టమాధిపత్యము గలవాడు శుక్రుడు. ఈ శుక్రుడు జన్మలగ్నమునకు ఎదురుగా నిలువగా, ఏకకాలమందే, ఈరెండింటిని, పర్వకాలపు రాహుకేతువులు కేంద్రవేధపాలు చేసినారు. జన్మకాలికరాహుకేతువుల నడుమ చిక్కి పర్వలగ్నము నలిగిపోయినది. పర్వకాలపు శని చలితకుండలిలోని అష్టమభావమును వేధించుట (సమసప్తక వేధ) చూడగలము. జన్మకాలమున మృత్యుస్థానాధిపతికదా శని!

పర్వకాలమునకు గాడ్సే దైనికలగ్నము మకరరాశి ౨వ భాగలో నుండును. వరుణుని సమ సప్తకమున కిది మూడురోజులలో ప్రయాణము చేయ గలదు. అప్పటికి పర్వలగ్నము చలితచంద్రుని చేరు కొనుచున్నది. అనగా, పర్వశక్తి లగ్నాధిపతికి చెందు ననుట! తరువాత ఆరుదినములకు పర్వలగ్నము అత్మ సహాయస్థానమునకు బోయి జన్మవరుణుని అర్ధకేంద్ర వేధను బొందును. కుజశనులు సంయోగము నొంది చలితమృత్యుభావమున కెదురవత్తురు. దైనికలగ్నము జన్మకుజుని కెదురగును. వర్షలగ్న మప్పటికే యముని సంయోగము నందగలదు. ప్రబలగ్రహవైషమ్యకాల మిది యని భావించుట తప్పుగాదు.

ఇంత చాలును. గాడ్సేజాతకమునకు భావిఫల ముల చెప్పబూని ఈ చర్చ నారంభించితి ననుకొనుట పొరబాటు. అట్టి కాలక్షేపమువైన నాకు అభిరుచి లేదు! కుతూహలముసయితము లేదుకూడ. అతని భావిఫలము, లోకవ్యవహారరీత్యా, ఇండియారాజ్యాంగమువారి చేతులలో నున్నది. వారే మునుముందుగా ఫలాదేశము చేయగలరు. అనగా, వారిలో ముఖ్యవ్యక్తుల జాతకగ్రహసామగ్రి ఇది నిర్ధ రించు నని యర్థము. ఇచట ఒక చిన్న 'తమాషా'! శ్రీ 'చక్రవర్తి' రాజగోపాలాచార్యులవారి జన్మగురువునకు (లగ్నాధిపతికి) నికరముగా సమసప్తకస్థానముచే గాడ్సేచలితకుజుడు ఇపుడు ఆశ్రయించుట! ఈ సమ స్యలో కడపటిమాట వారిదే కాబోలు! మహాప్రధాని శ్రీ నెహ్రూపండితుని జన్మచంద్రస్థానమందే గాడ్సే చలితకుజుడు నిలిచియున్నాడు. ఉపప్రధాని శ్రీ పటేలుగారి జన్మకుజునికి నికరముగా సమసప్తకస్థాన మదే. గాడ్సేచలితలగ్నము ఉపప్రధానిగారి జన్మవరు ణుని సంయోగమును పొంది వారి జన్మశనినుండి సమ సప్తకవేధ నభిలషించుచున్నది!

ఈ యోగములకు వ్యాఖ్యానము చేయబూనుట అధికప్రసంగ మగును. కాక, ఇన్నింటిని సమన్వ యము చేయు సామర్థ్యముగల ప్రతిభ యొకటి కావలసియున్నది. మనుబోటి సామాన్యవిద్యార్థుల కది అందరాని పండు. శాస్త్రీయములగు పద్ధతుల విలు వను జూపి, జ్యోతిషవిద్యార్థులకు గల శాస్త్రాభి మానము, వ్యాసంగకుతూహలము, పరిశోధనదృష్టి- వీనికు త్తేజనము నిచ్చుటే నా సంకల్పము. ఆధునిక విద్యార్థులకు ఈ విషయమందు అభిరుచి కలిగనేని అచిరకాలమందే ఈ ప్రాచీనపవిత్రవిద్యకు అభ్యు దయము రాగలదని నా విశ్వాసము.

"కాలక్రమేణ జగతః పరివర్తమానా
చక్రారపంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః"(భాసుడు)



# భవభూతికవి - ఆయన చిత్ర చరిత్ర

శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి

'ఏమండోయి జాతూకర్ణమ్మగారూ, మీ అల్లుడు గారికి ఒక కన్ను లేదే !'

'లేకపోతే నేమమ్మా, మహాపండితుడు, పని వాడైనా'

'పండితుడే. కాని మీ అమ్మాయి ఒప్పుకుందా'

'భేషుగ్గా; వరించి చేసుకుంది మా శ్రీదేవి'

'అలాగా !'

'బాగేగా. పైగా పాపం, ఆ కన్ను ఈ నడుమే పోయింది. మునుపు బాగుండేది చూడు ఎంత ఎఱుపు! ఆ ముక్కు, మొహం, పొడుగు, తేజస్సు! అజాను బాహువు మనిషి. సాముద్రికంలో చెప్పే మహాపురుష లక్షణా లన్నీ ఉన్నాయి.'

'సరే, కలిసివచ్చిన సంబంధం గావును. పైగా బావ. అంచేత చిన్నప్పటి సహవాసం ప్రేమగా మారి కన్నొకటి పోయినా మీ అమ్మాయి కోరి పెళ్లి చేసుకుంది.'

'మా అమ్మాయి కావ్యశాస్త్రాలు కాస్త చదువుకుంది. అంచేత చదివిన బావంటే దానికి గురుత్వం' అన్నది తల్లి జాతూకర్ణీదేవి. ;చో, వర్ష

ఈ మెథర్త నీలకంఠుడు. మహాపుచున్న దను భట్టశ్రీ నీలకంఠుడని వ్యవహారము. డగా పర్వము విదర్భదేశమున పద్మపురమున (నేటి ంచు నేమో, పరి బరు లను తెగ బ్రాహ్మణులు, తైత్తిరీ జనవరి గర వ గురువులు, పంక్తిపావనులు, ధృతవ్రతులు వరుణుని పైన జాలు ఉండిరి. ఆ తెగలో కాశ్యపగోత్ర డించినది. కృష్ణయజుశ్శాఖాధ్యాయి, మహాకవి యను పేరిపొ వాజపేయయాజి యుండెను. అతని మనుమడు భట్ట గోపాలుడు చాల ప్రసిద్ధి నందియుండెను. ఈతని కుమారుడే పై నీలకంఠుడు. ఈతడు పండితుడై జాతూకర్ణి యను నామెను వివాహమాడెను. వీరికి శ్రీదేవి యను కొమార్తెయు, శ్రీకంఠుడను కుమారుడును జనించిరి. ఈ శ్రీదేవికే నేడు వివాహము.

అల్లుని పేరు కుమారిలస్వామి. ఆంధ్రదేశమునకును ఉత్కళమునకును నడుమ మహానదీతీరమున జయమంగల మను గ్రామము కలదు. అందు తైత్తిరీయ శాఖకు చెందినవాడు యోగీశ్వరభట్టను వత డుండెను. ఆయనభార్య చంద్రగుణ. వీరికి చిరకాలము లేక లేక కుమారస్వామివరమున నీతడు జనించినందున కుమారిల స్వామి యని నామకరణ మొనరించిరి. చంద్రగుణ నీలకంఠునికి అక్కవరుస. బాల్యమునుండియు రాకపోకలవలన శ్రీదేవికి కుమారిలస్వామి యనిన చాల ప్రియము. సౌందర్యమున మన్మథుడే.

కుమారిలుడు బాల్యమునుండియు మేధావంతుడు. వేదవేదాంగములను నేర్చినంతట ఇతనికి జైనమతముపై నీర్ష్య జనించినది. దానిని ఖండించి వైదికమతమును దేశమందు పునరుద్ధరింపవలయు నను నభిలాష కలిగినది.
పర్వము ప తమ మతరహస్యములను ఇతరులకు కెఱుపు, జన్మహి గులను చూపరు. వానిని గ్రహించిన హిల్లాజము మకరర ధ్యపడదు. జిజ్ఞాసువు, అభిమాని కాలపు వరుణుడు జ చేరుకొని చలితహిల్లా మున నే ఇల్లు వదలెను. విద్యార్థి చుచున్నాడు. పర్వ నము మొదలిడెను. జైనమతమును వాడు శుద్రుడు. ఈ అతని యాత్మకు శాంతి యేది ? రుగా నిలువగా, ప్రయత్నము తెలిసినది. కుమారిలస్వామి కాలపు రాహుతు డని యెఱుగును. తలిదండ్రులు జన ప్రయత్నము చేయగా నివారించెను. శివ స్వామి కుమారిలస్వామియే యనెను. అతడో దేశాంతర మేగినాడు. కాని వచ్చువఱకును ఉండవలసినదే యని పట్టుపట్టెను.

కుమారిలుడు దేశసంచార మారంభించెను. నాడు దేశమున మతకలహములకు లెక్కలేదు. అవైదికమతము వైదికకాలమునుండియు కలదు. దేహాత్మవాద మనునది యొకటి ఉపనిషత్తులలోనే కనబడుచున్నది. ఈ వాదము క్రమముగా ప్రబలినది. ఈమతమువారిని తీర్థంకరులనియు, జైనులనియు వ్యవహరింపసాగిరి. ఈపరంపరలో ఇరువదినలువురు తీర్థంకరులు వెలసిరి. కడపటివాడగు మహావీరజైనుడు క్రీ. పూ. ఆఱవ శతాబ్దమువాడు, బుద్ధుని సమకాలికుడు. ఈతని మతము సామాన్యజనులకు అనుకూలముగా నుండినందున చాల త్వరగా బీహారుదేశమందును, అటనుండి కళింగాంధ్రములకును వ్యాపించినది. చంద్రగుప్తచక్రవర్తి కాలముననే మైసూరువఱకును వ్యాపించినది. తమిళదేశమున సంఘకాలమున, అనగా క్రీ. పూ. 300 లప్పుడు ప్రాధాన్యము నందినది. కుమారిలస్వామికాలమునకు జైనమతము ఆంధ్రద్రావిడకర్ణాటకదేశములలో మహోన్నతస్థితియం దుండెను. ఆంధ్రకళింగదేశములలో బౌద్ధజైనవిహారములు చిరకాలముగా నిర్మితము లగుచుండినవి. వైదికమతము నామమాత్రావశిష్టమై యుండెను. వైదికమతానుయాయులు నిక్షేపములవలె ఎచ్చటెచ్చటనో దాగియుండిరి. అట్టివానినుండి, నివురుగప్పిన నిప్పు, కుమారిలుడు ఎనిమిదవశతాబ్దప్రారంభకాలమున బయలుదేరెను.

అతడు జైనబ్రహ్మచారివేషము ధరించెను. జైనగురువులకడకు పోయెను. వారి రహస్యముల నెన్నింటినో గ్రహించెను. తుదకు జైనవిద్యాపారంగతు డాయెను. కాని ఈతని తోడివిద్యార్థి యొకడు మొదటినుండియు ఈతనిపై గంటువహించియుండెను. ఒకదినము కుమారిలు డుండగా నలువురయెదుట వైదికమతమును చాల నిరసించెను. ఓర్వరాని కటువాక్యములను ప్రయోగించెను. సముద్రమువలె గంభీరుడు, భూదేవివలె క్షమావంతుడు, [illegible] నయతంత్రజ్ఞుడు కుమారిలుడు; కాని ఓర్వలేకపోయెను. పొంగివచ్చు దుఃఖాతిరేకమున నాతని నేత్రములనుండి బాష్పములు అతని వశములేకయే బొటబొట రాలినవి. తక్షణమే ఆ విద్యార్థి కుమారిలుని రహస్యమును బైట వేసెను. జీవకారుణ్యమే పరమావధియైన జైనమతమును బోధించు నా విద్యార్థియు, తదితరజైనులును నాలుగంతస్తుల మేడమీదినుండి కుమారిలుని క్రిందికి త్రోసిరి. పడుటలో కుమారిలునికి మంచిదెబ్బలే తగిలినవి; కన్నొకటి పూర్తిగా పోయినది.

ఎవరో తీసికొనిపోయి కాపాడిరి. ఇకను విద్యాభ్యాసము పూర్తియైన దని యాతడు తండ్రికడకు పోయెను. తండ్రి పరమానందమును జెందెను. తల్లి ఆ కంటిని తాకితాకి దుఃఖించెను. 'నాయనా, నీకోసం పాపం, ఆ శ్రీదేవి కాచుకొనిఉన్నదిరా' అనెను. కుమారిలునికి ఆశ్చర్యసంతోషములు కలిగినవి. వెంటనే తల్లిదండ్రులతో పద్మపురమునకు బయలుదేరెను. పరమానందభరితులై జాతూకర్ణీనీలకంఠులు వారిని ఆహ్వానించిరి. కుమారిలుడు మునుపటి కుమారిలుడేగాని ఒక కన్నుమాత్రము లేదు. అందులకు అందఱును చింతించిరి. శ్రీదేవియు చింతించినదిగాని అతడు మరల వచ్చినదే చాలునని సంతోషించినది. ఇంకనేమి, బావ జైనులను పచ్చడిచేయునని ఆమె నిశ్చయించుకొనెను. రాజసభాంతరములలో తన స్వామిదే విజయమని ఆమె ఊహాసౌధములు నిర్మించుకొనసాగెను.

శుభస్య శీఘ్ర మని వివాహప్రయత్నములు జరిగినవి. పెద్దలు బహువైభవముగా వివాహమును జరిపించిరి. దానికి వచ్చిన పెద్దలందఱు ఆ దాంపత్యమునకు సంతోషించినను పెండ్లికొమారునికి కన్నొకటి పోయినదే యని చింతింపనివారు లేరు. అదియే నాటి మాట అందఱినోటను.

౨

కుమారిలస్వామి తల్లిదండ్రులతోను, భార్యతోను జయమంగలమునకు బయలుదేరిపోయెను. శ్రీదేవి పద్మమును వీడిపోవునట్లు ఈ శ్రీదేవి పద్మపురమును వీడిపోవుచుండగా అందఱు చింతించుట ఆశ్చర్యము గాదు గాని పసిబాలుడు శ్రీకంఠుడు చాల నేడ్చెను. వానికి అక్కపెండ్లిలో వడుగుచేసిరి. బాల్యమునుండి తనకు అక్కయే చదువుచెప్పినది. అటువంటి యక్క దేశాంతరమునకు పోవుచున్నది. ఎక్కడి పద్మపురము,

ఎక్కడి జయమంగళము? మరల అక్కను చూచుట ఎప్పుడో! ఏమయిన నేమి? శ్రీకంఠుడు అక్కమీదనే తన మన సుంచియుండెను. అతని యుపాధ్యాయుడు జ్ఞాననిధిమహోదయుడు ఓదార్చి, తన యింటికి కొని పోయి వైదికవిద్యల నెల్లను అతిప్రీతితో నేర్పెను. క్రమముగ శ్రీకంఠుడు విద్యావంతుడై భట్టశ్రీకంఠు డాయెను.

శ్రీకంఠుని పెండ్లియాడు. విద్యాభ్యాసము పూర్తియైనంతట తండ్రి బంధువులలో వెదకి యుక్తవయస్కను, తుల్యగుణను, మహావిదుషిని, కుమారిలస్వామి పినతండ్రియైన విష్ణుభట్టాచార్యుని కొమారితను కొని వచ్చి శ్రీకంఠునికి వివాహమొనర్చెను. అమ్మాయిపేరు సరసవాణి. బాల్యమునుండి అలోకసామాన్యప్రతిభను ప్రకటించుచువచ్చినందున ఆమెను బంధువులెల్లరు భారతియవతార మని యనుచుండిరి. సంస్కృత ప్రాకృతములందు కవయిత్రిగావున ఉభయభారతి యని యామెకు ప్రసిద్ధి యేర్పడెను. ఉభయభారతి యనునది క్రమముగా ఉంబగా సంగ్రహింపబడి పుట్టినింట నామెకు ఉంబ యనియే వ్యవహార మేర్పడెను. ఆమెకు ఎట్టి వరుడు దొరకునో యని చింతించుచుండిన తలిదండ్రులకును, బంధువులకును పరమానందకరముగ మహావిద్వాంసుడు శ్రీకంఠుడు దొరకెను. పెండ్లిపందిటిలోనే ఎల్లవారికిని ఆదంపతులలో ఎవరు విద్యాధికులో యను వివాద మేర్పడెను. ఆవిషయము దంపతులే నిర్ణయించుకొనదగినదని యందఱును వారికే వదలిరి. అనురాగముచే శ్రీకంఠుడును, భర్తృగౌరవముచే ఉంబయు బదులు చెప్పలేదు. ఇట్టి లోకోత్తరపాండిత్యమును, దాంపత్యమును అసాధారణములు.

శ్రీకంఠుని వివాహమునకు అతని యక్క శ్రీదేవి రాలేదు. ఆ దేశమునుండి యీ దేశమునకు వచ్చుట చాల ప్రయాసతో కూడిన పని. దారిలో దొంగలగుంపు. పైగా ఏవేవో అడ్డము లేర్పడినవి. సరిగా నప్పుడే శ్రీదేవి తొలితొలి గర్భిణిగా నుండెను. పెక్కుకారణములచేత శ్రీదేవికుమారిలస్వాములు శ్రీకంఠుని వివాహమునకు రాలేకపోయిరి. అది వారికందఱు తీరని కొఱతయే. కాని ప్రాప్తమునకు ఎవ రేమి చేయగలరు?

క్రమముగా ఉంబయు భర్తతోకూడ విద్యావ్యాసంగమున పండితులతో పాల్గొనసాగెను. శ్రీకంఠునికిని కాలక్రమమున నాతని పేరు మఱిగిపోయి ఉంబాభర్తగాన ఉంబేకాచార్యు డని వ్యవహార మేర్పడెను.

పద్మపురము నేటి బీరారునందు కలదు. శ్రీకంఠుని కాలమునకు ఆ దేశము ఆంధ్రదేశమునందలిదే. నేటికిని తెలుగు మాటలాడువారు ఆ ప్రాంతమున గలరు. శాతవాహనులు పాలించిన దక్షిణాపథము వారి తర్వాత పెక్కు రాజవంశములవారిచే విభక్తమైనది. పశ్చిమమున కదంబులును, వారితర్వాత చాళుక్యులును, దక్షిణమున పల్లవులును, తూర్పున ఇక్ష్వాకుసాలంకాయనవిష్ణుకుండినులును పాలించిరి. శ్రీకంఠుని కాలమున బాదామిచాళుక్యు లింకను గలరు. వేంగియందు చాళుక్యుల యాధిపత్యము ఏర్పడి దాదాపు వందసంవత్సరము లైయుండినది. బీరారువఱకు నేటి తెలంగాణము వీరి స్వాధీనమందే యుండె ననుటలో నతిశయోక్తి లేదు. దేశమందు సంస్కృతప్రాకృతములు పర్వియుండినవి. ప్రాకృతము పామరవ్యవహారమందే గాక కవిత్వమునకు నుపయోగపడుచుండెను. శైవవైదికజైనబౌద్ధమతములు చెలరేగి ఆయామతానుయాయులు దేశమందు వాదప్రతివాదము లొనర్చుకొనుచుండిరి. తెనుగున కవిత్వము ప్రారంభమైనదిగాని ఇంకను రాజసభల కెక్కలేదు. అందుచే ఆంధ్రుడైన శ్రీకంఠుడు సంస్కృతప్రాకృతములలో కవియాయెను.

శ్రీకంఠునికి దేశాటనరాజసభాప్రవేశములు చేయవలయు నను తలంపు కలిగినది. వైదికమార్గనిష్ఠుడైనను శైవమతమును అభిమానించెను. బౌద్ధులనినను ఆతనికి ప్రియమే. ఆంధ్రదేశమందు నాడు శ్రీశైలము నేటివలెనే గొప్ప శైవక్షేత్రము. నేడు తగ్గిపోయినది గాని నాడు ఎచ్చటెచ్చటివారును అచ్చటికి చేరుచుండిరి. పండితప్రకాండుడు శ్రీకంఠుడు పత్నీసమేతుడై మల్లికార్జునస్వామిని దర్శించెను. అచ్చటి పండితులతోడి వాదములలో పాల్గొని క్రమముగా వారిచే

ప్రేరితుడై బ్రహ్మసూత్రములకు శ్రీకంఠభాష్య మను పేరి శైవభాష్యమును రచించెను. ఉంబ సాయము చేసెను. ఈ భాష్యమే శ్రీశైలవాసులకు, శ్రీకంఠు లనుపేరి శైవులకు మతగ్రంథ మాయెను. కాని కొంద రద్వైతులు శ్రీకంఠుని భాష్యము నాక్షేపింపసాగిరి.

అచటినుండి జయమంగలమున కేగి అక్కను, బావను చూడగోరి శ్రీకంఠుడు సన్నాహమున నుండగా కుమారిలస్వామి దేశాంతర మేగె ననియు, నాయూర, వారి కుటుంబము లే దనియు తెలిసినది.

## 3

ఈలో జయమంగల మను గ్రామమున, శ్రీకంఠుని వివాహకాలమున గర్భిణిగా నుండిన శ్రీదేవికి జయమిశ్రు డని యొక కుమారుడు శుభలగ్న మున జనించెను. అం దేమి శుభమోగాని పాప మాయ మకు ప్రసవానంతరము వ్యాధి గల్గి మంచమే గతి యాయెను. కొంతకాల మట్లుండి ఆయమ గతించెను. కుమారిలుని జీవితమందు అ దొక తటిల్లత. అతని యందే అభిమానముంచి, కన్నొకటి పోయినను వివా హము చేసికొని, తమ్ముని వివాహమునకుసయితము పోక తనకడనే యుండి అసువులంబాసిన పత్నికై కుమారిలస్వామి క్రుంగిపోయెను. బాలుని కొంత కాలము తల్లిదండ్రుల సాయముతో పెంచెను. క్రమ ముగా నాతని తలిదండ్రులును గతించిరి. కుమారుడు ఏడేండ్లవా డైనంతట ఉపనయన మొనరించి తనవెంట దీసికొని బయలుదేరెను. కుమారిలుడు మరల వివాహ మాడలేదు. జయమంగలమునకు శ్రీకంఠుడు పోదలంచు టకు కొంతకాలముముందే ఇదెల్ల గడచెను. శ్రీదేవి మరణము శ్రీకంఠునికి తెలియదు.

ఇక కుమారిలుడు జైనమతమును నిర్మూలించు టకు కంకణము కట్టుకొనెను. వేదము స్వతస్సిద్ధ మనియు, తదుక్తకర్మమే ఇహపరసుఖప్రద మనియు, కావున వేదోక్త దీక్షయుడు కడనియు సిద్ధాంతీ కరించెను. వెంటనే ప్రచార మారంభించెను. అప్పుడు మేదినీపురము రాజధానిగా నా దేశమును సుధన్వుడను రాజు పాలించుచుండెను. మేదినీపురమే నేటి మిడ్నా పూర్. ఇది ఒరిస్సా వంగాలుల నడిమిఎల్లలో నున్నది. జైనులు పలువురు ఆ రాజుయొక్క ఆస్థానము చేరి రాజును జైనమతాభిమానిగామాత్రమే కాదు వైదిక మతద్వేషిగాసైతము చేసియుండిరి. వైదికకర్మలు దేశ మున సన్నగిలియుండెను. రాజమహిషిమాత్రము వైదిక మతాభిమాని, విదుషి, భర్తతో వైదికమతప్రాశస్త్యముం గూర్చి వాదించుచుండును. భర్తయొక్క మొండిపట్టు దలకు చాల చింతించి అతనిం ద్రిప్పుటకు మార్గము వెదకుచుండెను.

ఒకనాడు కుమారిలస్వామి మేదినీపురమునకేగి మహారాణియొక్క మేడకు సమీపమున పోవు చుండెను. ఆసమయమున మహారాణి వైదికమతోద్ధరణ మెట్లు జరుగునా యని చింతించుచు నిట్లొక శ్లోకమును చదువ నారంభించెను.

'కిం కరోమి, క్వ గచ్ఛామి, కో వేదా నుద్ధరిష్యతి'

(ఏమి చేయుదును, ఎట కేగుదును, వేదముల నుద్ధరించువా రెవరు?)

ఆ వాక్యములు వినుచుండిన కుమారిలస్వామి వెంటనే సంతోషముతో గగుర్పాటునొంది—

'మా నిషీద వరారోహే, భట్టాచార్యోస్మి భూతలే'

(చింతింపకుము తల్లీ, నేనున్నాను భట్టాచార్యు డను.)

ఆ వాక్యములు విని రాణి ఆశ్చర్యపడి కుమారి లుని వెంటనే సౌధమునకు పిలిపించెను. ఆమె యడుగగా నాతడు తన వృత్తాంతమునెల్ల పూర్తిగా వచించెను. అతడు తప్పక జైనుల నోడింపగల డని యామె తలంచి అతనికి సకలోపచారములును జరుగు నట్లు ఏర్పాటులు చేయించి రాజున కెఱింగించెను.

కుమారిలభట్టాచార్యునకు రాజదర్శన మాయెను. అదిమొదలు రాజసభకు వచ్చుచు పోవుచు అతడు వాదార్థము సమయ మెదురుచూచుచుండెను. ఒకప్పుడు రాజసభలో నాత డుండగా కోయిల దూరమున 'కుహూ' అనినది. వెంటనే కుమారిలుడు కోయిల మీది నెపమున నీ శ్లోకమును చదివెను:

"మలినై ర్ఛిన్న సంగస్తేనీచైః కాకకులైః పిక
శ్రుతిదూషకనిర్హ్రాదైః శ్లాఘనీయ స్తదా భవేః"

ఈ శ్లోకము రాజునకు అన్వయించెను. నీచులగు జైనులచే రాజు పరివృతు డని యాతని భావ మని రాజు గ్రహించెను. అతడు మోము చిన్నబుచ్చుకొనెను. మంత్రులు ఉద్వేగము నందిరి. జైనపండితులకు కోపము వచ్చినది. సభాసదులు గుసగుస లారంభించిరి. అప్పు డొక వృద్ధజైనపండితుడు సభవారిని నివారించి రాజుం గాంచి "మహారాజా, జైనమతము దుష్టమనియు, వైదికమతము అత్యుత్తమమైనదనియు ఈ కుమారిలుడు తలంచి ఆ మాటలు పలికినాడు. అందుచే సభయంతయు కలవరము జెందియున్నది. కాబట్టి ఈ రెండు మతధర్మముల గుణావగుణములను వివాదముపై నిర్ణయింపవలసినది." అని కోరెను. మహారాజు సుధన్వు డంగీకరించి ఒకనాడు వాదమున కేర్పాటు చేయించెను.

సభ సమావేశమైనది. ఎచ్చటెచ్చటివారును వచ్చి గుమిగూడిరి. ఉభయమతాభిమానులును వచ్చి చేరిరి. అంతవఱ కెచ్చట నుండిరోగాని వైదికమతస్థులు గుంపులుగుంపులుగా వచ్చిరి. తమకు మరల మంచి కాలము వచ్చిన దని తలంచిరి కాబోలు. మహారాజు సింహాసనము నలంకరించెను; మహారాణియు వచ్చి చెంత గూర్చుండెను. పిమ్మట కుమారిలభట్టాచార్యుడును వచ్చి మధ్యవర్తుల నెన్నుకొని జైనులలో శ్రేష్ఠుడగు వానితో వాదమున కారంభించెను. "వేదమునందు చెప్పబడిన కర్మములే ఆచరణీయములు; తద్వ్యతిరేకములు త్యాజ్యములు" అని కుమారిలుడు ప్రతిపాదించి ఉపన్యసించెను. "వేదములు పౌరుషేయములు. అందు జెప్పబడు యజ్ఞాదికర్మలు హింసాత్మకములుకావున వేదకర్మములు ఆచరింపదగనివి. అహింసాత్మకములైన జైనధర్మములే ఆచరణీయములు" అని జైనాచార్యుడు ఖండనోపన్యాసము గావించెను.

అందుమీద వివిధశాస్త్రసంబంధములగు వాదములు ఖండనమండనములతో చెలరేగినవి. ఈవిధముగా కొన్ని దినములు వాదప్రతివాదములు జరుగుచునే యుండినవి. ఉభయపక్షములవారి యిండ్లలోకూడ చిన్న చిన్న సభలు జరుగుచు ఒకరి కొక రాలోచనలు చెప్పుకొనుచుండిరి. కుమారిలభట్టాచార్యుని యుక్తిప్రత్యుక్తులకు ఎల్లవారును ఆశ్చర్యపడుచు జైనేతరులెల్లను ఈతడు సాక్షాత్తు కుమారస్వామియవతారమే యని యనుచుండిరి. తుదకు జైనపండితులెల్ల ఓడిపోయి తమ పరాజయమును ఒప్పుకొనిరి. మధ్యవర్తులు కుమారిలునికే జయపత్రిక నొసగిరి. జైనులకేకు లాతనికి శిష్యులై వైదికమత మవలంబించిరి. సహింపలేనివారు దూరదేశములకు పోయిరి. సుధన్వమహారాజు వైదికమత మవలంబించి రాణిని సంతోషపరచెను. మహారాణి కుమారిలభట్టాచార్యుని విశేషముగా పూజించి సత్కరించెను. తర్వాత నాతడు జైమినిమహర్షి రచించిన పూర్వమీమాంసాసూత్రములకు ఉపవర్షుడు రచించిన వృత్తి ననుసరించి శబరస్వామి రచించిన ధర్మసూత్రభాష్యములను గ్రహించి తంత్రవార్తిక మను పూర్వమీమాంసాగ్రంథమును రచించెను. అతనికి ప్రభాకరభట్టు, పార్థసారథిమిశ్రుడు మొదలైనవారు శిష్యులై ప్రచారము మొదలిడిరి. దూరదేశముల కేగిన జైను లందఱును కుమారిలుడు గురుద్రోహి యని ప్రచారము మొదలిడిరి.

## ౪

అద్వైతుల బాధ శ్రీకంఠునకు ఎక్కువ యాయెను. ఇక శ్రీశైలముకడ నుండరా దని తలంచి యాతడు బయలుదేరెను. ఇంతలో జాతూకర్ణి నీలకంఠులు పరమపదించిరి. పద్మపురమునకు పోవనిచ్ఛగింపక ఉంబా శ్రీకంఠులు కృష్ణా తుంగభద్రాతీరములను వదలి గోదావరీ తీరముపై పు రెండెడ్లబండిలో నడక సాగించిరి. ఉద్యోగికి దూరదేశ మేదికి వేములవాడలో నొక చాళుక్యశాఖ పరిపాలించుచుండెను. కాని వారు జైనులు. ఆ రాజుల యాస్థానమున తన కాశ్రయము లభింపదని తలంచి అట నిలువక అడవులు లోయలు కొండలు దాటి [illegible] బోదనమునకు పోయిరి. బోదనముకూడ వేములవాడ రాజ్యములోనిదే. అచట నారుం డగా గోదావరీతీరమునందలి లక్ష్మణావతీనగరము రాజధానిగా ధర్ముడను రాజు పరిపాలించుచున్నా డని యు, అప్పుడు ఆరాజుసభలో బౌద్ధజైనులకు వాదప్రతివాద

ములు జరుగుచున్నవనియు తెలిసినది. వినోదార్థము శ్రీకంఠుడు సభార్యుడై అచ్చటికి పోయెను.

అప్పుడు అచ్చటి పరిస్థితి—బప్పభట్టి యని యొక పండితుడు మహావిద్వాంసుడు గ్వాలియరును పాలించు చుండిన ఆమరాజు నాస్థానమున నుండెను. అచ్చట అతృప్తి జనించి దానిని వదలి దక్షిణదేశమున లక్ష్మణావతికి ఆతడు వచ్చి ధర్మునికి విద్యాగురువై అత్యంత ప్రియుడైయుండెను. బప్పభట్టిని మరల కొనిపోనెంచి ఆమరాజు ధర్మునిమీద కత్తిదచ్చి మోసముగా ప్రమాణము చేయించుకొని బప్పభట్టిని మరల కొని పోయెను. తన పండితుని వదలుట కిష్టము లేకపోయి నను ధర్ముడు దుఃఖముతో బప్పభట్టిని ఆమునికడకు పంపివేసెను. పండితుడును తన హృదయమును లక్ష్మణావతియందే యుంచి శరీరముతో మాత్రము గ్వాలియరు కేగెను.

ధర్ముని హృదయమున ఆమరాజుమీద క్రోధము పోలేదు. ఇట్లుండగా నొకప్పుడు వర్ధమానకుంజరు డను నొక పండితుడు బౌద్ధుడు ధర్మునికడకు వచ్చెను. అతని బోధవలన ధర్ముడు బౌద్ధుడై తన శత్రువునకు ఆమరాజునకు జాబువ్రాసెను. 'నీవు మాకు శత్రువర్గములోని వాడవు. నా పండితుని బప్పభట్టిని హరించినావు. ఇప్పుడు మన మిరువురమును యుద్ధమొనరించి జీవహాని చేయుటకన్న ధర్మమార్గమున పందెము వేయుదము. మాకడ నొక బౌద్ధపండితుడు కలడు. ఆయనతో సమానముగా వాదించువా డుండిన పంపుము. నీ పండితుడు ఓడిపోయిన నీ రాజ్యము నాది. నా పండితుడు ఓడిన నా రాజ్యము నీది.'

ఆమరాజు బప్పభట్టిని పిలుచుకొని లక్ష్మణావతికి వచ్చెను. ఆ పండితుల కిరువురకును వాక్కలహము ప్రారంభమాయెను. మధ్యవర్తిగా వారి[illegible]యును వాక్పతిరాజును ఎన్నుకొనిరి. ఈతడు క్షత్రియుడు, పరమారవంశస్థుడు, మహా[illegible]కుడు. ధర్మునికి సామంతుడు. వైదికమతస్థుడు. అట్టి సమయమున ఉంబయు, శ్రీకంఠుడును రాజసభాప్రవేశ మొనరించి వాదములను వినుచుండిరి.

వర్ధమానకుంజర బప్పభట్టిసూరులు ఒకరి కొకరు తీసిపోక అఱు నెలలు వాదించిరి. వాదములు ఒకప్పటికి ముగియునట్లు లేదు. ఆమరాజు తన కార్యములకు భంగమగుచున్నదని బప్పభట్టిని హెచ్చరించెను. ఆతడు తన యుపాసనాదేవతయగు సరస్వతీదేవిని ప్రత్యక్షీకరించు కొని ప్రార్థించెను. ఆమె యిట్లనియె—'అబ్బాయీ, బౌద్ధుని నోట అక్షువచనగుటిక యని యొకటి ఉన్నది. దానిప్రభావమున నతడు అంత వాగ్మిగా నున్నాడు. దానిని అతనికి పూర్వము నేనే ఇచ్చితిని. నీ వాతని జయింపగోరిన నతని నోటిని కడిగించి వాదమునకు పిలువుము' అనెను.

రహస్యము గ్రహించి బప్పభట్టి తన పూర్వపరిచితునికి వాక్పతికి ఇట్లు చెప్పిపంపెను: 'పూర్వపరిచయము ననుసరించి నీవు నా కొక ఉపకారమును చేయవలయును. నీవును మునుపు వాగ్దాన మొనర్చియున్నావు. నేడు తరుణము వచ్చినది. రేపు వాదమునకు ప్రారంభించుటకుముందు మమ్మిరువురను నోళ్లను కడిగికొనుట కాజ్ఞాపింపుము.' వాక్పతిరాజు పూర్వము బప్పభట్టి అచ్చట నుండగా నట్టి వాగ్దాన మొనర్చియుండెను. కాన నొప్పుకొనెను. ఇందలి మర్మము నాతడు గ్రహింపలేదు. వాదార్థము వాదు లిరువురును గూర్చుండగానే, తాను మధ్యవర్తిగాన, నిరువురను పుక్కిలించిరండని వాక్పతిరాజు ఆజ్ఞాపించెను. వెంటనే వా రట్లు చేసిరి. బౌద్ధుని నోటి గుళిక రాలిపోయెను. నా డాతడు ఓడిపోయెను. ఒప్పుకొనిన ప్రకారము ధర్ముడు తన రాజ్యమును ఆమున కొసంగెను. బప్పభట్టియొక్క ప్రార్థనమీద ఆముడు మరల ఆ రాజ్యమును ధర్మునికే ఇచ్చివేసెను. తక్షణమే గ్వాలియరుకు వెడలిపోయెను.

ఈ సందర్భమున శ్రీకంఠునికి బౌద్ధాభిమానము దృఢపడెను. వాక్పతిరాజుతో నంత మిత్రుడై తర్వాత శిష్యు డాయెను. వాదమున నోడిపోయిన వర్ధమానకుంజరుడు *ధర్మునితో వాక్పతి ద్రోహ మొనర్చె నని ఫిర్యాదు* చేసెను. ధర్మునికి కోపము వచ్చినది. శ్రీకంఠుడు వాక్పతికి ఆ కిటుకు తెలియదనియు, నాత డొనర్చిన సేవచే క్షమింపదగుననియు రాజును ప్రార్థించి వాక్పతిరాజును క్షమింపించెను.

౫

తర్వాత కొన్నాళ్లకు కన్యాకుబ్జమునకు యశోవర్మ ప్రభువాయెను. ఎనిమిదవ శతాబ్దప్రారంభకాలమునకు రాజాధిరాజును, మహాకవియు, నాటకకర్తయునైన కవిబంధువు శ్రీహర్ష దేవుడు గతించి దాదాపు అరువదిసంవత్సరములై యుండెను. బాణమయూరాది కవులు గతించి చాలకాలము కాలేదు. కన్యాకుబ్జము శ్రీహర్షునియనంతరము పలువురు సాహసికులచేత బడి శ్రీకంఠుని కాలమునకు యశోవర్మపాలనమునకు వచ్చెను. కన్యాకుబ్జము గంగానదీతీరమున నేటి ఢిల్లీ నగరమునకు దాదాపు రెండువందలమైళ్లు ఉత్తరమున నున్నది. దానికి దక్షిణమున దాదాపు నూరుమైళ్ళ దూరమున యమునానదీదక్షిణతీరమున కాలప్రియము సుప్రసిద్ధక్షేత్రము కలదు. ఈ క్షేత్రము నాడు మహోన్నతస్థితియం దుండెను. రాష్ట్రకూటరాజులును కొందఱు ఇచ్చట యుద్ధ మొనరించియున్నారు. యశోవర్మమహారాజు కన్యాకుబ్జమును వదలి కాలప్రియనాథక్షేత్రమును తనకు రాజధానిగా చేసికొనెను. (ఈప్రదేశమే నేడు కాల్పియనబడుచున్నది.) ఇట్లు చేయుటచేత అతనికి పశ్చిమమునుండి దండెత్తివచ్చునట్టి కాశ్మీరప్రభువు లలితాదిత్యముక్తాపీడుని బాధ తప్పెను.

ఈ యశోవర్మ చంద్రవంశసంజాతు డని యొకరును, మౌర్యసామ్రాట్టు చంద్రగుప్తుని వంశజుడని జైనులును తెలుపుచున్నారు. యశోవర్మ మహాజేత. దేశాంతరములతో వాణిజ్యవిద్యాసంపర్కములు గలవాడు. దూరదేశమైనను చైనాకు రాయబార మంపెను. బహుశః అతని యుద్దేశము తన సామ్రాజ్యమునకు, చైనాదేశమునకును నడుమ నుండు శత్రువులు తనపైనెత్తివచ్చినయెడల వారిని వెనుకనుండు చీనావారు కొట్టవలయునని యుండును. ఈ రాయబారము క్రీ. శ. ౭౩౧ లో జరిగినట్లు చైనీయుల గ్రంథములలో గలదు. కన్యాకుబ్జాధీశుడైన ఇ-ఛ-పఙ-మొ (యశోవర్మ) తన మంత్రియైన సెంగ్-పో-త (?) అనువానిని చీనాకు పంపియుండెను.

యశోవర్మ ఉత్తరదిక్కున నాపద రానీయక కాపాడుకొని దిగ్విజయ మారంభించెను. వర్షావిరామసుభగమైన శరదృతువులో బయలుదేరెను. చల్లని మలయమారుతము వీవసాగెను. ఎచ్చటినుండియో పువ్వులవాన కురిసినది. పౌరాంగనలు మహారాజదర్శనోత్సుకలై కిటికీలకడకు వచ్చి చూడసాగిరి. కవులు వందులు సంగీతవిద్యాంసులును తమ కవిత్వస్తోత్రగానములచే రాజు నాశీర్వదించిరి. అతడు క్రమముగా తన రాష్ట్రమును వదలి సర్ణానదీతీరభూములకు వచ్చెను. ఇంతలో చలికాలమును వచ్చెను. అటనుండి యాతడు వింధ్యారణ్యముంజొచ్చి వింధ్యవాసినిం గనెను. మహాదేవిని పూజించి బయలుదేరెను. వర్షాకాలము ప్రారంభమాయెను. వింధ్యవాసిన్యాలయము నేటి యు. పి. రాష్ట్రమున మిర్జాపురమున నున్నది. మగధాధిపుడు యశోవర్మయొక్క సేనాసమూహముం గని పారిపోదలంచెనుగాని ధైర్యము తెచ్చుకొని ఎదుర్కొనెను. అతని సామంతులును ఎదిరించిరి. మగధాధిపునే గౌడుడని కొందఱు కవులు వ్రాసియున్నారు. మహాయుద్ధము పొసగగా యశోవర్మ గౌడరాజును రణరంగమున తాకి నఱికెను. అటనుండి బయలుదేరి ఏలాసుగంధభూయిష్ఠంబగు సముద్రతీరభూములకు పోయెను. తర్వాత వంగదేశమునకు పోయి దానిని జయించి అటనుండి లెక్కలేని ఏనుగులను గ్రహించి తర్వాత దక్షిణమునందలి సహ్యపర్వతములకు వచ్చి అచ్చట నొకరాజును జయించెను. తర్వాత పారసీకులను జయించి కవేరులను జయించెను. అటనుండి బయలుదేరిగోదావరీతీరమునందలి రాజులను జయించుచుక్రమమున లక్ష్మణావతికి వచ్చి ధర్ముని జయించెను. ధర్ముని సేనాపతిగా వాక్పతిరాజు ఎదిరింపగా నతనిని పట్టి చెఱవైచెను. అటనుండి పశ్చిమమునకు మరలి పర్వతదుర్గమ ప్రదేశములను జయించి నర్మదానదిని దాటి మరు (మార్వాడి) దేశము చొచ్చి శ్రీహర్షమహారాజుచే పావనమైన చరిత్రప్రసిద్ధ శ్రీకంఠదేశమునకు వచ్చెను. అచటినుండి హరిశ్చంద్రునిచే పవిత్రీకృతమైన అయోధ్యానగరమునకు వచ్చి, రాజుల కానుకలు గ్రహించి, దేవదారువృక్షముల రసములచే పరిమళవంతమైన హిమాలయభాగములను కూడ జయించి తన రాజధానికి మరలెను. తాను ముఖ్యముగా జం[illegible] మగధదేశమందు రణరంగమున యశోవర్మపుర మని యొక నగరమును నిర్మించెను. (సశేషము)

# మాయ ముత్యాలు

'శాస్త్రి'

అమూల్యమైన నవరత్నాలలోనూ ఒకటైన ముత్యము యొక్క జననరహస్యాన్ని గ్రహించి ప్రకృతిసిద్ధమైన ఈ అలంకారవస్తువుకు ఏమాత్రమూ తీసిపోని కృత్రిమముత్యాలను (మాయముత్యాలను) ప్రపంచమంతటా వెదజల్లినవాడు మికీమోటో.

ఈతడు జపాను దేశస్థుడు. చాలా బీదకుటుంబానికి చెందినవాడు. వీధుల్లో తిరిగి చేపలు అమ్ముకొంటూవుండేవాడు. తన 33 వ యేట ఒక సముద్రవస్తుప్రదర్శనం చూడడం తటస్థించింది. అక్కడ ఇతడు చాలా ఖరీదైన ఈ ముత్యాలనూ, అవి తయారగు విధానాన్నీ చూచాడు. సముద్రంలో వుండే ముత్యపుపురుగు (*Oyster*) దేహంలోకి ఒక ఇసుకకణంగాని, లేక ఒక ముత్యపుచిప్ప కణంగాని ప్రమాదవశాత్తూ ప్రవేశించి దానికి బాధ కలుగజేస్తుంది. ఈ బాధానివారణకోసం ముత్యపుపురుగు కాల్షియం కార్బనేటు (*Calcium carbonate*)ను అనేకవేల పల్చని పొరలుగా, ఈ సూక్ష్మకణంచుట్టూ స్రవింపజేస్తుంది. ఈ పొరలు క్రమంగా ఘనీభవించి ముత్యము అవుతుంది. సృష్టివైచిత్ర్యం! ఒక చిన్న ముత్యపుపురుగు తన ఆవేదనను అత్యంతలావణ్యమైన ఒక ముత్యంగా మారుస్తుంది!

దైవికంగా జరిగే ఈ పరిణామంలో ముత్యపుపురుగుకు మానవుడు తోడ్పడితే లాభం ఎందుకు వుండకూడదని మికీమోటోకు తట్టింది. వెంటనే అతడు ఆగో అఖాతానికి వెళ్ళి తన పరిశోధనలను ప్రారంభించాడు. ఇక్కడ సముద్రం ఎక్కువలోతు లేక ప్రశాంతంగానూ, సొరచేప మొదలైన క్రూరసముద్రజంతువులు లేకుండానూ ఉంటుంది. సుమారు పదివేల ముత్యపుపురుగులను పట్టుకొని పురుగుకూ, పురుగుచిప్పకూ మధ్య ఒక్కొక్క ఇసుకరేణువును వుంచి వాటిని మళ్ళీ నీళ్ళలో వదిలిపెట్టాడు. కొ[illegible]లతరువాతపరీక్షించి చూస్తే ముత్యాలు తయారయిన సూచన అతడికి ఏమాత్రమూ కనిపించలేదు.

మికీమోటో ఏమాత్రమూ నిరాశ చెందక తన పరిశోధనలు మళ్ళీ ప్రారంభించాడు. ఇసుకరేణువుకు బదులు చిన్న గాజుకణాలూ, ముత్యపుకణాలూ మొదలైనవి పురుగుశరీరంలోని అన్ని భాగాలలోనూ వుంచి, వివిధప్రమాణాల నీటిలోనూ, వివిధ శీతోష్ణపరిస్థితులలోనూ తన పరీక్షలు సాగించాడు.

రెండుమూడుసంవత్సరాలు ఈవిధంగా ఫలశూన్యంగా గడిచింది. ఈ ప్రయత్నాల ఫలితంగా అతడు అప్పులపాలు కావ్వాడు కాని అతడు ఏమాత్రమూ నిరుత్సాహపడలేదు. దీనికి తగ్గట్టు దురదృష్టవశాత్తూ మూడవసంవత్సరంలో ఒక గుంపులోని పురుగులు తప్ప మిగిలినవన్నీ నశించాయి. నిరాశ చెంది ఈ మిగిలిన పురుగుల్ని మికీమోటో, అతని భార్యా పరీక్షించారు. కాని ముత్యాలజాడ ఏమాత్రమూ కనుపించలేదు. ఆరురోజుల తర్వాత ౧౮౯౩ జూలై ౧౧ న అతడి కష్టాలకు ఫలితం కనిపించింది. ఒక పురుగును చంపి చూడగానే దానిలో అర్ధగోళాకారమైన ఒక ముత్యం కనుపించింది. అప్పుడు ఆ భార్యాభర్తల ఆనందానికి మేరలేదు. వెంటనే మిగిలిన పురుగుల్నికూడ పరీక్షించి చూస్తే ఇంకొక నాల్గు అసంపూర్ణంగా తయారైన ముత్యాలు కనుపించాయి.

వెంటనే మికీమోటో ముత్యాల తయారుపద్ధతికి స్వంతహక్కు (*patent*) తీసికొన్నాడు. "టటోకూ" అనే ద్వీపంలో పెద్దలెక్కను నాల్గుసంవత్సరాలు తన పరీక్షలు కొనసాగించాడు. మొదటిసంవత్సరంలో ఫలితాలు అంత తృప్తికరంగా లేకపోయినా తరువాతి సంవత్సరాలలో పంట బాగానే వుంది. ౧౯౦౧ సంవత్సరంలో ఏడవ ఎడ్వర్డుచక్రవర్తి పట్టాభిషేకసందర్భంలో జపాను ప్రతినిధి అయనకు కొన్ని మికీమోటో ముత్యాలను బహూకరించి అందరికీ ఆశ్చర్యం కలుగజేశాడు. మికీమోటో కీర్తి నలుదిశలా ప్రాకింది. జపానుచక్రవర్తి ముత్యాలను పండించే ఈ శాస్త్రవిధానాన్ని అతడిద్వారానే విని కుతూహలపడి అతనిని తనవద్దకు రావించి గౌరవించాడు.

అయితే మికీమోటో గోళాకారంగల ముత్యాలను పండించడంలో ఇంకా పూర్తిగా ఉత్తీర్ణుడు

కాలేకపోయాడు. ఇల్లా వుండగా ౧౯౦౫వ సంవత్సరంలో అదృష్టవశాత్తూ అయిదు ఉత్కృష్టమైన గుండ్రని ముత్యాలు లభించాయి. ప్రమాదవశంవల్ల ముత్యపుపురుగుమాంసంలో ఇసుకకణాలు ప్రవేశించడంవల్ల దానిచుట్టూ కాల్షియంకార్బనేటు ఘనీభవించి ఈ ముత్యాలు తయారయ్యాయని అతడు తెలిసికొన్నాడు. ఇంతవరకూ ఈ కణాలు పురుగుచిప్పకు మాంసానికి ఉంచడంవల్ల ఈ ద్రవం అన్నివైపులా సమానంగా పేరుకొనడానికి అవకాశం లేక ముత్యాలు అసంపూర్ణంగా అవుతూవచ్చాయి.

దీనితో మికీమోటోకు ముత్యాల రహస్యం పూర్తిగా తెలిసిపోయింది. వెంటనే ఇసుకకణాలు, ముత్యపుకణాలు పురుగుమాంసంలోనే వుంచి తన పరీక్షలు సాగించాడు. ఈ పనికి చాలా నైపుణ్యం కావాలి. కణం చాలా లోతుగా పోతే పురుగు చచ్చిపోతుంది. లేకపోతే కణం బయటికి ఊడిపోయే అవకాశం వుంది. ఈపనికి ప్రత్యేకనిపుణులు అవసరం. పరీక్షలో మొదటి నూరుపురుగులలో ఆఱు అత్యంత సౌందర్యమైన ముత్యాలు దొరికాయి.

ముత్యాలను పెద్ద లెక్కను పండించడంలో కృతకృత్యుడు కాగానే, మికీమోటో, ముత్యపుపురుగులు క్రూరసముద్రజంతువుల బారి పడకుండా అనేక మార్గాలను అన్వేషించాడు. సముద్రంలో బ్రహ్మాండమైన తీగపంజరాలను నిర్మించి వాటిలోనే పురుగులు జాగ్రత్తగా పెరగడానికీ, ముత్యాల పంటకీ ఏర్పాట్లు చేశాడు. పంట ఎక్కువ ఫలవంతంగా వుండే శీతోష్ణస్థితులు, జలప్రమాణాలు మొదలయినవాటిని నిర్ణయించుకొన్నాడు.

అసలు ముత్యాల ధరలో నాల్గవవంతు ధరకు మాత్రమే తన ముత్యాలను యూరోపులో మికీమోటో అమ్మడం ప్రారంభించగానే పెద్ద సంచలనం బయలుదేరింది. అసలు ముత్యాలకూ, ఈ తక్కువఖరీదుగల ముత్యాలకూ గల భేదా తెలిసికోవడం చాలా కష్టమయినపని అయింది కొనేవారికి. ఈ భేదా తెలిసికోవడం ఒక్క X కిరణాల సహాయంలోనే వీలుపడుతుంది. అసలు ముత్యాల వర్తకులకు చాలా నష్టం వచ్చింది. వెంటనే వారంతా ఈక్రొత్తముత్యాలను, వాటిని విక్రయించేవారిని వెలివేశారు. దానితో ఈ తగవు న్యాయస్థానానికి వెళ్ళింది. అసలు ముత్యాల వర్తకులు ఈ క్రొత్తరకపు ముత్యాలు నాణ్యమైనవి కావని ఋజువు చేయడానికి ప్రయత్నించారు. ప్రఖ్యాత శాస్త్రవేత్తలు చాలా గట్టిపరీక్షలు చేసి ఈ ముత్యాలు అన్నివిధాలా నాణ్యమైనవే నని నిర్ణయించారు. అసలు ముత్యానికీ, ఈ మికీమోటోముత్యానికీగల భేదా వొక్కటే. అసలు ముత్యంలో కేంద్రకణము (*central particle*) స్వాభావికంగా ముత్యపుపురుగు దేహంలో ప్రవేశిస్తుంది. మికీమోటోముత్యంలోని కేంద్రకణం శాస్త్రీయంగా కృత్రిమంగా వుంచబడుతుంది. అంతే. చివరకి మికీమోటోయే గెలుపొందాడు.

తరువాత అతడు ప్రపంచంలోని అన్నిముఖ్యనగరాలలోను తన ముత్యాలను విక్రయించే కేంద్రాలను నెలకొల్పాడు. ఒకానొక కాలంలో ప్రపంచంలో మొత్తం ముత్యాల పంటలో నూటికి ౮౫వంతులు మికీమోటో తన నూతనవిధానంప్రకారం పండించిన ముత్యాలే! ౧౯౨౧వ సంవత్సరంలో అతడు తీసికొన్న స్వంతహక్కుగడువు తీరిపోయింది. వెంటనే అనేకమంది పోటీదారులు ముత్యాలను పండించడం ప్రారంభించారు. వీరిలో చాలామంది అతడివద్ద తరిఫీదు పొందినవారు. కాని వారంతాకూడ చవకరకపు ముత్యాలను విక్రయించడం ప్రారంభించారు. దీనితో మికీమోటో వీరందరికీ పాఠం చెప్పడానికీ, తాను ఉత్తమరకపు ముత్యాలనే విక్రయిస్తానని లోకానికి తెలియజెప్పడానికీ, ౧౯౩౩ సంవత్సరం జూలై ౧వ తేదీన ౮౫౦,౦౦౦ రెండవరకపు ముత్యాలను ఒకగుట్టగా పోసి దగ్ధపటలం చేశాడు!

యుద్ధకాలంలో మికీమోటోవ్యాపారం నీరసించి ఇప్పుడిప్పుడే తేరుకుంటోంది. ఈతడికి ఇప్పుడు ౯౧ సంవత్సరాల వయస్సు. "ముత్యాలహారం ధరిస్తే వ్యాధినివారణ అవుతుం దన్ననమ్మకం మాట ఎట్లా వున్నా, ఒక్క ముత్యాలహారం బహూకరింపబడడంతోనే స్త్రీకి అన్ని మూలుగులూ పోయి, ఆమె మందహాసవదన అవుతుంది" అంటాడు మికీమోటో!

# రాజ జామాత

(గీతికా రూపకము)

శ్రీ శివశంకరశాస్త్రి

●

పాత్రలు:

| | | | |
|---|---|---|---|
| ఖంఖుడు | ... కాశ్మీర ముఖ్యామాత్యుడు | కజ్జ | ... ... అంతఃపురపాలిక |
| దుర్లభవర్ధనుడు | ... ... రాజ జామాత | వసంతలేఖ | ... ... ,, ,, |
| బలాదిత్యుడు | ... ... కాశ్మీరమహారాజు | సుగంధ | ... ... ,, ,, |
| అనంగ లేఖ | ... ... రాజపుత్రిక | బింబాదేవి | ... ... కాశ్మీరమహారాజ్ఞి |

రంగములు: శ్రీనగరములోని రాజప్రాసాదమున; కాలపరిమితి ఇంచుమించుగా సప్తాహము.
క్రీ. శ. పదవశతాబ్ది.

●

## ప్రథమరంగము

(కాశ్మీరమహారాజు బలాదిత్యుని ప్రాసాదములో స్త్రీజనము వసించు భాగము. ద్వారముకడ ఖడ్గహస్తయైన కజ్జ కానబడును. ఇంతలో ఒకప్రక్కనుండి ఖంఖామాత్యుడు మెల్లగా ప్రవేశించి, యిటునటు చూచి, ద్వారము సమీపించును. ఖంఖుడు సంజ్ఞలు చేసి, నిష్ప్రయోజనమని యెంచి, ఉభయపార్శ్వములను పరీక్షించి, కజ్జబాహువు స్పృశించి, మందస్వరములో)—

ఖంఖుడు

కజ్జా, యేటికో కదలవు మెదలవు!
అన్యమనస్కగ నగపడె దేలనో!

నీపాదద్వయి నేలకు దృఢముగ
శంకుకీలితము చాడ్పున దోచును.

ఎప్పటియట్టుల నీవిభావరిని
ఉత్సాహముతో నుండవు కజ్జా!

కారణమ్ము నే గ్రహింపలేనే,
ఏమో తెలుపవ యింతటనైనను?

కజ్జ

దండమ్ము దండమ్ము దయయుంచి వెడలుడీ
సమయాన వేగమే! జామాత! జామాత!

ఖంఖుడు

చాలునులే! నీ చాతుర్యమ్మును
కట్టిపెట్టవలె కజ్జా, యిటుపై.

కజ్జ

భద్రమ్ముగా నేను పాలింపవలెగదా
అంతఃపురస్త్రీల నన్నివేళలయందు?
అసమయంబున మీర లరుదెంచినా రేల?
జాయకడ నుండవలె జామాత-జామాత

ఖంఖుడు

మోసగింపగా జూనయకు మోసీ!
బయలుపడెను నీ పాలననైపుణ్యం!

ఏకడ జనియెనో యెరుగుదులే: మన
ప్రభుజామాతను పలుకరించితిని.
మార్గమధ్యమున - మరలి రా డతడు
త్వరితముగా నిక ద్వారము తెరపుము.

కజ్జ

అది కాదు స్వామి, మీ రన్ని తెలిసినవారు:
అంతఃపురద్వార మట్టి తెరచుట యెట్లు?

ఖంఖుడు

ఊరక ద్వారం బున్ముక్తం బగు
నని యెన్నడు నే ననుకొనలేదే.
పసిడికోలతో బద్ధద్వారము
అనువగు తెరచుట కశ్రమమ్మగనె.

(ముంజేతివలయము తీసి యిచ్చును)

కజ్జ

(నమస్కారపూర్వకముగా స్వీకరించి,ద్వారము తెరచి ప్రక్కకు నిలిచి)

క్షమియింపవలె మహాస్వామి, సరసోక్తులను!
దయతప్పనీయకుడు తమ దాసురాలిపై!

ఖంఖుడు

(ఖడ్గహస్తయైన వసంతలేఖను జూచి లోనికి నాలుగడుగులు వేసి, మృదువుగా)

వసంతలేఖా, వసంతలేఖా!

(ఆమె ముందరికి వచ్చును)

రయమ్మునం జని రాజకుమారికి
నివేదింపవలె నే వచ్చితినని.

వసంతలేఖ

స్వామీ, రాజకుమారిక -
సన్నిధియం దున్నవారో
జామాత,కనుంగొని నే
సత్వరమే మరలి వత్తు.

ఖంఖుడు

ఇదిగో వసంత! ఈ హారము నీ
కంఠమున కలంకారమగు జుమీ!

జామాత లేదు జాయసన్నిధిని,
వచ్చినటులు నే వైళమ తెలుపుము.

(హారము స్వీకరించి, తలుపు తెరచి యామె లోనికిపోవును. అతడు నిట్టూర్చి—)

అంతఃపురమున నడుగు పెట్టుటకు
అనుపదమ్మునను అంతరాయములె.

వసంతలేఖ

(మరలివచ్చి)

కుమారియానతి: కూరుచుండవలె
ఎందులకో, తమ రీస్థానముననె.

ఖంఖుడు

అనంగలేఖకు అనామయమ్మే?
నిజమ్ముగా నను నివారించినద?

వసంతలేఖ

ఆరోగ్యమ్మున ఆవంతేనియు
గోచరింప దేకొరత కుమారికి!

ఇంచుక వేచిన, నిచ్చటికే తా
రయమున వచ్చును రాజకుమారిక.

చూడుడు స్వామీ, సుఖాసీనులై
శిల్పసార మీచిత్రపటమ్మును.

(వసంతలేఖ వెడలిపోవును. ఖంఖుడు చంద్రశిలా వితర్దికమీది చిత్రపటమును రెండుచేతులతో బట్టుకొని ఎదుటి నిషణ్ణకముపై సుపవేశించి, విలోకించుచుం డును. అనంతరము రాజపుత్రి అనంగలేఖ పాదధ్వని కానీయక వెనుకనుండి ప్రవేశించి, రెండుచేతులతో అతని కన్నులు మూయును.)

ఖంఖుడు

చెప్పకే చెప్పలే చివురుటాకుకరాలు
కశ్మీరదేశమే కాక యావద్భరత
ఖండసౌందర్యైకకమలాలయా దేవి
కాయమ్ముగ ధరియించి కరుణతో నన్నో
అక్షిగోచర కాక అనుగ్రహించిన దానివా!

(పటమును వితర్దికపై నుంచి, ఆతడు లేచును. రాజకుమారి అతనిని గాఢాలింగనము చేయును.)

అనంగలేఖ

సప్తాహము భుజబంధన
సౌఖ్యం బెరుగని యీ తను
వెటు కృశించిపోయినదో
యించుక పరిశీలింపుడు !

ఏటికైన నామీదను
ఈరసంబు మీ మనసున
జనియింపగ లేదుగదా ?
సత్యము వచియింపవలయు.

ఖంఖుడు

(మందహాసముతో)

లావణ్యదుగ్ధాబ్ధి లక్ష్మిపై కినుకయా !
నక్రకేతను జీవనాడిపై కోపమా !
రాజకార్యధురంధరత్వమే పలుమారు
నీకు నాకును నడుమ నిలుచుచుండు అనంగ !

అనంగలేఖ

శత్రుఘ్నమాళవుల్ సచివోత్తములు భవ
త్సోదరుల్ బహుకార్యశూరు లున్నారుగా!
వారలైనను కొంతవరకు మీ భారమ్ము
తొలగింపగా నేల తోడ్పాటు చేయరో ?

ఖంఖుడు

సకలవిధమ్ముల సాయము చేయుదు
రిరువురు సోదరు లెల్లకార్యముల.
అయినను క్లిష్టం బవాపనీతి
క్రమమ్ము: స్వయముగ కనుగొనవలయును

అనంగలేఖ

(చిరునగవుతో)

అహహ మేటికి ? అంతఃపురమును
పరిపాలింపగ ప్రయత్నింపదగు!

ఖంఖుడు

కడు హర్షంబే ! కాని లేనిచే
ఈ యుద్యోగం బిప్పించెదవా ?

అనంగలేఖ

(అతని పెదవులు ముద్దుపెట్టుకొని)

అధికారము మీహస్తగతంబే,
ప్రభు వీవలెనా ప్రత్యేకముగా ?
కాశ్మీరము మీ కరచాలనమున -
నే కద నడచుట నిరుపద్రవముగ ?

ఖంఖుడు

అనుదినమ్మువలె అంతర్గృహమున
కరుగుదెమ్మనక ఆపితివే యిట ?
మోదముతో నీ మూడుయామములు
నీతో గడపగ నే నరుదెంచితి.

అనంగలేఖ

కడపవచ్చు - గడపవలయు :
కాని అంతరాయ మిపుడు
తల్లిరూపు దాల్చి రేయి
దాపురించె, నేమి చేతు !

ఎన్నడు నా మందిరమున
కిట్టివేళ రానియామె
పడిపోయినయట్లు వచ్చి
బయలుదేరకున్న దకట !

ఖంఖుడు

ప్రేమ కలది నీమీదను
బింబాదేవి శాంతమూర్తి
వార్ధకమ్మునందుగూడ
వరవర్ణినియే సుమ్మీ !
జనయిత్రికి నీమీదను
సంశయమ్ము లేదుకదా ?
అంతఃపురపరిచారిక
లామెతోడ జెప్పరుకద ?

అనంగరేఖ

అమ్మకు నామీద నెట్టి
యనుమానము లేనె లేదు,
అనుమానము కలుగుగాక,
అవంతయు భయము లేదు.
ప్రాణమ్ములమీది యాశ
పరిత్యజించికాని యిచటి
పరిచారిక యెవతె కూడ
పరులతోడ మాటాడదు.

ఖంఖుడు

కక్ష్య విడిచె నేమొ రాణి
కనుగొమ్మని యాజ్ఞయిమ్మ
హేతు వేమొ బింబాదేవి
యీ రాతిరి యరుదేరగ ?

అనంగరేఖ

మరి యే మున్నది - మాతృప్రేమము
ఊరక పొంగుచునుండు పాలవలె !

ఖంఖుడు

అనురాగము గల దగుటంజేసియె
అవరోధము లే కాటలు సాగుట.

(మృదువుగా చెక్కిలిపై తట్టును)

అనంగరేఖ

ఓసి సుగంధా, ఒకమా రిటురా !
జనని యున్నదో చన్నదొ చూడుము.

(కరవాలము కటిబంధమున దాల్చియున్న సుగంధ సుందరికి వచ్చి, నమితయై, వెడలిపోవును. ఇరువురును పీకనిషద్యపై గూరుచుందురు.)

ఖంఖుడు

(పటముతీసి)

అనంగ, చిత్రము కనంగ కనంగ
కనుంగవం గడు కనంబడుఁ గళ.
ఎవండు పటాన నవాద్భుతమ్మగ
నజీవమూర్తిని సృజించినాడో !

అనంగరేఖ

వచ్చుచున్నది జన్మవాసరోత్సవ మింక
నాల్గునాళులలోన నాకొరకె జనయిత్రి
చిత్రకారునిచేత చేయించినది నిన్న.
శిల్పనాభిఖ్యుండు చాల యోగ్యుడు, వర్ణ
చిత్రలేఖనమందు సిద్ధహస్తుం డంట
మూడురోజులలోన ముగియించినాడు నా
కట్టెదుటనే చిత్రకారుండు లేఖనము.

ఖంఖుడు

కూర్చుంటివా ప్రియా, కుదురుగా సుఖముగా
అతండు చిత్రించు నన్నిగడియలుకూడ ?

అనంగరేఖ

శ్రమము తోపగనీక చతురోక్తులం బల్కి
చల్లగా చిత్రించె చాటుకారుడు శిల్పి.

ఖంఖుడు

పంపగలవా ప్రియా, పటము మా భవనమున
కొకసారి భద్రముగ నుదయకాలమునందు ?
అస్మద్భవనసీమ కరుగుదెంచును శిల్పి
ప్రాతస్సమయమందె ప్రతిరూపము లిఖింప.

అనంగరేఖ

ప్రతిబింబమే నాకు పంపి, మీరలు దీని
గుప్తమ్ముగా నుంచికొనవచ్చు మీకడనె.

(వక్రముగా జూచి)

అయిన నే నిజముగా అందముగ నున్నాన?
తరిగిపోవుట లేద తపనీయవర్ణమ్ము?

ఖంఖుడు

(ఆమె సంకపాలిని జేర్చుకొని)

పదియారు వన్నియల పసిడివిగ్రహమేని
ఏనాటి కానాడె యెక్కించినను మెరుగు
క్రమముగా క్రమముగా కళలు గోల్పోవచ్చు
కాని తావకవపుర్గాంగేయదీప్తిలో
లవమైన తరుగునే లావణ్యదేవతా !

(అన్యోన్యాలింగనము)

అనంగలేఖ

మెరుగెక్కెనో యేమొ మీ దీర్ఘదోర్దండ
కమఠమ్ము చేత నా గాత్రచామీకరము.

(లజ్జాభినయము)

ఖుంఖుమ

గుప్తమ్ముగా నుంచుకొమ్మంటి వే। నీ
చిత్తరువు మాయింట శృంగారదేవతా!
బహిరంగముగనె నా పడకటింటను పటము
తగిలింతు కుడ్యమున తల్పమున కెదురుగా.
కనులుమూసినభవత్కమనీయవిగ్రహము
గోచరించును తలచుకొన్నంతమాత్రాన.
అయిన నేత్రోత్సవం బగుగాక నిరతమ్ము
ప్రత్యక్షముగ చిత్రపటములో నీ రూపు.
సతత మొసగునుగాక సౌందర్యసముదాయ
సారదైవతమూర్తి సాంద్రప్రమోదమ్ము!

అనంగలేఖ

ఊరకే అన్నాను: ఉండనిం డెదురుగా
శయ్యాగృహమునందె సకియచిత్రపటమ్ము.

సుగంధ (ప్రవేశించి)

కూరుచున్నవారు దేవి
కునుకుపాట్లు పడుచు, నన్ను
అడిగినారు రాకుమారి
అరుగుదేర లే దేమని.

అనంగలేఖ

శీఘ్రముగా వత్తుననియె
చెప్పి మాతతోడ, నీవు
భద్రముగా తక్కవాట
పార్శ్వమ్మును గాచుచుండు.

(సుగంధ వతశిరస్కయై వెడలును)

సాకు చెప్పకుండ మీరు
జన్మవాసరోత్సవమ్ము
చూడగ నేతేరవలయు
శుద్ధాంతములోని కార్య!

ఖుంఖుమ

బహిరంగముగ నాకు బంపువో నాహ్వాన
మెన్ని కార్యములున్న నే తెంతు ధ్రువముగా.

అనంగలేఖ

ఆదరమ్ముతో నాహ్వానించును
జనపతి మిమ్ముల స్వయముగ శీఘ్రమె.
ఉత్సవమ్ము మీ రుండక యె ట్లగు
శోభావంతము శుద్ధాంతములో?

(మందహాసము చేసి, ఏదో వాసన పట్టి)

మాటలసందడి మరచితి - నెచటిది
మీ శరీరమున మృదుపరిమళము?

ఖుంఖుమ

పంపినాడు సామంత
ప్రభు వొకండు; తావకీన
కంచుకమ్ము వాసించును
గాక రేపు యామవతిని.

(వక్షము నిమురును)

అనంగలేఖ

అపనయింపగా శ్రమమ్ము
ఆసవమును తెప్పింతున?

(అతడు తల త్రిప్పును)

మరచినాను బ్రాహ్మణు లను
మాట! నన్ను క్షమియింతుర?

ఖుంఖుమ

అధరామృతమును మించిన
ఆసవమ్ము కలదె ప్రియా!

అనంగలేఖ

(లజ్జాహాసములతో)

కలదుగదా యొక్కించుక
కాలవిలంబము దానికి.

ఫలరసమ్ము, హిమఖండము,
పానీయము తెప్పింతునా ?

(మృదువుగా ఘంటారావము వినబడును)

అబ్బబ్బా ! ఏమికర్మ,
మనమయమ్మునందు వచ్చు
పానకమ్మునందు పుల్ల
పగిదిని జామాత యిటకు !

(ఇంచుక కోపముతో)

తెరవవలదు ద్వారసీమ
తెల్లవారువరకు నటనె
నిలువనిండు ! కాకున్నను
నిజకక్ష్యకు బోవనిండు.

ఖంఖుడు

అన్యాయము! జామాతను
అంత బాధపెట్టవలదు.
నేనె వెడలిపోదునులే——
నేటికి తప్పదు విఘ్నము !

అనంగలేఖ

వీలు లేదు స్వామి, వెడలి పోవరాదు.
నేడు మీర లిటనె నిద్రచేయవలయు
ఇచట నున్నమీర లెవ్వ రేమిచేతు,
రదియు చూడవలయుఅచిరముగనె స్వామి!

ఖంఖుడు

ఇపుడు నన్ను జామాత
యిచట వీక్షించునేని
సరసముగా నుండ దన్న
సంశయమ్ము ప్రియతమా !

అనంగలేఖ

ఇటు రా సుగంధ ! ఈ భవనములో
స్వామికి సపర్య సలుపుచుండవే.

(పార్శ్వద్వారము తెరచి, సుగంధ లోనికి పోవును; ఖంఖుదును లోపలికి జనగానే తలుపు మూయును. ఆవల అనంగలేఖ వేరొక ద్వారార్గళము తీసి, వచ్చి, నిమద్యపై పరధ్యానముగా నుపవేశించును. మూడుమారులు తలుపుతట్టి జామాత మెల్లగా ప్రవేశించును)

దుర్లభర్ధనుడు

ఏకాంతముగ ప్రియా, ఇచట గూర్చున్నావు
ఏదో యాలోచించు చేకాగ్రదృష్టితో.

అనంగలేఖ

ఆకస్మికమ్ముగా నరుగుదెంచినవార
లెటనుండి ! ఆదిలో నెచటి కేగినవారో ?

దుర్లభర్ధనుడు
(భార్యకగ్గరగా గూరుచుండి)

ప్రాణప్రియా, రేయి పట్టనంబున గడప
బయలుదేరితి తొలుత: పథములో నీమీద
బుద్ధి మరలగ, నంతిపురమునకె వచ్చితిని.

అనంగలేఖ
(నిరుత్సాహముగా)

పురములోనికి మీరు పోవుటే సముచితము!
మార్గమధ్యములోన మరలె నాపై మనసు !
ప్రణయమూర్తులు గాన భార్య జ్ఞప్తికివచ్చె!

దుర్లభర్ధనుడు

క్షమియింపుము ప్రాణేశ్వరి !
సత్యమె వచియించువాడ
గ్రహియింపగలేవు నాకు
గల యనురాగము నీమెడ.

ప్రొద్దుపోయె ప్రాణప్రియ !
పోవుదమా యింకనైన
శయ్యాసదనములోనికి !
చాల ప్రొద్దుపోయినదే !

అనంగలేఖ

మనసు మరలినయపుడుమాత్రమే కావలయు
స్వీయ! ఎంతటి రసికశేఖరుల్ తమ రార్య!


రత్నం

# చివరి అంకం

[కథానిక]

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

'సంప్రదాయం' అనే సరికొత్త సాంఘిక నాటకం; చివరి అంకం స్టేజిమీద జరుగుతూంది. రిజర్వుడు క్లాసులో కూర్చొని అంతసేపూ అతితన్మయత్వంతో చూస్తున్న సన్యాసిరావుకు నాటకంలోని పాత్రలు, సంఘటనలు వీటిమీద మనస్సు నిలవడం లేదు. తన గతజీవితమూ, ప్రస్తుత పరిస్థితీ, భావికార్యక్రమమూ ఇవన్నీ ఒకదానితో ఒకటి పెనగొని, కలతపెట్టడంవల్ల చివరికి ఎట్టఎదురుగా ఏమి చూస్తున్నాడో కూడా గమనించని స్థితిలోకి వచ్చేడు సన్యాసిరావు. తెరపడిపోవడం, నలుగురూ లేవడం, అంతతో తనూ లేచేడు. అంతేకాని, ఆరంభంలో అంత ఉత్సాహంతో, అభిమానంతో చూడడం ఆరంభించిన నాటకం ఏవిధంగా సాంతమయిందో సరిగా తెలియలేదు, సన్యాసిరావుకు. అయితే చివరి అంకంలో అంత రభసంగా అందరు కొత్తపాత్రలను ప్రవేశపెట్టి, అన్ని పరస్పరసంబంధంలేని సంఘటనలు కిట్టించడం నాటకరచనదృష్ట్యా గొప్ప పని అయితే కావచ్చును గాని, తనకుమటుకు అట్టే రుచించలేదనుకొని, ఈ మాటే నాటకకర్త, తన బాల్యమిత్రుడు సత్యనారాయణకు రాయాలనుకొన్నాడు, హాలులోంచి బైటికి వస్తూ. ఆమాత్రం ఈమాత్రం అశ్రద్ధగా ఉంటేమాత్రం నాటకకథ అందరికీ తెలియవద్దూ? ఇంతకూ నాటకం చూడడానికి వచ్చేవాళ్లు ఏదో నాటకం చూసి కులాసాగా కాలం గడుపుదామని వస్తారుగాని, లెక్కల తెలివితేటలూ, సూక్ష్మతార్కికజ్ఞానమూ ఉపయోగించి బుఱ్ఱచించుకుందుకు రారుకదా! ఇది అతని ఊహాదాపుకఱ్ఱలు. ఇంతా తను అశ్రద్ధగా ఉన్నాడన్న విషయాన్ని ఒప్పుకొందుకు తన మనస్సుదగ్గర పడే మొగమాటం.

కాని నాటకంమాత్రం తన పనిని సన్యాసిరావుమీద అద్భుతంగా చేసిందనాలి. ఎంచేతంటే నాటకం చూడడం అన్నదే సన్యాసిరావు పద్ధతికి చాలా వ్యతిరేకమయిన సంగతి. ఈ పదేళ్లమధ్యనూ అతను నాటకాలకు అసలే వెళ్లలేదు. సినీమాలకుకూడా వెళ్లినది లెక్కగా ఏ అయిదారుమార్లో; అదీ ఇతరుల బలవంతం మూలంగానే. వాటిలో చూసినదిగాని, విన్నదిగాని అతనిని అట్టే ఆకర్షించలేదు. అటువంటి మనిషి ఈ నాటకంకోసం మూడునాలుగు రోజులు ముందుగా ప్రకటన చూసినప్పటినుండి, ఎదురుచూడసాగాడు. అయితే ఆ ఎదురుచూడడం నాటకం చూడాలన్న కుతూహలంచేతకంటె అది రాసినవాడు తన బాల్యమిత్రుడన్న కారణంచేత కావచ్చును. పైగా ఎవళ్లో అన్నారు—కవిగారుకూడా నాటకం ట్రూపుతో వచ్చి స్వయంగా డైరెక్టుచేస్తారని. బహుశః తా నీవూళ్లో ఉన్నాడని వాడికి (కవికి) తెలియకపోవచ్చు. అయితే తాను నాటకం ట్రూపు బసదగ్గరకువెళ్లి, తీరా వాడు వచ్చేడో లేదో, ఊరికే తాపత్రయపడి, నలుగురినీ అడిగి, నేను ఫలానా అని చెప్పుకొని, అతనితో మాట్లాడవలసిఉందని చెప్పుకొనేకంటె, లక్షణంగావెళ్లి టిక్కెట్టుతీసుకొని ముందువరసలో కూర్చొని నాటకం చూడడం మంచిది. ఈలోగా అతను వచ్చేడో లేదో తెలుస్తుంది. కాక, ఈలోపున అతనే తనను చూస్తే పలకరించడానికి సావకాశం కూడా కలగవచ్చు. లేకుంటే తను సామాన్యంగా నలుగురితోపాటు నాటకం చూసి వచ్చేస్తాడు. ఇది అతని ఏర్పాటు. చివరికి అదే మంచిదనిపించింది. నాటకారంభంలోనే ఎవరోనటకుడు వచ్చి చెప్పేడు—"సామాన్యంగా కవిగారు వచ్చి డైరెక్టుచేయగా ఆడడం మా పద్ధతిగాని, ప్రస్తుతం వారికి శరీరంలో అస్వస్థతగా ఉండడంవల్లనూ, అన్నాటికి ఎన్ని అవాంతరాలువచ్చినా నాటకం ఆడితీరాలి అన్నది మా ప్రధాన నియమంకావడంవల్లనూ మేము నాటకం ఆపుచేయకుండా ఆడుతున్నాం. ప్రశాంతంగా ఉండి, మధ్యమధ్యను పాతఅలవాటుచొప్పున వన్సుమోరులనకుండా ఉండవలసిందని మా ప్రార్థన."

మరీ చిక్కయిపోయింది. ఒక చిన్న సంగతి చెప్పాలని ఒక వాక్యం రాసేసరికల్లా, అందుకు ప్రతికూలంగా ఎన్నెన్నో ఉద్దేశాలు అహమహమికాభావంతో పొడుచుకొని రాసాగాయి. తనకు లోలోపల ఉన్న మానానికి తావు లేకుండా నిశ్చయంగా ఉంటున్నట్టు అదివరకు తోచిన విషయాలే, కాగితంమీదికి వచ్చే సరికల్లా ఏమిటో తనకు తెలియని, తన ఇష్టంతో అట్టే సహకరించని కొత్త సంగతులలాగ కనిపించసాగేయి.

కావాలని ప్రయత్నం చేసినంతసేపూ రాక పోయినా, అతని విసుగ్గానా, ఉత్తరమూ పూర్తి కాకుండానే నిద్ర వచ్చింది. ఎలా కుర్చీలోంచి లేచి వెళ్లి మంచంమీద పడుకొన్నాడో అతనికేమీ తెలీదు.

రోజూ ఉదయం సీతన్న వేళ్లన్నీ కాగబెట్టి, తెల్లవారే పర్యంతం లేవడం అలవాటు లేని సన్యాసిరావు ఆ రోజున, అందులోనూ పోలినాటిరాత్రి సరిగా నిద్ర లేకపోయినా కూడా అంత వేగంగా లేచి ఉండడం సీతన్నకు ఆశ్చర్యం కలిగించింది.

అతిత్వరగా స్నానం ముగించేసుకొని, సీతన్న కాఫీ తెచ్చేలోపున, కలంగ్జీ రాసేసి, "సీతన్నా, తక్కిన పనులు తరవాత చేద్దువుగానిలే, ముందిది పట్టుకొనివెళ్లి రంగనాథం (ఆఫీసరు)గారికిచ్చేసిరా" అన్నాడు.

కొన్ని సంవత్సరాలుగా ఏడాదికి రెండుమార్లు తద్దినాలకు తప్ప శెలవుపెట్టని సన్యాసిరావు శెలవు పెట్టడం సీతన్నకు ఏమీ బోధపడలేదు. ఆరోజు ఏమీ తద్దినంరోజు కాదే. రెండు తద్దినాలూ చైత్రమాసంలో వారంరోజుల వ్యత్యాసంతో వస్తాయి. వాటికి ముందు చాలా ప్రయత్నం చేస్తారు బాబుగారు. వంట బ్రాహ్మణ్ణి తెప్పించడం, బజారుసామన్లు తేవడం మొదలయిన తంతు చాలా ఉంది. కాక, కాఫీ తాగనేరు కూడా. ఏమో వంట్లో బాగుండడంలేదేమో! మామూలుగా ఉన్నట్లే ఉన్నారే.....ఆ యీ అనుమానా లన్నీ ఆ ఒక్క క్షణంలోనూ సీతన్న మొగంలో ద్యోతక మయేయి.

"ఏమంత చికాకు లేదు సీతన్నా. వెళ్లి అది ఇచ్చేసిరా. ఇవాళ ఏమిటో ఆఫీసుకు వెళ్లాలని లేదు. కాక, వేరే కొంత చెయ్యవలసిన పని ఉందిలే. దార్లో వస్తున్నప్పుడు హోటలులో భోజనం మామూలుగా తొమ్మిదిగంటలకు కాకుండా పదకొండుగంటలకు పంపమని చెప్పడం, ఒక నాలుగు ఇడ్లెన్నూ, ఒకదోసె, రెండు కిళ్లీలు తీసుకొనిరావడం చెయ్యాలి. ఇందు, రూపాయి. ఆఁ, దారిలో పోస్టాఫీసులో ఒక రెండు కవర్లు కూడా తీసుకొనిరా, వెళ్లు" అని, అదివరకే తను టేబిలుమీద తీసిఉంచిన ఫైల్సు తిరగవెయ్యడంలో పడ్డాడు.

ఉత్తరాలన్నీ ఒక గుత్తికం (ఫైలు); మనియార్డరురసీదులన్నీ ఇంకొక ఫైలు. తన జాగ్రత్తకు తనకే ఆశ్చర్యం వేసింది సన్యాసిరావుకు. మొదట్లో సత్యవతి ఒక ఆరునెలలు మనియార్డర్లు తీసుకోలేదు. అవన్నీ తిరిగివస్తే తానే సంతకంచేసి తీసుకొన్నాడు. అదే ఇంకొకరెవడయినా అయితేనా ఆ కారణం చెప్పుకొని తరవాత డబ్బు పంపడం మానివేసి ఉండును. తానుకాబట్టే...తరవాత ఒకపది సత్యవతిసంతకాలతోనే ఉన్నాయి. అక్కడనుండీ, ఆమె తనతరఫున తీసుకోవచ్చని చెప్పింది కాబోలు, బావమరిది వెంకట్రావు సంతకాలతోనే ఉన్నాయి తక్కిన రసీదులన్నీని. అలా కొంతసేపు కొత్తగా అక్షరాలు చదవడం నేర్చుకొన్న కుర్రవాడు ఎదురుగా కనిపించినవన్నీ చదవడానికి ప్రయత్నించినట్లుగా చదవసాగేడు పోస్టుముద్రలనూ, తను రాసిన విలాసాలనున్నూ. ఇన్ని సంవత్సరాలు నెలకొకటిచొప్పున రాసిన కాగితాలలో కూడా తన దస్తూరిగాని, ఉపయోగించిన సిరాగాని ఏమీ మారకపోవడాన్ని గమనించి గమనించి, ఇకమరి ఆలస్యం చెయ్యడం లాభంలేదని ఉత్తరాల ఫైలు తీసేడు. మొదట్లో అతని ఉద్దేశం సీతన్న తిరిగివచ్చే పర్యంతమూ ఏదో కాలక్షేపం చేసి, అప్పుడు టిఫిను తిని, స్తిమితంగా మధ్యాహ్నం భోజనంవేళ అయేవరకూ ఉత్తరాలు చదువుకొంటూ కూర్చోవాలని. కాని, అంతసేపు ఆగలేకపోయేడు.

ఒకమారు ఉత్తరాలు చదవడం ఆరంభం అయినతరవాత, అతనికి మరి తనచుట్టూ ఉన్న ప్రపంచంతో సంబంధం లేకపోయింది.

ఒక గంటసేపు టేబిలుమీద టిఫిను పడి ఉన్నతరవాత, సీతన్న మళ్లీ మళ్లీ జ్ఞాపకం చెయ్యగా, విసుక్కొంటూ, ఎడంచేత్తో ఉత్తరం పట్టుకొని చదువుతూనే, కొద్దిగా తిని అయిందనిపించుకొని, కిళ్లీలు

రెండూ ఒక్కమాటే వేసుకొని, మళ్లీ తన ఆలోకంలో పడ్డాడు.

మధ్యాహ్నం భోజనం సంగతీ అంతే. పని కొండగంటకు తెచ్చిపెట్టినది ఒంటిగంటకైనా ముట్టుకోలేదు. అప్పుడయినా సీతన్న గొడవ చేయడం వల్లనే. మేరీకూడా ఇంతవరకు ఆకలితో ఉండి పోయిందే అనుకొంటూ, అప్పుడు ఏదో కూర్చొని, కొద్దిగా తిని, ఆ చల్లారిన పదార్థాలు సహించలేదనీ, అసలు వంటకాలు ఏవీ బాగా లేవనీ తేల్చిపోయి వెంటనే బాగా స్ట్రాంగు కాఫీ పెట్టమన్నాడు సీతన్నను. అతని ప్రవర్తన ఒక్క సీతన్నకే కాదు, మేరీకూడా వింతగానే కనిపించసాగింది. రోజూ ఉదయం లేచినదగ్గరనుంచి ఆఫీసువేళ పర్యంతమూ తనతోనే కాలక్షేపం చేసే యజమాని, ఈ రోజున తనవంక చూడ నయినా లేదు. పైగా తను అమాత్రం ఈమాత్రం దగ్గరకు వెళ్లి, నెమ్మదిగా తన రాకను తెలియజేసినా పలు కరించడం లేదు. చూసి చూసి, ఏమిటిదంతా, నీకేమయినా తెలుసునా అన్నట్లు మొగం పెట్టి, సీతన్న దగ్గరికి వెళ్లి, వాడి వెనకాతల కొంతసేపు తిరిగి, వాడు కొంతసేపటికి ఏమీ తోచక కూర్చొని, చుట్ట తాగుతూ మట్టిచెప్పిన కాలుస్తూ ఉంటే, తానూ ఆ పొగ చూస్తూ వాడి కాళ్లదగ్గర కదలకుండా కూర్చుంది. వాడుగాని లేచి బాబుగారి గది దగ్గరకు వస్తే, తానూ వాడి వెనకాతలే వెళ్లేది. బాబుగారు చూస్తున్న కాగితాలలో ఏముందో, ఎందుకు ఆయన మధ్యమధ్య లేచి కాగితాలు చేత్తో పట్టుకొని అటూ ఇటూ పచారు చేస్తున్నారో, ఒక్కొక్కప్పుడు కదలకుండా నిలబడి గట్టిగా కళ్లుమూసుకొంటున్నారో సీతన్నకే దురవగాహంగా ఉంది. వాణ్ణి ఆశ్రయించుకొని ఉన్న మేరీకి ఎంత తెలుసునో ఊహించడం కష్టమే; కాని మొత్తంమీద, బాబుగారి అశాంతి కేవలం తమమీద కోపం కాదనీ, వేరే ఏదో కారణంవల్ల పుట్టినదనీ ఇద్దరికీ స్వభావసిద్ధమయిన విశ్వాసం ఉంది.

అలా కొంతసేపు చదవగా చదవగా సన్యాసి రావుకు ఒక కొత్తవిషయం స్ఫురించింది. ఇన్ని ఉత్తరాలలోనూ ఒకదానిమీదా రాసిన తారీఖుగాని, తేదీగాని లేదు. తానయితే వచ్చిన ఉత్తరాలన్నీ, అప్పటి ఉద్రేకాన్ని బట్టి చదివినా చదవకపోయినా, ఒకవరసను ఫైలుచేసేడు. ఇటీవల, అంటే ఏమిటి, సుమారు నాలుగేళ్లయింది ఇవి రావడం మానేసి. రాసి రాసి విరామం చేసుకొని రాయడం మానేసింది కాబోలు. తానూ, నెలజీతం తీసుకోగానే, అలవాటు చొప్పున బనియాగ్గుచేయడం తప్పిస్తే, ఉత్తరాలు రావడం ఆగిపోయి ఇంత కాలం అయిందని ఇన్నాళ్లూ స్ఫురించనేలేదు. తన ప్రస్తుత జీవితంలో ఆఫీసు వ్యవహారాలకు సంబంధించిన ఎక్కువ పని ఉంటే రోజులూ, తక్కువపని ఉంటే రోజులూ అనితప్ప, వ్యక్తిగతంగా తనకు అన్నిరోజులూ ఒక్కటే. నెలలూ సంవత్సరాలూ గడిచినా అణుమాత్రం భేదం లేనిదయిపోయింది తన జీవితం!

ఇప్పుడీ ఉత్తరాలన్నీ తేదీలు లేకుండా ఉన్నాయికదా, ఈ వరుస తప్పించేసి కలగాపులగం చేస్తే, మళ్లీ తాను సక్రమంగా పేర్చగలడా? ఏమో, ప్రయత్నించి చూడాలనిపించింది. ఎవరూ తోడు లేని మనిషి, పేకముక్కలు ముందు పరుచుకొని తాత్కాలికంగా ఏదో ఒక కొత్త ఆటను సృష్టించుకొన్నట్లు, అతను ఉత్తరాలన్నీ ఫైలులోనుంచి తీసి రాశిగా టేబిలుమీద పరిచేడు. ఇదివరకు చదవడం కేవలం చదవడమే. ఇప్పుడలాగ కాదు. చదివిన ప్రతి ఉత్తరం సుమారుగా ఏ సంవత్సరములో వచ్చిందో ముందు నిర్ణయించాలి. తరువాత దానితరవాత ఏది వచ్చిందో తేల్చుకోవాలి.

అందుకు ఉపక్రమణికగా గుడ్డివాడు కంటితో చూసి ఆనందించలేని డబ్బును చేతితో తడిమి చూసుకొని తృప్తిపడినట్లుగా, అన్ని ఉత్తరాలూ ఒక్కమారు అటూ ఇటూ కలిపి, గట్టిగా కళ్లు మూసుకొని, కుర్చీలో వెనక్కి చేరగిలబడ్డాడు.

కొంతసేపు అలా కూర్చున్న తరవాత కళ్లు విప్పి, ఏమీ ఎంపిక చెయ్యకుండా, చేతికి ఏది వస్తే అది అన్నట్లుగా ఒక ఉత్తరం తీసి, చదివిన ఉత్తరాలన్నీ సక్రమంగా పెట్టడానికి టేబిలుమీది ముందుభాగం అంతా ఖాళీచేసి చదవడం మొదలుపెట్టేడు.

"ప్రియమయిన రావుగారికి, మీ సత్యవతి అనేక నమస్కారములు చేసి వ్రాయునది :—

క్రిందటివారం నేను రాసిన ఉత్తరానికైనా జవాబు ఇస్తారనుకొన్నాను. కాని, ఆతరవాత ఇప్పటి కప్పుడే పోస్టుమేన్ ఈ ఊరు వారానికి రెండుమార్లు చొప్పున ఏడుమార్లు వచ్చేడు. అంటే దాదాపు నెల అయిందన్నమాట. మీకు నాయెడల దయకలిగివుంటే

ఈసరికే ప్రత్యుత్తరం రాసివుందురు. లేకపోయినా మళ్లీ ఉత్తరం రాసి శ్రమకలిగిస్తున్నందుకు మరింత కోపం రాకుండా ఉంటే చాలును.

క్రిందటిసారి పోస్టుమేన్ వచ్చినప్పుడే మళ్లీ మనియార్డరు పట్టుకొని వచ్చేడు. ఆ మూలంగానయినా నన్ను జ్ఞాపకం ఉంచుకొన్నందుకు సంతోషమే. అయితే, ఎప్పటిలాగే తిరగగొట్టడం జరిగింది.

మీకు నేనంటే అంత అసహ్యంగా ఉంటే, అసలు ఒక ఉత్తరం రాయడానికయినా ఇష్టం లేకుండా ఉన్నప్పుడు నాకు డబ్బుమాత్రం ఎందుకు పంపాలి? ఇదొక్కటే మీ విధి అంటారా? అదేమీ నాకు అర్థం కాదు.

నేను ఎలాగా పుచ్చుకోకపోయేదానికి నెల నెలా మీకు పంపడం శ్రమ ఎందుకు? అయితే ఒకటి - అతనిలో ఏమీ లేదు, ఇదే తెలివి తక్కువతనం, నుయ్యెక్కి విడిచి వచ్చేసింది; అయినా అతను - ఆ ధర్మంగానూ ప్రతినెలా డబ్బు పంపుతున్నాడు అనిపించుకోవాలంటే, పంపించండి. అందువలన నాకొచ్చే ఉపయోగం లేదు. మీకో శ్రమ. ఇలా పంపేకంటే, మీకంటే నామీద దయ లేదుగాని, నాకు మీరుతప్ప నిజంగా నా అనేవా రెవరున్నారు చెప్పండి? ఎప్పుడయినా అవసరంవస్తే నేనే రాస్తాను. అప్పుడు పంపవచ్చు.

ఎప్పటికయినా మీకు మళ్లీ నామీద దయ వస్తుందనే ఆశతో బ్రతికిఉంటున్నాను.

ఇట్లు
మీ సత్యవతి"

ఆఖరి వాక్యమూ, 'నాకు మీరుతప్ప నిజంగా నా అనేవా రెవరున్నారు చెప్పండి' అనే వాక్యమూ చదువుతూఉంటే, సన్యాసిరావుకు కళ్లలో నీళ్లు కమ్మేయి. బైటికి చదవకపోయినా గొంతు డగ్గుత్తికపడినట్లయింది. అప్పుడు ఆ ఉత్తరంఅందినవెంటనే తనలో కలిగిన భావాలన్నీ మళ్లీ ఒక్కమారుగా మెరిసేయి మనోయవనికమీద. వెధవ ఒంటరిజీవితం తనకుమాత్రం ఏమి బాగుండిగనక. వెళ్లి తన సత్యవతిని తాను తెచ్చేసుకొంటాడు. గుడ్డిలోకం ఏమనుకొంటే అనుకోనీ, తన కేం లక్ష్యం? ఎట్టఎదురుగా తనకు కనిపించే సౌభాగ్యన్ని విడిచిపెట్టుకొని, ఎక్కడో ఎవళ్లో తన వెనకాతల మాట లనకొంటారని తా నెందుకు భయపడాలి?........అనుకున్నాడేగాని, తన మనస్సునూ, సౌభాగ్యన్ని తానే నమ్మలేకపోయేడు. అప్పట్లో, పైగా, తక్కిన లోకమే కాదు, సత్యవతే తనను ఓడిపోయినవాడికింద లెక్కకడుతుందేమో నని అప్పటి రోజుల్లో తన భయం.

ఆ భయమే ఇంత చేసింది. తను ఒకింత ఓడిపోయినట్లు ఒప్పుకొన్నంతలో తనకు శాశ్వతంగా జరగబోయే దేముంది? ఆమె ఒకమాటు కాదు, ఇన్నిమాట్లు ఇంత విస్పష్టంగా ఒప్పుకొంటున్నదే తన ఓటమిని, పొరపాటును! అయినా తాను క్షమించలేకపోయేడు. కాని, ఇది క్షమించడానికి వీలైన పొరపాటా? ఏమి, ఎందువల్ల కాకూడదు? కొంతకాలం సంసారం చేసి, వైధవ్యం పొందిన స్త్రీలు మళ్లీ వివాహం చేసుకోవడం సభ్యమయిన ఈరోజుల్లో ఒక్కమారు పొరపాటుపడిన మనిషి, చిత్తశుద్ధిగా ఇంతగా పరితపిస్తూఉంటే, తిరుగా పరిగ్రహించడంలో ఉన్న దోష మేమిటి?

మరి ఆలోచన వేడిని భరించలేక, "అయితే ఇది మొట్టమొదటి ఆరునెలల్లోనూ చివ్వరిమారు డబ్బు పంపవద్దని రాసిన ఉత్తరంఅన్నమాట" అనుకొని టేబిలు మీద ఒకచివరనుంచి కొంత స్థలం విడిచిపెట్టి, ఆ ఉత్తరం పెట్టి, ఏదో తప్పనిసరివిధి అన్నట్లు ఇంకొకటి తీసేడు.

"ప్రియమయిన రావుగారికి, సత్యవతి అనేక నమస్కారములు చేసి వ్రాయునది:—

ఈవాళకి సరిగా మన పెళ్లి అయి ఆరేళ్లవుతున్నది. కాని, ఇంకా నాకుమాత్రం నిన్ననో మొన్ననో అన్నంత స్పష్టంగా అన్ని సంగతులూ జ్ఞాపకం ఉన్నాయి. నిజంగా అలాగే అయిఉంటే ఏ గొప్పమార్పువల్లనో ఈ ఆరేళ్లూ అసలు మధ్యను లేకుండాపోతే! కొత్తగా ఒకరినొకరం పిల్చుకొందుకే కాదు, బాగా తేరిపారచూసుకొందుకుకూడా మొగమాటపడడమూ, ఏ ఒకమాటఅంటే అవతలివారికి ఎలా ఉంటుందో అన్నట్లు సంకోచిస్తూ ప్రతిఒకపనీ రెండవవారి తృప్తికోసంమాత్రమే చేస్తూ, మధ్యమధ్యను వచ్చే కొద్దిగంటలఎడబాటునూ ఎన్నోయుగాలన్నట్లుగా బాధపడుతూ గడిపిన ఆరోజులు ఎంత తియ్యటివి!

